సరస్వత్యనుబంధము. ౩౧ వ.

శ్రీ

# కువలయాశ్వ చరిత్రము.

ఇది

సవరము చిననారాయణనాయక ప్రణీతము.

(సరస్వతీపత్రికనుండి పునర్ముద్రితము)

మొదటికూర్పు.

కాకినాడ:

శ్రీబాలసరస్వతీముద్రాక్షరశాల.

1903

వెల 8 అణాలు.

# పీఠిక.

ఈ కువలయాశ్వచరిత్రము సవరము చిననారాయణనాయకునిచే రచియింపఁబడి నారాయణభూపాలున కంకితమీయఁబడినది. కృతికర్త కీకృతిపతి పెంపుడుతండ్రి. ఇతఁడు తనవంశమునకుఁ గూటస్థునిగా సూర్యుని వర్ణించుటచేత క్షత్రియుఁడనియే తోఁచుచున్నది. కాని నాయకపదమేలవచ్చెనో తెలియకున్నది. మనదేశమందీనాయకపదము తఱచు శూద్రులయందుఁ గలదు. మఱియును మనదేశమున నచ్చటచ్చట బొబ్బిలిపాటగాండ్రుపాడు పాటలలో తిమ్మరాజుపాటలో "సవరము నారప్ప" యనువాని చరిత కొంత గలదు. ఆనారప్పయే యీకృతిపతి యేమోయని శంకవొడముచున్నది. ఈకృతిపతితండ్రిపేరు తిమ్మరాజు. ఈతిమ్మరాజు మిక్కిలి ప్రసిద్ధుఁడు. ఎంతవఱకు నిజమో తెలియదు. మఱియు నీకవి కాశ్యపగోత్రజుఁడౌటకూడ నాయకపదపక్షమునే రూఢిపఱచుచున్నది. ఏదియెట్లున్నను గ్రంథోక్తముగా క్షత్రియుల క్రింద వర్ణించుకొనినప్పుడు మనమును క్షత్రియులనక తీరదు. ఈకవి తనపూర్వులను వర్ణించినపద్యములు చూడఁగా వీర నేకయుద్ధములలోఁ దురుష్కరాజుల నోడించినట్లును విస్తారదేశము పరిపాలించినట్లును గనఁబడుచున్నది. తనకన్నతండ్రికి సవతితమ్ముఁడును తనకుఁ బెంపుడుతండ్రియునగు కృతిపతిని వర్ణించు నప్పుడొకచో "శ్రీరంగరాజకుమార వీరవేంకటరాయ భుజాబలసహాయ వివిధోపాయధురీణుం" డను నొకవిశేషణము కలదు. దానింబట్టి చూడ నీయిరువురును మిత్రులనితోఁచినను "గర్ణాటాధీశ్వరవరమాసాంద్రుండగు నారాయణేంద్రుం" డనియు "వీరవేంకటరాయ భూవిభుని కరుణ నెలమిఁ బాలించె సిలవారసేశ్వరుండు" అనియుఁ జెప్పుటచే నావీరవేంకటరాయలకీకృతికర్త సామంతరాజని విస్పష్టమగుచున్నది. ఈవీరవేంకటరాయలు కర్ణాటరాజనుటచేతను రంగరాజకుమారుడనుటచేతను గృష్ణదేవరాయల యల్లుఁడగు అళియరామరాజు తమ్ముఁడనియే యూహింపవలయును. వసుచరిత్రకృతిపతియగు తిరుమలదేవరాయని తండ్రి రంగరాజనియు నన్న రామరాజనియు వసుచరిత్రమే చెప్పుచున్నది. కావున నీవీరవేంకటరాయలు తిరుమలదేవరాయలకును దమ్ముఁడే. ఈవీరవేంకటరాయలు (1580 సం॥ న) చంద్రగిరిలోఁ బట్టాభిషిక్తుఁ డగుటవలన మనకృతిపతియు నాతనికి సమకాలికుఁడు. కావున నితఁడును 16 శతాబ్దము చివరనున్నవాఁడు. కాఁబట్టి యతనికి దత్తకుమారుఁడగు కృతికర్త 17 వ శతాబ్దము మొదటివాఁడని నిశ్చయింపవలయును. 'తనదానగుణము గోదావరీతీరభూనిర్జరేశ్వరులు వర్ణింతురోనగ' ననుటవలన నీకృతిపతి కృతికర్తలు గోదావరిమండలమేలినవారేమోయని భ్రమకలుగుచున్నది. కృతికర్త రాయభూపాలకుమారుఁడని కవులచరిత్ర చెప్పుచున్నగాని. రంగరాజకుమారుఁడుగాని రాయభూపాలకుమారుఁడు కాఁడు. కృతిపతిపితయగు తిమ్మరాజునకు తిరుమలాంబ మూర్తిమాంబ రంగమాంబ లక్ష్మమాంబ కొండమాంబ గురవమాంబ యను నార్గురు జీవత్కళత్రములు కలరనియు నందుఁ దిరుమలాంబకు

మారుఁడు రంగరాజనియు మూర్తిమాంబకుమారుఁడు నారాయణరాజనియు రంగరాజు కుమారుఁడగు కృతికర్తను రంగరాజు సోదరునికుమారుఁడగు వేంకటరాజును మూర్తిమాంబ కుమారుఁడగు కృతిపతి నారాయణరాజు పెంచుకొనెనని పీఠిక దెల్పుచున్నది.

ఇతని కవిత్వమతిప్రౌఢమై సలక్షణమై నవరసభరితమై వినువారి చెవులకుం జవులుగొల్పుచున్నయది. ఇతనికిం గలయపూర్వవస్తుకల్పనాచాతుర్యము మనకవికుటుంబములో నలుగురైదుగురికిం దప్ప నెవ్వరికిని లేదని నొక్కి చెప్పవచ్చును. ఒక్కొకచో నితఁడు వర్ణించిన విషయముం జూచిన నితనికి సముఁడగు కవి లేఁడనియే తోఁపించుచుండును. ఇందుఁ గావ్యలక్షణములగు సమస్తవర్ణనలు వర్ణింపఁ బడినవి. ఇందలికథ పింగళిసూరనార్యుని కళాపూర్ణోదయమువలె నాటకశైలిగానున్నది. దీనిమూలకథ మార్కండేయపురాణములోనున్నది. దానికిని దీనికినిం గొన్నివిషయములలో వ్యత్యాసము కలదు. అందు మదాలస చచ్చిపోయిన పిదప నశ్వతరుఁడను నాగరాజు తపముచేసి మదాలసవంటి కన్యకను తనమధ్యఫణమునుండి పుట్టించి మరలఁ గువలయాశ్వునకిచ్చినట్లున్నది. చచ్చిపోయినదానిని మరలఁబుట్టించునాయను సందేహముచేఁ గాఁబోలు నీకవియట్లు చెప్పక మఱియొకవిధముగా మార్చినాఁడు. ఇత్యాదిభేదములుకొన్ని కలవు. ఈకథ విచిత్రరామాయణములోఁ గూడనున్నది. ఎందెట్లున్నను నీకవి కథాకల్పనయందద్భుతశక్తికలవాఁడు. ఈకథనే నాటకముగా వ్రాయఁబూనినచో వేఱు యితివృత్తము గల్పింప నవసరమే లేదు. తినఁబోవువారికి రుచిఁ జూపింపనేలయని యిందలి యత్యుత్తమవర్ణనలు కలపద్యముల నిందుదాహరింపమైతిమి.

ఈగ్రంథమును దంజావూరు సరస్వతీభాండాగారమునుండి యక్కడి యఱవవారిచే వ్రాయించి తెచ్చుటచేతఁ గొన్ని వ్రాఁతతప్పులును గొన్ని గ్రంథమందలి లుప్తభాగములును గల యొక్క ప్రతియె మాకుదొరకుటచే దానిననుసరించి యథామతి లుప్తభాగములను వ్రాఁతతప్పులను శతావధానులు తిరుపతివేంకటేశ్వరకవుల సహాయ్యమున బరిష్కరించి మాసరస్వతీ పత్రికయందుఁ బ్రచురించితిమి. పూర్తిగా సవరించుటకు వీలులేనివి సవరించినఁ గవియభిప్రాయమునకు భిన్నమగునేమోయని విడిచితిమి. ఎవ్వరియొద్దఁగాని మఱియొకప్రతియున్నచో దయయుంచి మాకుఁ బంపినయెడల భేదములు సరస్వతిలోనుండి పునర్ముద్రితములగు ప్రతులలోఁ జేర్చెదము.

ఇది సవరించుటలో నిజముగాఁ గ్రొత్తగ్రంథము వ్రాయఁదగినంత పరిశ్రమపడితి మనుటకు సందేహములేదు. అట్టిదైనను నెచ్చటనోయున్న దతికష్టముచే సంపాదించినదైనను నుత్కృష్టమగు రసవత్ప్రబంధమైనను నావ్యయప్రయాసలు మేమేభరించి పాఠకులకుఁ దక్కువవెలకే యిచ్చుచున్నాము.

ఇట్లు, ఆంధ్రభాషాభిమాని,

శ్రీ కొ. రా. వెం. కృష్ణరావు.

సరస్వతీపత్రికాధిపతి.

శ్రీరస్తు.

# కువలయాశ్వచరిత్రము.

## ప్రథమాశ్వాసము.

---

శా. శ్రీరాధాధరబింబసంభృత సుధాబృందాతిమాధుర్యగా
ధారిత ప్రకటించు లీల మురళీధారేయుఁడై గీతసం
చారంబు ల్వెలయించుకృష్ణుఁడు దయాసర్వస్వతాగౌరవం
బూర న్నారమునారనాధిపుఁ జిరాయుశ్రీయుతుం జేయుతన్. 1

సీ. తనమందహాసనూతనకాంతి కాంతకీర్తికలాపములను సంధించుకొనఁగఁ
దనయాస్యపద్మంబు ధవరాగరసఝురీ పటిమతోడుత మాటపలుకులాడఁ
దనతనూదీప్తిసంతతులు నాయకమహస్తోమంబునకును విందులు ఘటింపఁ
దనయురోజాచలత్వంబు మనోనాథకఠినధైర్యముతోడఁ గలసిమెలఁగ
రాజులఁ దిరస్కరించుచు రమణుఁ డున్న, యరదమెక్కిన రుక్మిణీసరసిజాయ
తాక్షి నవరమునారాయణాధిపేంద్రు, శుభదయాపూర్ణవీక్షచేఁ జూచుఁగాత. 2

చ. నెలకొనుజూటసౌరతటినీనవకైరవిణీవధూటితో
లలితసుధాంశుఁ గూర్చినతలంబునఁ బార్వతిఁ గూడి యభికిం
గలయికకుంటైన ల్నడుపఁగాఁ బనిపూనిన యాశపాలకుం
డలశివుఁ డిచ్చుఁగావుతఁ జిరాయువు నారనభూపమౌళికిన్. 3

చ. తనతనుకాంతి కాంతజలదప్రతిమానగళాగ్రనీలిమం
జెనక వరాంగరోచి నిజచిత్రసుధాస్మితపాండిమంబుఁ జి
క్కనితమి ముద్దుఁబెట్టుకొనఁగాఁ బతికౌఁగిట నున్నయద్రినం
దన నవరంబు నారనజనప్రభు నెప్పుడుఁ బ్రోచుఁ గావుతన్. 4

సీ. నుడుగులపూఁబోఁడి యడుగులబెడఁగు వీక్షించుచోఁ బదము పఠించుకొనుచుఁ
బలుకుటొయ్యారి గుబ్బకవ గంధపుఁబూఁత నెంచుచోఁ జర్చ వర్ణించుకొనుచు
మాటమిటారి నయ్యాటంపునడ నిరీక్షించుచోఁ గ్రమము గుణించుకొనుచు
మినుకుఁ బ్రోయాలి కింపునఁగీలుజడయల్లఁ జెనువుచోనలజటఁ జెప్పుకొనుచు
వాణిశారీరరుచివైభవంబుఁ జూచు, వేళ వర్ణక్రమంబు భావించుకొనుచు
నెమ్మి నగుతమ్మిచూలి మాతిమ్మనృపతి, పుత్రునారాయణాధిపుఁ బ్రోచుఁగాత. 5

శా. వీణాదండచల త్కరోజ్జ్వలవిభ త్వేల్లన్నఖోద్యద్రుచి

శ్రేణు లిమ్ముంచుగ గానరక్తిఁ జిగిరించెం బూచెనంచున్మదిం
గాణ ల్మెచ్చఁ గఁబాటపాడి పతికి న్సంతోషముంగూర్చునా
వాణీనీరజనేత్ర నారదధరావ్రజింగృపం బ్రోవుతన్. 6

మ. కలుగున్నాయపుతేజికిం భయముమైఁ గాన్పించు నీశానుసా
మ్ములకుం దమ్ముని కత్తలానము రయంబుల్మీర రావించి సూ
రెలకుం బర్వునఁ బోవువానిఁగని గౌరీకాంతసారెం గిలా
కిలనవ్వ న్మద మొందు దంతిముఖునిం గీర్తించినతిఁ జెందెదన్. 7

సీ. అలకురువ్రజనాథు నడఁగఁద్రొక్కె నటంచు నలకురువ్రజనాథు నడఁగఁద్రొక్కె
సైంధవాక్రమణ నైశ్చల్యమొందు నటంచు సైంధవాక్రమణ నైశ్చల్య మొందె
మించి యక్షబలంబడంచి పేర్చు నటంచు మించియక్షబలం బడంచి పేర్చె
ద్రోణగురుత్వంబు తోడరితాల్చునటంచు ద్రోణగురుత్వంబు తోడరితాల్చె
భావిసోదరభీమసంభావ్యకార్య, మెల్ల నీరీతి నెఱిఁగించె నెవ్వఁ డట్టి
రామపాదారవిందమరందభృంగ, చంచరీకాత్ము హనుమంతు సన్నుతింతు. 8

సీ. ప్రతివాదిమర్మనిర్మథనకర్మఠమైన బాణసౌశీల్యంబుఁ బ్రస్తుతించి
ఘనశబ్దసాంగత్యజనితాత్యధికమోదగరిమఁ గన్న మయూరసరణి నెన్ని
మాలతీమాధవమహిమఁ బూజితమైన భవభూతి మార్గంబుఁ బరిగణించి
సారసవార్థపోషణధురీణంబైన భారవి యుదితవిభ్రమముఁ బొగడి
వెండియును గాళిదాసాది విబుధవరులఁ, దలఁచి యుష్మత్కవిత్వ సంపద్భ గౌర
వార్థ్యహంఖులు దాతుమస్మాథ యటంచు, వాదికృపఁగాంతుఁ గవితాదివైభవంబు.

క. నన్నయభట్టన్నను నె, ఱ్ఱన్నను దిక్కన్నసోమయాజిని శ్రీనా
థున్నాచనసోమునిమది, నెన్నుదు నాంధ్రప్రబంధహేలానిధులన్. 10

శా. విగ్రిస్రిగ్నవగంధ మంథకపురోవీథీవధూక్రీడ పం
గుగ్రామణ్యతిదూరసంస్థితసురక్షోణీధరేంద్రంబు వృ
ద్ధాగ్రశ్యామ గదా మదాచరితకావ్యం బౌర దుర్వైదుషీ
వ్యగ్రాసత్కవికోటి యెన్న నది యూహాశ్రేయఁగా నేర్చునే. 11

మ. ఒకచో శబ్దగుంఫనంబు లొకచో యుక్తిక్రియాగౌరవం
బొకచో నద్భుతజాతివార్త లొకచో నుజ్జృంభితత్తప్రస
ప్రకరంబుం గనిపించిన న్మదికిసంభావింప నర్హంబుగా
కకటా యేమియులేని కబ్బ మది యాహ్లాదంబు గావించునే. 12

వ. అని యిష్టదేవతా నమస్కారంబును సుకవిపురస్కారంబును గుకవితిరస్కారంబు నుంగావించి బహువిధకథావిచిత్రంబగు కువలయాశ్వచరిత్రంబను కావ్యంబు సరస జనసేవ్యంబుగా రచియింప నూహించి యేతత్కృతినాయకత్వంబునకుం దగువాఁ డెవ్వఁడో యని విచారించి. 13

క. అలనారాయణధరణీ, తలనాయకమణికి నిచ్చెదఁ బ్రబంధంబున్
గలదే మేదిని భేదము, తలఁపంగా నీతఁడనఁగ దైవమనంగన్. 14

వ. అని నిశ్చయించియున్న సమయంబున. 15

సీ. ఏనవ్యగుణహారి దానవారియవక్రిచక్రసౌఖ్యకరప్రసక్తిఁ గాంచు
నేవైరిహరహేతి భావరీతి యమూల్యకల్యాణధరధర్మగరిమఁ గాంచు
నేజగన్నుతిశాలి యాజికేళిఁ బ్రచండపరదండమహతి యక్ప్రౌఢిఁ గాంచు
నేరమ్యతరకీర్తి మారమూర్తి యవేలకమలాంబికామోదఘటనఁ గాంచు
నతఁడు వయిఖుందుఖానసప్తాంగహరణ, కరణకారణరణరణద్ఘంటికాని
కాయవేదండముఖసైన్యకలితవిజయ, శాలి నారాయణక్షమాపాలమౌళి. 16

వ. వెండియుఁ దాండవఖేలనోద్దండ ఖండపరశుజటామండలాగ్రహిండమాన పుండరీకగంగాడిండీరపాండరాఖండరుచికాండకీర్తినిష్యందచంద్రికాచక్రీకృతదుర్వక్రవిక్రమపరిపంథిరాజన్యసైన్యుండును సర్వసర్వంసహాధూర్వహతానిరాకృతకమఠపరిబృఢకాకోదరలోకాధిప దిశాస్తంబేరమమూర్ధన్యుండును కరుణారవిందచరణామణీపరిణీత పరిరంభణోజ్జృంభణాలోకుండును ప్రచండమండలాగ్రవిదార్యమాణరిపుమండలాఖండలకరణీయభావిరంభాసంభోగాంతరాయభయావిలనలకూబరానీతనవనిధిబోధవిధాయకనానావస్తువిస్తారనిస్తులస్తవనీయమణీరమణీయమందిరాలిందుండును రాజకార్యవిరోధిరిపు రాజశిరోధిఖండనోద్దండ తదీయదుర్గగ్రహణ విచక్షణనిజనియుక్తసేనాభిరాముండును సింధుగోవిందధవళాంగభీముండును ప్రతిక్షణప్రకల్పితదానధారాధునీమానావనోదనసాంత్వవాదనప్రవీణతదీయవేణికాసమాహతపారావారవిగళితనిజాశ్రయపరాయణతద్గాంభీర్యధుర్యుండును హేమకరగండాంకవర్యుండును శ్రీరంగరాజకుమారవీరవేంకటేశరాయ భుజాబలసహాయబహువిధోపాయధురీణుండును చంచలలోచనామనోవంచనాపంచబాణుండును గాశ్యపగోత్రపవిత్రుండును జిత్రచరిత్రుండును. దిమ్మనరపాలగర్భరత్నాకరరాకాచంద్రుండునునగు నారాయణధరాదేవుం డొకానొకశుభవాసరంబున సుధాకరశిలావేదికాసరోవంబులకుఁ జెందొగలపొందుఁ గలయ నొందించు నమందకుడ్యభాగపద్మరాగప్రతిబింబంబులకుఁ

దాఁటు త్రేఁటిదాఁటులనీటు వాటించు వలభికానీలజాలంబుల నీడలకుం దోడుపడు సాంబ్రాణిధూపపుంజంబు లనుచీఁకటికై యుదయించు మంచురాయని రేకలపోకలంపగు మగతాతిబోదియలం జెలంగి ముంగల నాడు కీలుబొమ్మలకోలాటంబు రొదలకును గిరకిరిఁవఁగూయు కోయిలలయారజంబులకును నొండొరులమొగంబులు చూచికొను నాడిగంపుఁ జేడియల మందహాసరుచికందంబులకు విందులు గావించు ముక్తామయస్తంభంబులందగు తమయాకారంబులం గనుంగొని తోడినియోగులని రాజకార్యంబు లడుగునానాదిగంతరానేకవజీరామాత్యులం బిలుచు సౌవిదల్ల సాహసోనినాదంబులకుఁ బ్రోదిగావించు వందిజనంబుల కైవారంబుల నడుమ వినంబడు నంగనాంగీకృతసంగీతంబులగు నానందబాష్పబిందుసందోహంబుఁ జిందించుచు చందంబునఁ దొరఁగు వితానీకృత వివిధప్రసవవిసరరసప్రసారంబునం బొసంగు నాస్థానంబున మణిమయాసనంబున సుఖాసీనుండై నిండోలగం బుండుసమయంబున.

క. వినయమున నేనుగదియం, జని యేతత్కువలయాశ్వచరితంబు ముదం
బున మీకు నంకితముగా, నొనరించెద ననిన హర్ష యుక్తుం డగుచున్. 18

వ. ప్రసాదమందస్మితకటాక్షంబుల నిరీక్షించినఁ దదీయాంగీకారం బెఱింగి ప్రబంధనిబంధనోత్సాహబంధురుండనై తన్ముఖాలంకారంబుగాఁ గృతిపతివంశావతారం బభివర్ణించెద. 19

సీ. నెలఁతలనెఱముద్దునెమ్మోవినీటుదారొల్కన్నవానికి జోడుకోడె యనుచు
జనరాండ్రజిగిగుబ్బజగపోల్కిఁ జనుపిట్టకవలకెల్లను జెల్మికాఁ డటంచు
లేమగుంపుల లివలివలాడు లేఁగౌనువంటిచోటికి నెలవరి యటంచుఁ
గలికిమిన్నలకల్కికంటికో పెనయు మెచ్చులకొప్పివ్వికి మేలిచుట్టమనుచు
నెంచి గ్రాయాశుభాంగి యేయునని మాళి, నిండువేడుకఁ దలఁబ్రాలు నించి వెలసె
నతఁడు కనకాద్రివలనాపప్రియాణనిపుణ, సైంధవుం డెన్నఁదగు లోకబాంధవుండు.

క. ఆతనికులమున దశరథ, నేత దగు నృపధిపరిధినిఖిలమహీర
క్షాతత్పరుఁ డాతనికి, స్సీతాశాతోదరీమణీపతివొడమెన్. 21

శా. ఆరామాధిపమాళికిం దశముఖాఖ్యుగ్రావ దంభోళికిన్
బారావారపటీసమావృతకటీ భారోజ్జ్వలద్ధారుణీ
ధారంధర్యసరీసృపార్యసమదోస్తంభప్రతాపప్రభా
శ్రీరాజద్గిశుఁ డౌదకుండు జనియించెం బ్రాభవోపేతుఁడై. 22

గీ. ఆకుశుని యన్వయమున బాహాసహాయ, శౌర్యగాంగేయు వైరిరాజన్యగేయ

బలులు పెక్కండ్రు నృపతులు వెలసిరంగు, వినుతి వహియించె గోవిందజనవిభుండు

క. వెలయుం దత్సుతుఁడై యతి, బలధృతియై తిమ్మధరణిపతి వైరిసతీ
కలితాంజనబాష్పఝరీ, హలహలికాంజనధరీకృతాఖిలగిరియై. 24

సీ. విడు పైఁటచెఱఁగు నేవెఱతు గాయము మాననిమ్మని ఛాయ యెంతేసి వేఁడ
నశ్వినుల్మందులకై ద్రోణగిరికి నిచ్చలుఁ బోవుకతన వేసరుకొనంగ
నిరుపద్రవముగామి నిలువరాదని రమాపతి వేఱుపాలెంపుఁ బట్టు వెదక
నాయమ్మకిది యపాటాయంచు నలసింహికాతనూభవుఁ డౌడుకఱచికొనఁగఁ
జెలఁగి తోఁగకొమ్మమొగ మింత చేసికొనఁగఁ, దిమ్మనృపశౌరి దినదినోద్భిన్నవైరి
వారబహువారభేదనవర్ధమాన, మైనరవిమేని పెనుగండి మానదయ్యె. 25

క. అరసికమాళి ముద్దుఁగు, మారుఁడు శరజాతవృత్తి మనియె న్గనియెం
దారకగర్వనివారక, సారకనత్కీర్తిఁ లక్కజనపతిధరణిన్. 26

సీ. అర్కవంశమువారమని దుర్నివారులై గుడిసెకై జిల్లెడు గొట్టఁబోరు
హరిభక్తిగలవారమనుచు సన్నద్ధులై వేఁటకై సింగంబు వేఁటఁబోరు
కడువిరక్తులమంచుఁ దడవిండ్లు గైకొని యేచి పుల్గులమీఁద నేయఁబోరు
భార్గవగోత్రసంభవులమంచుఁ దలంచి గట్టులపైఁదరుల్ మెట్టఁబోరు
సంగరాంగణసంగతశౌర్యధైర్య, ధుర్యులక్కమహీపాలవర్యధాటి
కాపలాయితమత్తప్రతీపభూపు, లడవిలోఁ బాతకాఁపులై యలరునపుడు. 27

గీ. అమ్మహైశ్వర్యసంపన్నుఁ డంబకాగ్రి, చంచలీకృతదుర్మనోజాతుఁ డగుచుఁ
గలితమైన సదానందకారి గరిమఁ, దనరు తిరుమలదేవి నుద్వాహమయ్యె. 28

గీ. ఆ తిరుమలాంబయందు లక్కావనీశుఁ, డతులరవితేజుఁ దిప్పభూపతి బిడౌజు
లక్కనృపవర్యుఁ దిమ్మవిలాసధుర్యుఁ, గృష్ణనృపచంద్రు నారాయణేంద్రుఁ గనియె.

క. వారలలోపలఁ దిప్పధ, రారమణుఁడు వెలయు రాజరాజనఁ గృపో
దారుండు లబ్ధకవచ, స్ఫారగుణాపార్థవైరిబాణక్షతియై. 30

సీ. పద్మములై నిండఁ బర్వనుస్సురుమంచుఁ దలయూఁపఁ దొడఁగె వేదండపాళి
కమలముల్ ద్రొక్కవలఁ గదియ వెల్వెలవాఱె కాలూఁదలేఁ డయ్యె వ్యాలభర్త
యబ్జరేఖాప్తిపై నమర నిద్దురమాని నిలిచినచో నిల్చెఁ గులధరాళి
వనజాతములచ్చాయ దనరి కంపనమొంద రోమోద్గమముఁ జెందెఁ గోత్రదమాళి
తమ్ముఁ బెడవాసి వసుధాసుధాకరాస్య, క్రొత్తవలపంటి ననవంటి కొమరువంటి
సీటుకాఁడైన యలతిప్పనృపతిఁ జేర, విరహగరిమంబు తమయందు వీలుకొనఁగ. 31

చ. అతఁ డవుజన్ముఁ డైనసుగుణాఢ్యుఁడు లక్కవిభుండు తోడుగా
నతులితుహిందుఖానుని బలావళి ద్రుంప నిలింపు లింపున
న్వతత లతాంతవర్ష మొదవించుట మించు వరించ నెంచి స
మ్మతి జయలక్ష్మి మ్రనించు నవమౌక్తికపుం దలఁబ్రాలు కైవడిన్. 32

సీ. నలుపుఁగస్తురిగీఱునామంబుఁ దుడిచి యేతెంచినఁగాని సంధించమనుచు
నిడుదము త్తెపుటోంట్లు సడలించుకొని చెవుల్బోడ వైచినఁగాని చూడమనుచుఁ
గమనీయమణికిరీటముడించి పైఁతాణిపాగ చుట్టినఁగాని పలుకమనుచు
దంభోళివిడిచి క్రొంపసుపు సింగిణివిండ్లు చేకొన్నఁగాని హర్షింపమనుచు
జిష్ణుతో మాటలాడ హేజీబు ననుతు, రౌర తిప్పనృపాలబాహాసినిహతు
లైనయలహిందుఖానసేనాధిపతులు, నిండి సురపట్టనము చెంత దండు విడిసి. 33

గీ. తిప్పనరపాలకరవాల దీర్ణయవన, ముష్టిహతి రంభ నెడసి సమ్ముఖముం జేరు
తనయుఁ గని రాజరాజు సంతసముఁ జెందుఁ, దురకగ్రుద్దును బనికివచ్చెర యటంచు.

క. బిసరుహనయనావిసర, ప్రసవకలంబకుఁ డతండు పరితోషితవి
ప్రసతీకదంబ నానన, హసితైందవబింబఁ గోనమాంబ వరించెన్. 35

క. ఆ తిప్పనృపతి కోనాం, బా తామరసాక్షియందు బాంధవరక్షా
ఖ్యాతుని దిమ్మధరాధిపు, నాతతగుణకలితు వేంకటాధిపుఁ గనియెన్. 36

ఉ. వారలలో శతారిన్న పవారకతోరకుతారధారణో
దారమహామహీతల విధాయకకుంకుమసత్కురంగనా
భీరసరేఖికాకృతి గభీరభుజంగమ భోగబాహుదు
ర్వారుని దిమ్మభూవరునిఁ బ్రస్తుతిసేయవశంబె యేరికిన్. 37

సీ. పరకాంతసంగతిఁ బరఁగుకూర్మస్వామి యబ్రమే బహుళ జడాశి యగుట
రాజభామావ్యాప్తిఁ బ్రబలు భూధరపాళి యరుచె గతశ్రవణాగ్రమగుట
సద్విజవనితల సక్తిగాంచినపోత్రి వింతయే వెలివేయు విషులఁగనుట
కుండలీశ్వరసుదృక్కులఁ బొందుకరిరాజపటలి భారమె యధఃపాతియగుట
యనుచు భూదేవి తిమ్మభూపాగ్రగణ్య, బాహువందుండి మొసపరి బాగుమీఱ
గరువమునఁ బల్కు నిఖిలలోకప్రతాన, కావ్యపరిశంశితకీర్తికాంతతోడ. 38

సీ. చనవు తానని వచ్చినను లేవ కలమంజుఘోష మోచేకొద్దిఁ గొట్టువడియెఁ
గొనగోటఁ జెక్కిలిఁ జెనకి ఘృచికాదేవి దేశీయంపుఁ దిట్టువడియెఁ
బుక్కిటి విడెమీయఁ బోయి తిలోత్తమావనజలోచన ముచ్చెవాట్లుపడియెఁ

బోలయల్కఁ జూటుకసఁ జూపులఁ జూచి యూర్వశీబిబ్బోకవతి చౌకవేట్లుపడియెఁ
దిమ్మనరపాలు చికిలిదోదుమ్మిదారి, బలిమిఁ దెగటారి సురపురప్రాంగణమున
వరలెడు కటారిరాహుత్తవరులచేతఁ, గీడుచేయదె మడియలతోడిచెలిమి. 39

సీ. అమరనాయకుమీఁది యాసయటుండఁగా బాదుషాపై యాసపల్లవించెఁ
బొసఁగినఘనవిఘంబులవా రటుండఁగా దురువరంబులవారి మురువు హెచ్చె
లలితంపుసప్రివీణలవా రటుండఁగా మజిరఖాబులవారిమాట హెచ్చె
హృద్యోత్సవంబు లనేకంబులుండఁగాఁ గానిపనులదండుగలు సెలంగె
నజహితుపేరు లవియెన్నియైననుండఁ, బ్రౌఢకర్తాఖశబ్దంబు రూఢికెక్కెఁ
దిమ్మనృపఖడ్గధారావిదీర్ణమత్త, ఖానపుంగవసాంగత్యగరిమ దివిని. 40

సీ. నికరంబుఁ పాపోసులకుఁ మ్రొక్కుమనుచు దేవేంద్రనందను బట్టి యీడ్చిరనుచుఁ
జేష్టలుమాని దేశీయము ల్వినిపించు తుంబురు నడ్డగించి రనుచు
సారాయికొపెర గంజాపొడు ద్రెమ్మంచు నంగదుల్వడిఁ గొల్లలాడిరనుచు
లాయంబులోఁ బనుల్గావింప రమ్మంచు హరిణితోఁ గడునెగ్గులాడి రనుచు
దిమ్మనృపహతయవను లాందించులూటి, నమరపురిఁ జేరవెఱచు దిశాధిపతుల
కెఱుఁగఁజేయంగ నచ్చటి కిచ్చటికిని, నారదుం డాసుఁగ్రోవిచందమునఁ దిరుగు.

గీ. అతఁడు తిర్మలదేవి మూర్త్యంబ రంగ, మాంబ లక్ష్మాంబ కొండమాహరిణనయన
గురవమాంబను నిజబంధుకోటులెంచ, వరలువేడుకతోడ నుద్వాహమయ్యె. 42

సీ. భర్తవినాయకప్రౌఢసంగతిఁ జెంపఁ దాఁ గల్కివగలసంతసముఁ జెందుఁ
బతిద్విజరాజాగ్రపాద మౌవలఁ దాల్పఁ దానుహిభృత్పావతతి భజించు
విభుఁడు సుధర్మాభివృద్ధిఁ బెంపువహింప, దాసురామోదసంధాన మొందు
వరుఁడు ప్రాభాకరవ్యాలోలరతిఁ గాంచఁ దాను జంద్రాలోక మూని చెలఁగు
ననుచు హరిజాయ హరురామ నమరనాథు, కొమ్మనంబుజభవుముద్దుగుమ్మఁ దెగడి
కాంతునకు నానుకూల్యసంఘటన యొసఁగు, ధీరసద్గుణనికురుంబతిర్మలాంబ. 43

సీ. వరుని సదా గదాకరుని జేయుటెకాని యిందిరాజలజాక్షి కేదికొదవ
చెలువుచే మరుమాట చెల్లించుటయెకాని హిమశైలతనుజాత కేమికొదవ
నాథునిజాస్యమొందఁగఁ జేయుటేకాని యిలజహ్నునందన కేమికొదవ
కాంతునిగోత్రారిఁగాఁ జేయుటేకాని యింద్రుపట్టపురాణి కేమికొదవ
తరము గావింపరాదె యాతరలనయన, తోడ వాదలననుచు బంధువులు వలుక
విభున కత్యంతభాగ్యంబు వెలయఁ జేయు, కీర్తితగుణావలంబ యామూర్తమాంబ.

వ. అమంథరవీర్యుండగు తిమ్మనృపకంఠీరవుండు తిరుమలాంబయందు గంభీరభేరీమహా రావనిర్దలిత కకుప్పుటలవిశాలుం డగు తిప్పనృపాలుని రణరంగసంగతజయరమాధుర్యుం డగురంగరాయనృపవర్యుని నుష్ణకరతేజుం డగుకృష్ణధరాబిడౌజునిం గనియె మూర్తిమాంబయందుఁ గర్ణాటకాధీశ్వరదయాసాంద్రుం డగు నారాయణవసుంధరాదేవేంద్రునిం బెదరంగమాంబయందు నమందవితరణశాలియగు రఘునాథనరనాథమౌళిని లక్ష్మాంబయందు నౌదార్యనిస్తంద్రుండగు రామపరిభుచంద్రుని గొండమాంబయందు ధర్మచర్యాదిలీపుండగు గోవిందభూపుని గురవమాంబయందు శౌర్యహార్యక్షుండగు తిమ్మధరాధ్యక్షునింగాంచె వారలలోఁ దిప్పనృపాలు శౌర్యంబెట్టిదనిన.

సీ. తనయిల్లు విడిచి సేయనటంచుఁ జలపట్టు కొడుకు చేతులు పట్టుకొనఁగవలసె
తనరంభ వారికీయనటంచు వాదించు కౌబేరికుడుగర గప్పవలసె
నులుపకై యీగిమ్రాకులచెంతకును దానె చని యిప్పు డూను కొండనఁగవలసె
దెల్లయేసిక నన్నుఁ దెమ్మందురో వారలని మూలదెసదాఁచుకొనఁగవలసె
నౌర తిప్పనృపాలబాహాసిధార, నవనివిడనాడి బొమ్మగాయముల వచ్చు
కడిదిపగఱకు నుచితము ల్నడపుహరికిఁ, జాలునసిపించెనమరరాజత్వగరిమ. 46

క. అలతిప్పధరాపాలున, కలఘుకృపాళునకు ననుజుఁడై కాహాళికా
కలితధ్వనిహాలహాలికా, చలవరి శ్రీరంగరాయజనపతి వెలయున్ 47

క. మానకథానిధి యా ధర, ణీనాయకమౌళి యరుల నిద్దురవుచ్చున్
మానక మృడకరడమరుస, మానకభటపటలపటపటార్భటిపటిమన్. 48

సీ. తనకుఁ గూఁతు నొసంగి తనరిన దక్షుఁ డిష్టార్థభంగముఁ జెందియుఁ దిరుగఁ
దనకునంతపద్యారూఢి యొసఁగిన చతురాస్యుఁ డెపుడు విచార మందఁ
దనపైఁ బదం బమర్చిన పురుషోత్తముం డొందు నిరాకృతిఁ జెంది నిలుపఁ
దనకు సత్కృతిపతిత్వం బిడిన బుధేంద్రుఁ డాశానువృత్తి నిత్యంబు మెలఁగ
వెలయు టిది యెల్ల యేదానవిధమటంచుఁ, జంద్రనీరదశిబికర్ణసరణిఁ గేరి
సుకవివర్యుల కఖిలార్థనికర మిచ్చుఁ, బ్రకటగుణుఁ డైన శీరంగ రాయనృపతి. 49

క. ఆతనితమ్ముఁడుకృష్ణధ, రాతలనాయకుఁడు వెలయురంభావైరి
వ్రాతమకరాంకకేళీ, దూతీకృతహేతిలలితదోర్గర్గళుఁడై. 50

క. మూర్తిమాంబాతనూజుసత్కీర్తినీయ, భవ్యరవితేజునిబిడవైభవబిడౌజు
నతులరేఖాతిచంద్రునారాయణేంద్రుఁ, బ్రకటగుణసాంద్రుసన్నుతింపఁగఁ దరంబె.

సీ. బహువర్షములుగన్న పాథోధిస్వామి నవ్యలావణ్యవర్ణనముఁ గనియె

సగరవృత్తి నెసంగుజహ్నుమానితనూజ యమృతప్రవాహవిఖ్యాతిఁ గనియెఁ
నరపదిగ్బహులాస్య మరయనికావేరి రంగస్థలాభివర్తనముఁ గనియె
గడు నుగ్రగతి యెఱుంగనినర్మదానది సోమోద్భవాదివిశ్రుతులు గనియె
నేకుమారుని పట్టాభిషేకసమయ, మందు నిజవారి యొసఁగుభాగ్యమున నట్టి
వీరవేంకటరాయభూవిభునికరుణ, నెలమిఁ బాలించె నిల నారణేశ్వరుండు. 52

సీ. అఖిలంబునకుఁ బ్రపంచాంగంబుఁ దెలిపి సత్రములపా లగుపోత్రిరాజుఁ దెగడి
కలభారతస్ఫూర్తిఁ దెలియంగఁ జేసి దానములు చేకొను నాగసమితిఁ దెగడి
పండ్లు గన్పట్టంగఁ బనసఁ జూపుచు ముష్టిఁ గైకొను కులధరాగ్రణులఁ దెగడి
కౌముదీరుచిఁ దెల్పి కడునాదిభిక్షుకాభరణాఖ్యఁ గనుఫణిప్రభునిఁ దెగడి
వచ్చి చేరిన ధారుణీవనజముఖికి, నీరదులపేరివెలిజరీచీర లిచ్చి
నెనరుతో గంధమొసఁగి మన్నించునాతఁ, డధిపమాత్రుఁడె నారాయణాధినేత. 53

గీ అట్లు పెదరంగమాంబామృగాయతాక్షి, తనయుఁ డైనట్టిరఘునాథధరణివిభుఁడు
తరణినిభుఁడు పరితాపసంతతులవలన, నంచు బుధలోకమెల్ల వర్ణించ మించు. 54

గీ. అల్ల శ్రీరంగరాయ ధరాధినేత, దేవతాభక్తినికురుంబఁ దిమ్మమాంబ
వరసరోవరకాదంబఁ దిరుమలాంబఁ, దనకు దేవేరులై మునం బెనయ వెలసె. 55

మ. అతఁ డాతిమ్మమయందు వేంకటనృపాధ్యక్షున్ రిపుక్ష్మేశజో
ద్ధతు రంగాధిపుఁ దిర్మలాంబవలనన్ ధర్మాత్ము గోపాలు స
న్నుతకీర్తిం జిననారనాఖ్యుఁడగు నన్నుం గస్తురీంద్రున్నమం
చితకీర్తి న్రఘునాథుఁ దిమ్మవిభుఁ గాంచె న్సజ్జనాధారులన్. 56

గీ. అతని యనుజన్ముఁ డైనకృష్ణావనీంద్రుఁ, డెలమి రుక్మాంబ వలన నహీనగుణుల
రంగనృపు సాంద్రతరదయారామచంద్రు, వేంకటపతీంద్రు వేంగళవిభునిఁ గనియె.

మ. అలతిమ్మాధిపు నారసేంద్రుఁడు దయాధారుండు నన్నుం జయో
జ్జ్వలుఁ గృష్ణాధిపుపుత్రు వేంకటపతిక్ష్మాకాంతచంద్రున్ గుమా
రులుగాఁ గైకొని ప్రోచెఁ గాన నతఁడే రూపింపఁగాఁ దల్లిదం
డ్రులు దైవంబును నయ్యె నిద్దఱకు నెంమ న్నందియం బేటికిన్. 58

సీ. చలపట్టెనా వైరిజనపాలకుల నొక్కముక్కాడనీయక యుక్కడంచుఁ
బూనెనా యరిధరాభుజుల నంతఃకలహంబు గల్పించి పాయంగఁ జేయు
నెంచెనా పరిపంథిపృథివీపతుల దాడివెడలించి తనవెంటవెంటఁ ద్రిప్పుఁ
దలఁచెనా రిపురాజిఁ దనహజారంబునఁ బడిగాపులై తపంబడఁగఁ జేయు

నితనితోడుత వైర మీడేల దనుచు, సకలధరణీశు లెపుడు నిచ్చక మొనర్ప
వీరవేంకటరాయభూవిభునికరుణఁ, బరఁగు నారాయణక్షమాపాలవరుఁడు. 59

సీ. తనమాటకాంచికా తంజాపురీమధురాధినాథులకు నెయ్యంబు నెఱపఁ
దనచీటి గోలకొండనరేంద్రముఖ్యధరాధవపద్మబంధు లౌదల ధరింపఁ
దనకీర్తి మట్లనంతనృపాలముఖ్య గోత్రామరేంద్రులు గొనియాడికొనఁగఁ
దనదానగుణము గోదావరీతీరభూనిర్జరేశ్వరులు వర్ణించుకొనఁగ
వెలయు వేదండగండనిర్గళదనర్గ, శీమదధారాధునీనాథకుముదబంధు
కార్యకృద్డిండిమారావధుర్యసైన్యుఁ, డతఁడు ప్రభుమాత్రుఁడే నారనాధినేత. 60

—⊱⊰ షష్ఠ్యంతములు. ⊱⊰—

క. ఏవంవిధవసుధాసం, భావిత బహుళాకథాతిభానీరధికిన్
గ్లానధికశిశిరనిజవీ, ఞావధికార్పణ్యాబుధమహా సేవధికిన్. 61

క. స్ఫుటధాటీభటకోటీ, చటులాటీకనహతారిజనపతికి శచీ
విటగోత్రోక్కటమిత్రో, ద్భటచిత్రోజ్జృంభితప్రభావద్యుతికిన్. 62

క. మణినాగనగరకాంతున, కణుమధ్యాజనమనోజయంతునకుఁ గుర్భ
ద్గణగణితరామణీయక, మణిఘృణిఘటితాతిమంజిమనిశాంతునకున్. 63

క. విస్ఫురబహువిధవైభవ, హసితేంద్రున కసితకేతనాలోకనమా
త్రసముత్త్రస్తారిధరా, పసమూహావనచలత్కృపాసాంద్రునకున్. 64

క. వీరారివారవారణ, వారణసృణికింగవీంద్రవర్ణితవిద్యా
పారగతాదిమఫణికి, న్నారాయణధరణియువతినాయకమణికిన్. 65

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన కువలయాశ్వచరిత్రంబునకుం
గథాక్రమం బెట్టిదనిన. 66

ఉ. శ్రీమహితంబు భారతవిశేషకథావిధము న్విహంగమ
గ్రామణు లేర్పడం బలుకఁగా విని భావనిరూఢహర్షుఁడై
జైమిని యాఋతుధ్వజుని చందము లందము లయ్యెఁ దెల్పర
య్యామతి యాతఁడే కువలయాశ్వుఁ డనంగఁ బ్రసిద్ధిగాంచుటల్. 67

క. అనినన్విని జైమినిమునిఁ, గనుఁగొని విహగంబు లతనికత యిట్లనుచు
న్వినిపించె సుధారసగుం, భన గంభీరాతిజృంభమాణమృదూక్తిన్. 68

క. శ్రీకరమై నానావిధ, వాకరమై యగ్రచుంబితాంబరబహుళ
ధ్యాకేళనాతిసుందరమై, సాకేతపురీపురంబు సన్నుతికెక్కున్. 69

సీ. ప్రాకారశశికాంతపఙ్క్తికాంతులు చుట్టు నూలిపోగులచాలు లీలఁ గాంచ
విడికెంపుగుంపుఁ జెక్కడపుఁ జొక్కపుఁ గోటకొమ్మలు జోతులయెమ్మెఁ దాల్ప
నవరత్నమయనూత్న వివిధవీథీరాజి యమరికఁ బ్రోలుసోయగము చెందఁ
బైఁడికుండల సేరపడినముత్తెపుమేడ లై రేనికడవలయంద మొంద
జయరమాసతి తత్పురీశ్వరవివాహ, గరిమ నాలవనాఁడు నాకబలి చల్లఁ
దమమహిమ మింటి నంటు భక్తంబులనఁగ, సొగసుఁ గనఁ జాలుఁ గడు రేలుచుక్కచాలు.

చ. దళములచాలు మిద్దియలతండము మేలు విచిత్రపత్రము
ల్చెలఁగెడి తీఱు నీరములు చెందినసౌరును గాక రాజరా
కల విలసిల్లు నంచుఁ బురకంజముఁ జేరె రమావధూటి త
జ్జలజగృహంబులం దలిమిషంబున లక్కను ముద్రవెట్టుచున్. 71

ఉ. కోటకు నస్థిభార మొనఁగూర్చు తఱిం బలియిచ్చు సేమపుం
జీటులు కొమ్మ దీర్చునెడ శిల్పకు లంతికవర్తి సత్యలో
కాటనతత్పితామహుని హస్తముఁ జేర్పదు రాతఁ డాత్మ నై
శాటవిరోధిఁ గన్నఁ గొదవంచుఁ గటారి యొఱం దగుల్పఁగన్. 72

చ. కలిగిననేమి జాణలు జగంబున నంబుధినాథువంటిజా
ణలు గలరే యదెట్టులనినం దనలో మణులెల్లఁ బౌరరా
జులు జవరాండ్రకుం జికిలిసొమ్ములు సేయ నగడ్తపేర వా
రలజలఖేలనత్రుటితరత్నములం గిలుబాడు నిచ్చలున్. 73

ఉ. అంబుధి మేదినీవసనమై కనుపట్టుటఁ గట్టిపెట్టి ని
క్కంబుగఁ గోటచుట్టుఁ బరిఘాకృతి నుండుట యేమి యంచు నెం
చం బనిలేదు మందరరసాధ్రిసమాంబు విహారితత్పురీ
శంబరలోచనాజనకుచక్షతి సారదిదృక్షువై సుమీ. 74

చ. అగణితకేళిఁ బ్రోలిజనరాలిగము ల్వనపాళి నాడఁగా
నగడితఁ దేలి యోలి నురగాళి కచాళి తదీయవేణి సో
యగములు బాళి మ్రుచ్చిలి వయాళిగ నెమ్మిగయాళి జాడమై
డిగునను జాలిఁ గ్రమ్మఱి వడిం జను గూఢపదత్వసంపదన్. 75

చ. పురిఁ బరిఘోరగీనికరము ల్జలనూత్రము వెంట సౌధమం
దిరములఁ జొచ్చి యందుఁ దరుణీతనుగంధము కాలిసంకలై
నెరయఁగ నిల్చి కేకిరమణీవిహృతు ల్మెడవట్టి ద్రొబ్బఁగా

నరిగి తదీయభూతిఁ గొనియాడునిజాప్తులు మూఁగి యాకొనన్. 76

మ. తళుకున్మేడలమీఁది చేడియల చేతత్తేటమిన్నేటిలోఁ
గలయం గానఁబడం దదంబువిహరద్గంధర్వు లీక్షింపఁ ద
ల్లలన ల్గగ్గొని యద్దపున్మడుపు కేలాచూడఁగా నంచు వా
రలచూపుల్మరలింతు రల్లన మిటారంపున్నునుంబల్కులన్. 77

సీ. కార్యత్వరాగతాగతపౌరకులవారకాంతలు చేదివ్వె సంతరింపఁ
బూర్వాభిసారసంభోగానురాగతారావధూమణి చంద్రురాకఁ గోరఁ
గేలీలాలసమరుద్బాలికాపాలిక ల్కడఁగి చీఁకటిమొట్టికాయలాడ
మనువదాజ్ఞాలంఘనఘనజాంఘికభటోత్కరములు కాణాచిగా రమింపఁ
వనరువనరుహనాభనూతనరుచిప్ర, చండపురనీలజాలక సౌధయూథ
కాంతిసంతానమంతరధ్వాంతరోహ, వీథిసురపట్టసాధ్వాంతరోధి యగుచు. 78

శా. ఈశాసీలపుమేడల న్నభవిభాయిస్వర్ణపాంచాలికా
కేళుల్మేలగు పాండురాజభవభక్తిన్మించియు న్సారభా
వాలోద్వేలశిలీముఖప్రభల భాస్వన్నందనాలింగనే
చ్ఛాలబ్ధిం దగి యక్షయాంశుకతతి న్సంధించుచుం దత్పురిన్. 79

గీ. రవిరథతురంగములు నిబ్బరముగ వచ్చి, హర్మ్యముల నిల్చి వేసవి నచటిముద్దు
గుమ్మ లచ్చపుఁ జిమ్మనగ్రోవి నీట, నురుఁగుఁ గడుగఁ బత్తిశ్రాంతి దొఱఁగి యరుగు

సీ. సకలాగమస్ఫూర్తిఁ జరియించుభూసురు ల్వనసలు కొన్ని యేర్పఱచు టరుదె
యనుపమధైర్యశౌర్యారూఢి గలనృపుల్ ఘనచక్రవైభవం బెనయు టరుదె
రాజరాజపౌర్విధిరహిఁగల్గు కోమటు ల్వరవైభవంబున వరలు టరుదె
కువలయప్రఖ్యాతిఁ గొమరొందు శూద్రులు ద్విజరాజభక్తి భావించు టరుదె
యనఁగ సుమనఃప్రవృత్తిచే నతిశయిల్లి, యచ్యుతస్థితిఁ జెంది కర్ణాటసహ్య
సరణి గణనకు నెక్కుచు సరసులందు, వెలసి సన్నుతిగాంతు రప్పీటియందు. 81

సీ. పట్టపుటేనుంగు పజ్జలబిరుదఢక్కారావమాలించి యట్టె తూఱు
దాని నవ్వాలఁ దీయఁ దళుకుగోడల మచ్చుఁ దమనీడఁ జూచి యుద్ధతిని గ్రుమ్మ
నాచెంత గరిడీలనమరు సాదనప్రమోఁత విని యచ్చటికి గిరుక్కనను మరలు
నదిచూచి యపలించు నాదికట్టికవారిఁ బైనెత్తు బంధముల్తోనె తునియ
కెక్కలన గంటలమర సారించి చాఁచుఁ, గరము పిలిచినవారలఁ గదియనిగుడ
దరలు ననిమావటీంద్రుఁ కొంకలపడంగఁ, గవలు వీథులఁ బత్తనికి గంధకరులు, 82

చ. అనిలునిఁ జేసె లేఁడి భువనాంచితపావనమూర్తి నైనతే
యుని విధమంటి మేనిఁ బురుషోత్తము నెంచున నామధేయుఁగా
నొనరిచె నంచు నచ్చటి హయోత్కరము ల్బహుమండలప్రవ
ర్తనము జగత్ప్రసిద్ధగుణధారలఁ జూపు నిజేశ్వరాళికిన్. 83

చ. ఉరగకులోద్వహుండు పగయొప్ప దటం చను దార్క్ష్యసంగతిం
బరఁగఁ దలంచి వజ్రసుషమాతిరమాపరమానుషక్తిచే
నరదములయ్యెఁగా వలయు నప్పురరాజమునందుఁ గాంచి చో
హరిపదమందు మేల్పడగ లందుచునె చక్రవిధంబుఁ జెందునే. 84

చ చలువలు గట్టి చన్నులహుసారుగ గంధము లంది కప్పురం
బలరెడి ముత్తెపుం బరణు లంది తనర్తల్ గట్టి వాల్చెలుంగు
తెలియఁగ నాత్మకాంతిధవళీకృతపద్మభవాండముంగరా
మలకముఁ జేసి నిల్చు పురమానవకీర్తిలతాంగులోయనన్. 85

సీ. ననవింటివాని సానాకత్తి పరుఁజు టెక్కుల చొక్కటపు సాముకొండెలలర
మురువుదీర్చిన చన్నుమొలకయద్దములకు గవిసెనల్వాలెఁ జనుకట్టులమరఁ
దీవలపైఁ బూవుఁదేనెసోనలలీల మేనుల సంపెంగనూనె తనర
బటువు గద్దియలపైఁ బట్టుగద్దెగ రీతి జఘనదేశముల హిజారులమరఁ
గడగి మీఁదటికన్నెఱికంబుఁ జెఱుప, నొకనికొకఁడు వితాకొలారకములనుపఁ
దళుకుఁ గాంతురు వింతసాదనలఁ దీఱి, గుడివెడలి వచ్చుభోగంపుఁ బడుచు లచట.

క. కాదంబరి స్వాదించియు, మోదంబునఁ గౌముదీసముస్మేషముసం
పాదించియుఁ దబ్బిబ్బగ, వాదింతురు రేలు వారవనితలు వీటన్. 87

చ. తొలఁకెడు తావిగంపవొడి తూరుపువాలుఁగఁబట్టి మల్లెపూ
వలపులు కొల్లలాడి హిమవారిఁ గలంచి మెఱుంగుఁబోండ్లగు
బ్బలపయి చంద్రకావిజిగిపయ్యెదకొంగు లెడల్చి యొందుమై
దెలియక తూలుకొంచు వలిదెమ్మెరలాహిరికాఁడు త్రిమ్మరున్. 88

క. ఆనగరంబు ఋతుధ్వజ, భూనగవరనైరి యేలు భూమహిమధరా
ధీనధరాహీనధురా, హీనకరారచితకీర్తి మృదుకంచుకుఁడై. 89

క, చకచకితనఖరముకుర, ప్రకరముఖచ్ఛాయఁ దొంటిభంగి గనుటనో
వికటమహిపాళితత్పద, నికటంబున వ్రాలి లేవనేరకయుండున్. 90

సీ, అనిలబాణము శత్రుజనులకు సెలవిచ్చు జోగులై భోగులై ప్రసుక్కఁ జేయ

వారిదాస్త్రము వైరివీరులఁ జాలించుఁ గర్మందులై గాలిఁ గమిచిమ్రింగ
నంధకారాంబకం బరుల కప్పన యిచ్చు నిహతులై కమలినీనేతఁ బొదువ
నహీశరం బహితరాజాళి కానతియిచ్చు శబరులై కీకసమితిఁ బొదువ
నౌర యీరాజవరుఁ జేరి యసమజన్య, మందు నివియెల్ల స్వామికార్యస్వకార్య
ములను వంచనలేక వర్తిలఁ దొడంగె, గాఢమతిశాలిమంత్రిపుంగవు లనంగ. 91

శా. ఆలీలాజలజాస్యుఁ డశ్వతరుఁడన్ వ్యాళేంద్రుపుత్రు ల్నయ
శ్రీలాసిస్వచరిత్రు లిద్దఱు నిజస్నేహాతిరేఖాజహ
త్కేళీలోలతఁ దన్నుఁ గొల్వ మది నుద్దీపించు ప్రేమంబునం
గాలక్షేప మొనర్చ దుష్టజనశిక్షాశిష్టరక్షాధృతిన్. 92

సీ. ఒకవేళ దండనాయకులు పౌజులుదీర్చి పొడఁగానఁగా స్వారిపోయి మరలు
నొకవేళ వెనువెంట నూడిగాల్గొనుచు ఘోట్రాణంబునెక్కి జోడనలు చూపు
నొకవేళ మంత్రిగాయకముఖు ల్గొలువఁగా సుముఖుఁడై నిండోలగమున నుండు
నొకవేళ మాఱువాలకముతో వసిసహాయంబుగాఁ బురశోధనం బొనర్చ
నొక్కవేళను భరతశాస్త్రోక్తరీతి, జాణలు నటించు నాటకశాలఁ జూచు
నిట్లు వారాశివేలాపరీతభూమి, పాలనశ్రీల నారాజు బరఁగునంత. 93

మ. బిలనిశ్చేష్టజరద్భుజంగము తదాభీలాతిఫూత్కారగా
రళఘోరానలభావదాయకదవవ్రాతంబుఁ దచ్చాంతివీ
త్యులలచ్చైవలినీభవిష్ణుమృగతృష్ణాలీలమై యుర్వరం
గలయం బర్వె నిదాఘకాలము సమగ్రక్లాంతదిగ్జాలమై. 94

సీ. జలవిహంగములు శుష్యజ్జలాశయముల కితరపక్షులఁ జేరనీక తఱిమె
వనకరుల్దవవహ్ని యనుజాంజములు సోఁకఁగరము లెత్తుచుఁగొంచపరువువాఱెఁ
జిలువచాల్కలుగులోపల ప్రుక్కి యన్యోన్య ఫూత్కారపవనాప్తిఁ బొట్టనించెఁ
బులు లాఁకట నలంగి బొరియలడాఁచిన పలలంబులకుఁ బోను బాలుమాలెఁ
దమకుఁ బానైనతరణికాంతములు పొదల, యాకుసందులఁ బొడయొండలంటి ప్రక్క
చుఱుచుఱుకుమన్న మెకములు గెరలి బెదరి, గొరిజదాఁటుగఁ బరుగెత్తి తిరిగిచూచె. 95

సీ. యతిజను ల్చక్రవాళాద్రియవ్వలిమునీంద్రులతోడ మాలిమి గలదటంచు
ఫణివరు ల్పాతాళపతియైన యారగేశ్వరుఁడుమాకేలినవాఁడటంచు
నదులు పంకజభవాండము చుట్టికొన్నట్టి యుదధిరాజున్నాఁడు గద యటంచు
నంచలు సత్యలోకాధీశుఁడగువాని సొగసుతత్తడి మాకుఁ జుట్ట మనుచు

నక్కడక్కడి కరుగ నుపాయ మెంచఁ, గానె బీటెంత మార్తాండకరగృహీత
సలిలసింధువినిర్గతజంతుకబల, నాగ్రహావ్యగ్రబాడబాత్యుగ్రమగుచు. 96

చ. మిటమిటయెండవేఁడిబలిమిం డెలిపమ్మల లేకుసందులం
జిటుకుమనంగ నోడి నివసించి తదగ్రమరంద మప్పట
ప్పటికిని మూతిముట్టెపైఁ బైఁబడి చల్లఁబడంగఁ బ్రొద్దుగ్రుం
కుటఁగని యంతటన్వెడలుఁ గోడెమిటారపుఁ దేఁటు లత్తటిన్. 97

సీ. కావళ్ళ గలిగెఁ జొక్కపుఁ గప్పురపుఁ బల్కు లడరించు సేడాకుటనఁటులకును
సుంకంబులుడిగె మెచ్చులురా గుబాళించు చేవయెక్కు మలాకచెక్కలకును
హెచ్చుకట్టడి గల్గె నింపుగారవమాడ వళిమద్దుచాయలవారలకును
మన్ననల్గలిగె మేల్పన్నీరు చెంబు తేర్పఁ గాచితెచ్చినయపరాఘలకును
హుజూరుకొలువులు గలిగె సొంపాలుకుతేట, నీటికొలఁకులలో బెండు నిండువగల
డెప్పపై బొండుమల్లెల చప్పరములు, నెరయఁజేసినవారికి దొరలచేత. 98

మ. కొలఁకుందామరతావితెమ్మెరలసోఁకుల్దెచ్చు ముత్యాలత
ల్పులబల్సొరణగండ్లచాయఁ గపురంపుంగుంపు సొంపూను మే
ల్మలకాగంపపుతేటతోడి జిలుగుంబన్నీటిధూమ్రంపుఁ ది
త్తులచేఁ బొద్దులుపుత్తు రత్తటినిఁ గాంతుల్కాంతలు స్నేహలన్. 99

చ. అలసిన మమ్ము మింటికెగయం ఘటియించి భరంబువాపు వా
త్యలఁ గనుఁగొన్నఁ గాని తనకబ్బను హర్షమటంచు శేషుఁడ
ర్మిలిఁ దలలెత్తిచూచు బిలరేఖలనన్మడుగుల్చెలంగె ని
ర్జలలసితాబ్జకోరకపరంపర తత్క్షణమండలంబుగన్. 190

క. పరుసైన యెండమెండున, నరవరులై హాయిలేక యలజడి పడఁగా
సురగాలి యేఁచెఁ బ్రజలం, గఱవుకుఁ దోడావపంట గలిగిన కరణిన్. 101

క. అపరెడు నదీజలంబుల, నెపవాయఁగలేక యవిమహిం గ్రుంకినచో
నడుగంటె నిలిచి తెలిపిన, సుడులనఁగాఁ జెలమలింపుఁ జూపెం బ్రజకున్ 102

గీ. కూపములమీఁదఁ గలలోభగుణముకతనఁ, దూఁచిక్రైకొను క్రైవడిఁ దోఁచెనపుడు
హాలికజనములుపరికల్పితాంబుయంత్ర, ములజలంబుల గ్రహియించుచెలువు మెఱయ

క. జడజవనబంధువేఁడిమి, నుడికెడు పుడమికి నొకింత యూరటసేయ
న్నడుమనెలకొన్న వెన్నెల, వడువున శాల్మలుల తూలవారము నెఱసెన్. 104

గీ. ఆట్టిగ్రీష్మర్తువందు నయ్యధిపమాళి, యతులతరభోగభాగ్యంబు లనుభవించె
ననిన జైమినిమునియావిహంగములన, నంతరకథావిధం బెట్టి దని యడిగిన. 105

## ఆశ్వాసాంతము.

మ. మృదువాణీసుమచాప చాపలపలాయిద్వేషిరాజన్యకా
స్వదితాశాంచలభాగ భాగవతసంపన్నిత్య పూజాలస
త్పదనాధిష్ఠితవిత్తవిత్తమ సుతేస్వచ్ఛస్వకీర్తిచ్ఛవి
చ్ఛిదురేందుద్యుతికాండఖండదతి నాసీరైకభేరీరవా. 106

క. గాంధర్వరసిక యౌవన, గంధర్వవిపత్సుఖర్వగర్వవిదళనా
సంధానధురంధర బల, సంధానవపరశురామ సంగరభీమా. 107

మత్తకోకిల. నందనందనపాదనత్యభినందిమానససింధుగో
విందసన్మణినాగపట్టన విశ్రుతప్రభుతోజ్జ్వలా
చందనైందవసుందరీహరిచందనద్రుమనవ్యప్రతి
చ్ఛందనూతనకీర్తికందలచంద్రికాంకదిగంకణా.

## గద్య.

ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ సవరమ స్వయాభరణ నారాయణభూపాలతనూభవ శఠగోపతాపసేంద్రచరణారవింద సంచలన్మానసమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణానంద కామినీమనోహర రూపరేఖావిజితచైత్ర కాశ్యపగోత్రపవిత్ర జాతివార్తాకవిజనామోదసంధాయక చిననారాయణనాయకప్రణీతంబైన కువలయాశ్వచరిత్రం బనుమహాప్రబంధంబునం బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# కువలయాశ్వచరిత్రము.

## ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీరమణీనందన రే, ఖారాజద్రూప వైరికైరవవల్లీ
సూరప్రతాప సవరము, నారాయణభూప కీర్తి నవ్యకలాపా!

గీ. అవధరింపుము జైమిని కలపతంగ, కులపతంగంబు లిట్లని తెలుపఁ దొడఁగె
నంత నాసర్వసర్వంసహాధినాథ, జంభసంభేది యత్యంతసంభ్రమమున.

గీ. ఒక్కనాఁ డంతిపురమున నుదుట బిగువు, గబ్బిగుబ్బెతగము లాడిగములు సలుప
రాజవర్య పరాకజారమున దొరలు, గాచినా రని హెగ్గడికత్తె తెలుప. 3

సీ. పచ్చకప్పురము సాఁబాలు గూర్చి కురంగమదమున గీఱునామంబు దిద్ది
యలకుపెత్తులరూపు వెలిసూపు వలిపెంపు జాళువాసరిగరుమాలు చుట్టి
మొలకవెన్నెలలబారులు దీరు కట్టాణితెలిపాలకాయయొంటులు ధరించి
క్రొత్తముత్యపుమేలుకుట్టుఁ జీనాపట్టుఁ బసుపుబంగరుపూలవట్టిఁ బూని
పికిలిపూబంతి దంతపుఁబిడి కఠాని, పోఁతయొఱ వంక మొలవంకి పొంకపఱచి
తమ్మిదోదుమ్మిజోదుసాదనలహరువు, వ్రాఁతపనిదుప్పటీవలిపాటు వైచి. 4

చ. ఉడిగపుటెంతి కట్టెదుట నుంచినపావలు రాజసంబునం
దొడిగి మెఱుంగుటుంగరపుఁ దొరపుహీరపుమించుమంచుపైఁ
బడఁ దులకించు కల్వవిరిబంతులమించు మదాళిమాలిక
ల్బడి నిరువంక వైచు తెలిపావడచోపుల వీఁగిపోవఁగన్. 5

చ. చెలువలు వీచు పూసురటిఁ జిందిన తెమ్మెరల న్రుమాలుచుం
గులు గదలంగ వాఁడికొనగోరులసోఁకుల గబ్బిగుబ్బచా
యుల గరుడాల్చు నిద్దఱు లతాంగులు మూఁపులఁ జేతులూఁదిరాఁ
జిలుకపటాని తేజినొర చెన్నున నంతిపురంబు వెల్వడెన్. 6

క. సకియలు సాహో యనఁగా, నకలంకశశాంకమణిగణాంతః ప్రతిబిం
బకలాకలనాద్విగుణిత, సకలానుగవారమా హజారముఁ జేరెన్. 7

గీ. చేరి జగజోతిమకరాతి చెక్కడంపుఁ, గలికినీలంపుమెట్ల సింగంపుగద్దె
నుహుతకాల్పట్టుజిగి యడ్డయొఱగుతోడి, సొగసు నిద్దంపుఁ బట్టుగద్దిగ వసించి. 8

సీ. చెవి[illegible]డఁ జేరి నిల్చినవ్రాయసమువారి ముసలకమ్మల కొప్పనులు లిఖించి

దిక్కులనుండి యేతెంచు మన్నీలమంత్రులతోడ నుచితంపుఁబలుకు పలికి
సమయోచితముగ హాస్యము లొనర్చు విదూషకులదిక్కు మొగకనవ్వొలుకఁ జూచి
యవసరంబులవార లవధారనుచుఁ జెల్వఁ బొడఁగని వారికింపులు వెలార్చి
సత్కవీంద్రులు రచియించి చదువుపద్య, సమితియం దొరపారలు చక్కదిద్ది
ప్రౌఢి గనిపింపఁజేయు భూపాలుకొలువు, ప్రజలకవ్వేళఁ గన్నులపండువయ్యె. 9

చ. ఇటువలె నున్నవేళ ధరణీంద్రునిప్రోలి కవేలనీల సం
ఘటితఖలీనలీనసుముఖచ్యుతఫేనవిరాజి తేజి యొ
క్కటి తుదివాగె పూని వెనుకం గొనిరా మునిరాజువచ్చె న
చ్చటి కని గాలవుండు పరిషత్పరిషక్తమహోచ్ఛ్రితంబుగన్. 10

మ. జలజాప్తోపమతేజ మంజలిపుటీసంధానము న్సంభ్రమా
కలితోత్థానము భక్తిపూర్వకనమస్కారంబు నామ్రేడితో
ద్గలితాంతస్తుతివారముం జలుపశిక్షాదక్షుమై సభ్యవ
ర్యులకు న్నైయ్యమునింప సంయమివరేణ్యుం డొయ్యనం జేరినన్. 11

క. ఎదురేగి శిరోగ్రముత, త్పదయుగళము సోఁక నృపతి ప్రణమిల్లి ప్రియం
బొదవఁగ నర్ఘ్యాదికవిధి, నెప రంజిలఁజేసి వినయ మొనయఁగ ననియెన్. 12

క. క్షేమమె కద భవదాశ్రమ, భూమి న్నీవారవారిపూతర్ణ్యామిథస్సం
గ్రామారంధవృగేంద్ర, స్తోమంబులకెల్ల నోవిశుద్ధచరిత్రా! 13

శా. స్వామీ మీసుముఖత్వమే కుశలవాచారీతిఁ గన్పించు నే
నామీరాకకు నన్యకారణము గాన న్నన్నుధన్యాత్ముని
గా మోదంబునఁ జేయవచ్చితిరి తక్క న్వాస్తుకామత్వ మి
క్లేమేనున్న నుపేక్ష సేయకయ మానీ యానతీవే దయన్. 14

సీ. ఐశ్వర్యగతిమీఁద నరుచి పుట్టినఁగాని బలహంతమీఁదెంత నిలుపవెఱచుఁ
జక్కఁదనంబుపైఁ జౌక దోఁచినఁగాని సురభామ మీసీమ చొరఁగ వెఱచుఁ
దనపేరుమాత్రంబు కనరువేసినఁగాని హరిపట్టి మిము గిట్టి యరుగ వెఱచు
విబుధధామముమీఁద వెగటు గల్గినఁగాని వనజారి మిముఁజేరి చెనకవెఱచుఁ
గానఁ దావకనియమవిఘ్నంబు నడుగ, నలికెదనుగాని యోహాని యట్టులేని
ఘోరమామకతూణీరగుప్తశాత, శరమునకునొక్క చెరలాట సవరింపు? 15

లయగ్రాహి. అంగజమదాపహశిరోంగనవటత్సకిపభంగురతరంగఘనరంగపరిధారా
సంగతి మహీపాలయువుం గనెక మీఅనొక యంగగొనువేగ మెనయంగలిగితేవన్.

రంగుమెయిచందము మెఱుంగుమొగమందము చెలంగనునుగందముపొసంగనిదిగోవిభా
చొంగటనె నిల్చెను దురంగమము వచ్చిన తెఱంగు నెఱుఁగంగఁ బలుకంగదవె మౌనీ. 16

ఉ. నావుడు మోమున న్మోఁకనవ్వొలుకం దమవారిఁ జూచి యా
హావినయంబు గంటిరిగదా యనుచుం దలయూఁచి యాగదీ
క్షావిధిమత్సమిత్సమితికర్షణకర్కశమైనకేల నా
భూవిభుమేను తట్టి మునిపుంగవుఁ డిట్లనియెం బ్రియంబునన్. 17

ఉ. అంతటివాఁడవౌదువె కదయ్య తలంపఁగ శత్రుజిన్మహీ
కాంతునిపట్టివే యఁట యఖండమదారివిదారణక్రియా
కాంతపరాక్రమంబు లడుగన్వలెనే మఱి యీదిగంతవి
శ్రాంతసుధీవిధేయగుణసంగతినీకె తగుం గుమారకా. 18

చ. చలపరితావకీనభుజశౌర్యము పెట్టనికోటయై ముదం
బలవఱపంగ యాగహవిరాహరణార్థనిమంత్రణక్రియన్
బిలిచినఁగాని రాఁడు బలభేదియు నేఁటిదినంబుదాఁక నో
కులనగధీర యీనడుమఁ గొన్నివిశేషము లెన్నశక్యమే. 19

క. పాతాళకేతుఁడనియెడి, ఘాతుకుఁ డొకరక్కసుండు గలఁ డంబుధర
వ్రాతారవనీతావహ, భీతానవధానసకలబృందారకుఁడై. 20

క. ఫలకుసుమబిసాదులు గం, పలకొలఁదులు దెచ్చుకతన మాలిమికాఁడై
నిలుకడఁగ మాతపోవని, మెలఁగుచు వాఁ డుండియుండి మెల్లనఁ బిదపన్. 21

గీ. మామకానూనజపహోమమౌనసంవి, ధానముఖమైన నియమసంతాన మనెడి
పద్మవనవైరికళ మాటుపఱప నేఁడు, రాహువైనాఁడు వాఁడు ధరాతలేంద్ర! 22

సీ. ఒకఁడైనఁ గని యెఱుంగకయుండ విపళించు సారనీవారకేదారసమితి
వెనుకవేళలు గాచి కని కానమిగ దాఁచునటవిఁ దాపసుల మృగాజినమ్ము
లాపిమ్మటను గొంప అదియేమి యనఁ ద్రుంచుఁ బర్ణశాలాసమీపద్రుమాళిఁ
బిపప నంపఱుఁ జూడఁ గదిసి కైకొనసాగు యాగకల్పితహవిర్భాగతతులు
రచ్చసేయఁగఁ దొరకొను రాత్రులందు, మునికుమారుల బెదరించి కొనఁగ దొడఁగుఁ
గామినీమార! వాఁడు నిక్కముగఁ జేసె, నిందు రమ్మన్నచోట నిల్లెల్లఁ గొనుట. 23

సీ. పాడగన్న సాష్టాంగముగ వ్రాలి చనువాఁడె యెదురుగా రారంచుఁ బదరసాగెఁ
బిలిచిపెట్టిన వన్యభిక్షగైకొనువాఁడె కోరి పెట్టరటంచుఁ గొణఁగసాగె
నిలుచుండి చంకచేతులు కట్టుకొనువాఁడె కొలువరా రేమంచుఁ గెలయసాగె.

వినయంబుతోఁ జేరి పనియేమి యనువాఁడె యరయ కడ్డాదిడ్డు లనుప సాగెఁ
దనవచ్చోదోషము క్షమింపుమనెడువాఁడె, యేమనిన లేని వాతప్పు లెంచసాగె
వినుము మహికాంత కొంచెంతపనికినైనఁ, బలుకులేటికిఁ గిల్లాకుపనుపసాగె. 24

చ. ఇటు లతఁ డున్న యంత ధరణీంద్ర యొక కానొకనాఁడు నాకురం
గట నడయాడు నొక్క మృగకాంతకుఁ బ్రొద్దులవేళ చాలఁ జే
రుటకతనం దపోధనసరోరుహలోచనలందఱు న్నను
త్కటగతి ముచ్చటల్నిగుడఁగాఁ గడగానని సంభ్రమంబునన్. 25

సీ. ఎన్ని నేచ్చదది తానిన్నిటిమొటికగా యాకొమ్మఁ గడకుఁ బొమ్మనఁగదమ్మ
పడుచుమూడలచేతఁ బనియౌనె వీరేల యనసూయఁ దోతేరఁ బనుపరమ్మ
యీప్రొద్దునక్షత్రమేమి లగ్నముమంచిదేయంచుఁ దగువారిఁ దెలియరమ్మ
శుద్ధవేళ సుఖప్రసూతిగావలెనంచు నిలువేల్పులకుమీఁదులెత్తరమ్మ

గీ. అనుచు గుమిగూడి మృగి నొక్క యలరుఁదోటఁ
బూవుఁబొదరింటఁ దార్చియింపులు జనింప
నున్నతఱి మాయనైకొని యట్టెపడిన
సరణిఁ జెట్టునఁ దెగిపడ్డ కరణివాఁడు. 26

సీ. తళుకుటద్దపురంగు గల చెక్కుల బెడంగు మేలికమ్మల డాలు పాలుచేసి
తొగరుఁగెంపుల పెంపు నగు మోవి నెఱసొంపు పసని ముక్కఱనిగ్గు పాలుచేసి
సింగంపుగతిఁ బూను చిన్నారి కేఁగౌను బంగారుమొలనూలు పాలుచేసి
వలిజక్కవలఁ గేరు వలువగుబ్బల తీరు పసిఁడి పైఁటచెఱంగు పాలుచేసి
తనరెఁ గనుఁగొంటిరమ్మ యివ్వనితయనఁగఁ, దగినకాంతావిలాసంబుఁ దాల్చివచ్చె
గిలుకుమట్టెలురవలుపావలు నుజిటులు, విడెముమడమలఁబదుకీలుజడయు మెఱయ.

చ. చెలువగు ముద్దుటుంగరపుఁ జే నెఱికుచ్చులఁ బట్టి యుబ్బగు
బ్బల జిగి జాలువాఱవికె పక్కన ప్రీలఁగఁ బైఁటవాటుగా
వలపడఁ గొంకుఁజూపులు నిజాంఘ్రినఖాళికిఁ గల్వపండఁగాఁ
జెలువల చెంతకుం జనియె సిగ్గులపెండ్లికొమార్తయుం బలెన్. 28

సీ. కూర్చున్నవారు లోఁగుచు లేచి చేఁజూపి యిందురమ్మని ప్రియం బెనయఁబలుక
నిలుచున్న వారు చెంతలఁ జేరి స్వస్తిభవత్వె యటంచు దీవనలొసంగ
నవల మాటాడువా రవరిపాటున మర్లి యొఱపు వీక్షించి నివ్వెఱపడంగ
నపుడు వచ్చిన వారలో చెలి యెవతె యీకొమ్మ యంచును గుసగుసలు వోవ

ధీరులగు వార లూఁకను బేరు నడుగ, నెంచి యేమంచ మని విచారించికొనఁగ
నిలిచె జిలిబిలి జడదారి చెలులఁ జేరి, మచ్చికప్పెఁడుదారి నమ్మాయదారి. 29

సీ. పనిలేనిపని గిఱుక్కున మోముద్రిప్పుచోఁ జెక్కుపైఁ గమ్మ తళుక్కు మనఁగ
సిగ్గునఁ దలవంచి చిఱునవ్వు నవ్వుచోఁ గెలకులఁ జికిలివెన్నెలలు గాయఁ
గొంగేలఁ బైఁటచెఱంగు బిగించుచోఁ నిద్దంపుఁ జనుఁదోయి నిక్కుదోఁపఁ
బలికించువారి మోములు దేలఁజూచుచో వాలుఁజూపులు పూలవాన గురియ
నిలుచునో యవును గగునంబుఁ దెలియనీక, పలుకుబెళుకును మొగమునఁదోలఁకుదెలివి
యొదలియుండకు వనడలోఁ బెదఁగువారి, కన్నుఁబ్రామఁగ మృగియున్న కడకునరిగె.

క. వడినరిగి రవికి రుచినే, ర్పడి మిడిగ్రుడ్డులను జిక్కరించిన చెవులు
న్నొప్పవున నెత్తినవాలము, నడరఁగ నోక సింగమై మృషాంగన నిలువన్.

చ. కనుఁగొని యూనికాంతలు కకాపికలౌ మది నమ్మ చెల్లఁగా
యనుచు మిళన్నభరీకృతభయంబు గళత్కబరీచ యంబున
త్యనుపదధావనావిలమృగాంగనమున్ ముహురుచ్చలద్గురు
స్తనమునుగా రయంబున యదాయదలై పఱతెంచి తెల్పినన్. 31

క. కటకటఁబడి మఱినేన, క్కుటిలకృనుగతులు గురియ గుఱి యెవ్వఁడోయం
చటునిటునారసి వీఁడఁ, పటుయోగజ్ఞానగరిమ భావించుటయున్. 32

సీ. చిరదయాగాంభీర్య పరిఖకు తాఁబేలు నవధైర్యవప్రంబునకు సురంగ
ఖలజాతిగుణలతావళికిఁ బ్రాఁకుడుచెట్టు నిష్ఠురత్వంబను నిమ్మకొరవు
క్రూరవాచాకాలకూటంబునకు వార్ధి దాక్షిణ్యవన్యకుద్దామదవము
ప్రకటితాత్మజ్ఞానరవికి దుర్దినవేళ మూర్ఖతాస్థితికి సామ్రాజ్యకరము
కోపమిటు లౌనో కాదోయో భూపవర్య, యదియపుడు వచ్చి నామీఁద నావహించి
కటములవరించె మొగమెఱ్ఱఁగా నొనర్చె, బొమలుముడివెట్టె ముకుపుటంబులు గదల్చె.

వ. అంత.

సీ. తాపసవటులకుఁ దరవాయిఁ జదివించు భాష్యమల్లంతటఁ బాఱవైచి
కొమ్మనసంగంబుఁ గోకిచెంగట మేఁతలడుగు జింకనులిక్కిపడనదల్చి
మారపూజకంబుపర్ణాదులుగొని తెచ్చు నెదుటిశిష్యులను నేమేమొతిట్టి
యోగమవాదమ్మాధ్యస్థ్యంబుగోరు ప్రవీణసూరిశ్రేణి వెక్కిరించి
కళవసంబూడ జలకమండలువు వీడ, జడలు మహిజీరఁ జేజపసరము జాఱ
దర్భముడిద్రవేల ధ్యానతత్త్వంబుసోలఁ, గడిగి నిలుచుండి యాగ్రహాగ్రహముఁ జెందె.

వ. అక్కటా దిక్కటాకంబు లొక్కక్రక్కున మెక్కంపలంచు ముక్కంటిపై
కుక్కిన యక్కటికంబుల యుక్కటికిరాతిగండియ నగ్గలపుటలుకయొగ్గి బగ్గుబగ్గు
రుమున శమనసనుజకమన సంధానకరంబగు పరుషాక్షరంబున శపియింపంబూను
నావసరంబున సరస్వతీశంబరనయన గుడిగుడివెడలఁగడంగు నెడ జడధివసనాని
రాలంబనజనితంబుగునొక్క వచనంబీవిధంబున వినంబడిన నాకర్ణించితి. 36

చ. పదరకుమన్న షానికులపావన కుమ్మరి కొక్కయేఁడునం
గుదియకు నొక్కపెట్టునని కోవిదు లాడరె ఘోరసాధనా
భ్యుదితతపోబలంబిటులయో యొకరక్కసుపాలుచేతురే
మదిమదినుండి మేమెఱుఁగమా మఱివీని ఖరాపరాధముల్. 37

గీ. ఐన నేమాయె గనుక ధరాధిపతులు, చేయఁదగినట్టి యీదుష్టశిక్షనీకుఁ
బడినభారంబె పాఱెడుబండ్లకెదురు, కాళ్లుసాతురె యోవెఱ్ఱికానవినుము. 38

చ. ఇదెహరి యాఋతధ్వజనరేంద్రున కిమ్మపు డానృపాలుఁడే
కదనములోనవీనిఁ గడికండలొనర్పఁడె నీకునేటికీ
యెదవడనన్నమాట యొకయింత వినంబడునంత మాత్రనే
కదియఁగవ్రాలెనొక్క తురగంబు వియత్తలినుండియత్తఱిన్. 39

క. పతయాళుతురగభృత్తో, న్నతకర్ణద్వయమునందునం గెంపులమే
ల్పతకమమరెరవికిరణం, బతిరయమునననుపవచ్చు ననువునటింపన్. 40

చ. కనుఁగొని దాని ఫాలఫలకంబునఁ గట్టినపత్రికన్ లిఖిం
చిన వివరంబుఁ జూచి సరసీజహితుండు దయాళుఁడన్వ
చ్చినదిదియంచు భూవలయసీమదిరంబును జుట్టివచ్చునం
చనఘుతదాఖ్యయుంగువలయాశ్వమటంచు నెఱింగినెమ్మదిన్. 41

సీ. వరదానములకునై వచ్చువాక్ప్రియకారి ముచ్చాయ లెఱుఁగించు మొగముదెల్ప
యాగభాగాసక్తి నరుదెంచుపాకారి యేఁకారి యిది మీకు నేల యనఁగ
వనవిహారాపేక్ష వచ్చు క్రొన్నెలదాల్పు జక్కిమార్పులకు హెచ్చరిక పడఁగ
మునులసేమ మెఱుంగఁ జనుదెంచు కరివేల్పు దండనాథుని సమాధానమనుప
విని వినమి చేసి పని గలదనుచు వారిఁ, గూడ దనిత్రోయవలెఁ గద యేడజోలి
మాకు నేటికి వారితో మచ్చరంబు, సొమ్ము సొమ్మునఁ గూడఁ జేర్చుటయె నీతి. 42

చ. అనితలపోసి యేనిటురయంబునఁ దెచ్చితి నత్తురంగముం
గనుఁగొను మిత్తురంగము వికల్పితసత్వరహేషచేఁ బరా

కని మహాప్రసన్నమున్ముఖంబున సారెకుసారెకు న్నలా
మొనరుచు దీసెఁ గైకొని జయోన్నతిఁ జెందుము రాజనందనా 43

చ. అనిన మహాప్రసాద మిపు డానతి యిచ్చితి లేకదా యిఁకం
గనఁబడఁ జెల్ప నేమిటికిఁ గార్యముఖంబున స్వామిచిత్తమే
ననుచు నదేల కావలసినం దనుజు న్వధియింపఁ జాలరే
ననుఁ గరుణావలోకనమునం ఘనుఁ జేయఁగఁగాక వచ్చటల్. 44

సీ. చాయలొందినపంచు సంతరించిన వాలుచూరకత్తి పరీక్ష చూడఁగలిగె
తరతరంబులనుండి దాఁచినా రనివిన్న కఱునేజామేలు గాంచఁగలిగె
ననిలోనఁ పనుఁగాము ననిచెంచులర్పించు కేడెంబువాడి వీక్షింపఁ గలిగె
పందెమొగ్గినఁ గూడఁ బగఱ గెల్చుకటారియిదిపని వగనిశ్చయింపఁగలిగె
స్వామి మీకతమున నిట్టి చాకపనికి, మీరు వేంచేయవలయునే మీగృహమున
కరుగుదెంచితి రందులకనుట కాదు, పదములెక్కడఁ బడలెనోకద మునీంద్ర. 45

చ. అనిమహిజాని యూడిగపుటాప్తులఁ గన్గొని పండు చాలుగాఁ
బనుపుఁడటంచుఁ బల్కి మునిపాలకమౌళికిఁ గేలుమోడ్చి స
ద్వినయవినమ్రుఁడై నిలిచె వెంబడిగా నరుదెంతు మున్నుగాఁ
జనుఁడని వీడుకొల్పి హరి సాహిణి నీవశమంచుఁ బల్కుచున్. 46

చ. గడెలు పదాఱు చెల్లె ననఁగా విని కట్టికవారు మ్రోతి గ
న్పడ నవధారు దేవ జతనాయన గద్దియ డిగ్గి యంపటి
న్విడిచలకంపి మౌళిసరణిన్ హరికల్నిగుడంగ జెట్లు వెం
బడి కయిలా గొసంగఁ దెలిపావలు మెట్టి యొయార మేర్పడన్. 47

శా. కోణేవాకిట వారినిల్పి కులుకుంగుత్తంపుఁ జన్గుబ్బలే
జాణల్గ్రాంవఱు కుంచెలండి యపసా ల్సాగింప వాణీరణ
ద్వీణాపాణులు కొందఱారతిగముల్దీర్పంగఁ గక్ష్యాంతర
శ్రేణుల్దాఁటి నృపాలుఁ డంతిపురముం జేరెం బ్రమోదంబునన్. 48

వ. అంత. 49

క. దనుజాతఖండనోద్ధతిఁ, జనుమనుజాధిపుప్రతాపజాతము మునుముం
గనిపించె ననుచు జనము, ల్గనుఁగొనమార్తాండమండలం బుదయించెన్. 50

క. ఇటువలె వేఁగ నరపతి, పుటభేదనముఁ బ్రయాణబోధక భేరీ
పటహధ్వను లాకాశా, ఘటనములు నిద్రలేపి పయనము దెలుపన్. 51

సీ. పటుచక్రగతి నేలపాఁతు పెల్లగిలంగ విమలమణిస్యందనములు పనర
మావటీలకు మింటిదేవత ల్మంత్రాక్షతములీయగజయూథపములు వెలయ
ధారాసమున్నమద్ధవళచామరలు తెక్కలభంగిఁ దగఁ దురంగములు సెలఁగ
జయలక్ష్మిలవరింపఁ జనుపెండ్లికొడుకుల గుంపులై భటరాజకోటియొనర
నడచి తమగపుబైట సన్నాహమెల్ల, నమరఁ బౌజులు దీర్చి నిజాప్తమంత్రి
వరముఖాంతరమున సరివారితోడ, మాటలాడించుకొనుచు సామంతనృపులు. 52

చ. గొనబుపసిండి కీలరిగె గుంపులనీడ వసింప నంతలో
జనపతి మేలుకాంచి హరిచందనగంధిలమైనవారిఁ గుం
దనపుమెఱుంగుగిండ్ల వసితల్గొని తన్ముఖమజ్జనంబు సం
పానరఁగఁ దీర్చ నద్దమొకయుగ్మలి పూనఁగ నామతీర్థమై. 53

చ. మినుకుఁ గడానితాయెతుసమేళపుఁ గ్రొవ్విరిదిండుదండడా
ల్పునవలెవాటు చల్వనలిపంపురుమాలువు గట్టి దట్టిఁ జె
క్కినవిడికెంపువంకి జిగి కెంపగు దుప్పటిదాల్చి యాతఁడే
మనసిజుఁడాయన న్సొగసుమార్గముగాఁ గయిసేసి వేడుకన్. 54

సీ. సమదవేత్రకరాతిసాహసనాదంబు గదలివచ్చెనటంచు మదికిఁ దెలుపఁ
జామరగ్రాహిణీసరళకంకణరావ మివలి కేతెంచె నంచెఱుక సేయఁ
గమనీయయవనికాకాంచికానిస్వాన మల్లన వచ్చెనం చానతీయ
సంగీతవిద్యావిశారదాగానంబు లిదె యరుదెంచెనం చెఱ్ఱింపఁ
జనవరులు లేచి నిల్వ హజారమునకు, నరిగి చౌకట్లముత్యాలయందుహస్త
మిడఁగఁగొల్చుచు నిలిచి సాహిణులు మొక్కి, తెచ్చిముందఱఁ దోలునాఁటి తేజినిల్వ

క. నడిఁగట్టికవారలు పా, వడమిడి హెచ్చరిక రాయవరగండ యనన్
బెడయంకెవన్నెపైఁగా, లిడకపుడు చివుక్కుమనఁగ నెక్కెం దేజిన్. 56

మ. చనవుల్మీఱఁగ మ్రోల నూల్కొలుపు బల్సాంబ్రాణిధూపంబు వా
సనకు న్వేలుపుముద్దరాండ్రు కచముల్జార్పంగఁ బుణ్యాంగనా
వనజిన్యబ్జకరాపత చ్ఛిత్రమణు ల్వర్షింప ఛత్రంబుపై
ననువౌ బంగరుగుబ్బ పొల్పుఁ దలఁ బ్రాలై ముంచఁ జంచద్గతిన్. 57

చ. జనవరపాళి కొంతవడి సాహిణి నివ్వెఱగంది చూడ జో
డన రవగాలు చూపుచు హుటాహుటి నేగిపరాకు వీరువీ
రని తముఁ దెల్ప నంపఱు రయంబున వెంబడి వాఁగె సళ్ళిదొ

య్యనఁగనుమాసి కన్ దెఱచునంతటిలో మునిసీమఁ జేరఁగన్. 58

క. అరుగఁ దదీయమనస్స్ఫుర, దరవింద మరందబృందమై మధురసుధా
చిరకంపమై యొకానొక, పరమానందంబు హృదయబంధం బొందన్. 59

సీ. మధ్యసంధ్యాస్నాన మౌనీంద్రులూన తాపసగంధపవనంబు భ్రమరివారె
నంబు పర్ణసమిత్కుశాయాతపటుజాత సమదనాదంబు మాసంబు దీఁటె
సవన ధూమాబ్దవీక్షణనటత్కేకికాంతావిలాసము తోడపట్టుకొనియె
నన్యోన్యవైరాసహమృగేంద్రమత్తవేదండకేళికలు పంతములు పలికె
నీకరణిమున్నుగాఁ బరాకిడియె మాని, యాశ్రమంబని తన్మార్గమభినుతింప
మోదమునఁ దేలి నృపమౌళి మోము చూడఁ, జనవుమైఁ జేరి నిజకేళిసచివుఁడనియె.

సీ. చలువలు నించు నచ్చపుమంచుఁ జిలికించు సీరాయఁ డెద లేర్పఱించువాఁడు
గలభి గాకుండ వేల్పుల నొక్కనొక్కనిఁ గా ధనరాజు వెలినుండి యనుపువాఁడు
వారివారిప్రభుత్వతారతమ్యమెఱింగి గిరిశుండు బంతిసాగించువాఁడు
ప్రొద్దువోయెను జూచి భుజియింపుఁ డని దేవపతి యుపచారము ల్పలుకువాఁడు
తగినవారల వీక్షించి తమ్మిబోఁటి సోఁడు మాటికిఁ జవు లెచ్చరించువాఁడు
జనవరాఖండలా యిందు సంయమీంద్రు కాండకృతమైనసత్రయాగంబులందు. 61

చ. మునివనిత ల్శచీముఖ తమోనిభవేణులకుం బతివ్రతా
జనతతిఁ దెల్పఁ జోఁబరవిచారము గాదని వేల్పుటొజ్జజ
వ్వని మొగ మడ్డముం జొనుప వారలు నవ్వుదు రామె సిగ్గుపెం
పునఁ దలవంపఁ జందురుఁడు పొంగఁగ నిచ్చట యాగవేళలన్. 62

సీ. సాలీఁడు గాఁబోలు సమదవేదండంబు తెలినారచీరలు డులిని తెచ్చుఁ
బనివాఁడు గాఁబోలుఁ బటుఘోణిపోతంబు బలువోర నివ్వరి కలుపుదీయు
గొల్లఁడు గాఁబోలు భల్లూకపాకంబు మేలిజన్నపుఁబసి మేఁపి తెచ్చుఁ
జనవరి గాఁబోలు గొనబుఁ బ్రాయపు జింక యలరిపై పారుపత్యంబు జేయుఁ
గూలిగొను నొజ్జకాఁ బోలుఁ గోదమ చిలుక, తపసిబుడుతలగమికి వేదంబు నుడువు
సుసరముగఁ బారికాంక్షు లేజోలిలేక, జపతపంబులు సాగింప జనవరేణ్య. 63

చ. మునివరులేగ వెంట మృగము ల్నదికిం జని యంతనంత మే
పున కటు నిల్చుచు న్నియమపూర్ణత వారు నిజాశ్రమాళికిం
జనినఁ దదార్ద్రిబంధురవిశాలజటల్లరజీవకాహి వె
న్కొని చెవి బక్కరించి యుఱుకు బొకకట్టిన వెల్ల దాఁటుచున్. 64

ఉ. ఎంతదినంబులం బడగ లించుక నీడఁగఁ బట్టి మానులం
గొండొక సేదదేర్చు ఫణికోటులఁ జేరి యిదేటి కార్య మా
రెండు మఱేమి మే మిచట లేమె యటంచు మరల్చి చెల్వుమై
నిండ మయూరిక ల్పికిలినిద్దపు రెక్కలవీచు నక్కడన్. 65

మహాస్రగ్ధర. జనవన్మౌనీంద్రవేదాక్షరయుత తతహస్తస్రువాజ్యాహుతిప్రో
ద్భవవహ్నిస్ఫారకీలాప్రకటితకరదీపప్రభ న్వత్తు రౌరా
హవిర్గ్రాహాహూతు లింద్రాద్యమరు లననికై యాస ప్రేరేపఁగా వీఁ
దినపాంచద్భూమధూమస్థితులు నిబిడమై దృష్టి చీఁకట్లు గప్పన్. 66

క. వెలిమియగ్గి పొగల్దగు, వేలుపుడిగ్గియమునింగి వెలువడు నమరీ
జాలము తిన్నని పెన్నెఱి, వాలుఁగురుల కగరుధూపవైఖరి యగుచున్. 67

చ. ఇనహరిణాంకరశ్మి కెడమీయని యవ్వనిఁ బంకజాకరం
బునఁ గవజక్కవ ల్వగవఁ బ్రొద్దులు గ్రుంకుట దెల్లవాఱుట
ల్గనమి జలాగవల్లి కులకాంతలమోమును కల్వరాయనిం
గనుఁగొని విచ్చిపోవుటయె గాని వియోగ మెఱుంగఁ దెన్నఁడున్. 68

చ. అని తెలుప న్మహీశుఁ డవుఁగా యని మెచ్చి పటాని తేజిడి
గ్గినతఱి మూఁగి గచ్చు టరిగె త్తెలిపావడ వైచి యచ్చపుం
బని మగజాతి చెక్కడపుఁ బావలు నిల్పిన వారలం గనుం
గొని యటు నిల్పి యాప్తులొకకొందఱు వెంట నెరాముపంబునన్. 69

క. చని నృపతి గనియె మునిజన, వనితాజనతానితాంతవర్ధితకేళీ
వనపాళీ కుసుమాళీ, జనితాళీనలినఘనము సంయమివనమున్. 70

క. కని పర్ణశాలప్రోలకుఁ, జని యచ్చటివారిచెంత సంయమిపతికిం
దనరాక తెలియఁ జేసి త, దనుమతిచే వేగఁ జని తదంతర సీమన్- 71

సీ. అచ్ఛదంతచ్ఛవి యామస్తకన్యస్తభసితాభఁ జేరి కేకిసలు గొట్ట
మోఘావిరుచి గండమిళదురుశ్మశ్రుకుక్ష్యయములఁ జప్పట్లు చఱచి నవ్వ
జడలఁ బర్విన డాలు శాతేరధారాళికాంతులఁ గికురించి కన్నుమూయఁ
బటునఖద్యుతి కరస్ఫటికాక్షమాలికాచ్ఛాయల డాసి కేకేయనంగ
నవ్యశార్దూలచర్మాసనంబుమీఁద, యోగపట్టెబిగించి కూర్చున్నవాని
గాలవుని గాంచి చేమోడ్చి కస్త్రిమంత్రి, యందికొనఁ జేరి సాష్టాంగమాచరించి- 72

క. నిలిచినఁ గనుఁగొని నరవరు, కులపావన యిందువచ్చు కూర్చుండుమనా

నిలిపితివి తండ్రిపద్దులు, వెలసితి విటు లతనికన్న విక్రమ గరిమన్. 73

ఉ. అనుచు బహూకరించుసమయంబున నూరకయుండి యుండి యం
జనరుచి పుంజమంజిమకచగ్రహమైనతమంబు పర్వె తో
డన హరిచందనప్రతిభటం బగువెన్నెల దోఁచె వెంటనే
కనఁబడియె న్నిరస్తకనకస్తబకస్తుతు లైన యెండలున్. 74

క. అది చూచి మేదినీవర, భిదురీ మృదురీతిగా దభేద్యము గంటే
యిదియుష్మ దనుజశాంబరి, గదిసె న్బరిపూర్తి దీని ఖండింపు మిఁకన్. 75

గీ. విజయ మగు నీకుఁ గెలువు మోవీరవర్య
యనుచు గాలవుఁ డాడుచో నచటఁ గలుగు
హరిగాంతులు కటకటం బనుచు శిష్యు
లంటి చనుదేర నచ్చోటి కరుగుదెంచి. 76

క. మునిచంద్ర వచ్చి మావెం, టనెవచ్చె నటంటి వీతఁడా నృపుడేమ
య్యా నరేంద్ర కన్నులారం, గనుఁగొంటివె వీని యవపగాకి తనంబుల్. 77

ఉ. అయ్యయొ మాకు పంపమిడినంతిఫలంబు నరేంద్రచంద్ర యీ
దయ్యము తోడి జాగరము దాఁటఁగఁ జేసి శుభమ్ము లిమ్ము తే
వయ్య కొమాళ్ళతండ్రి వయి యాశ్రితరక్షణ దుష్టశిక్షణా
క్షయ్యదయాపరాక్రమ విశాలుఁడవై మనుమయ్య యిమ్మహిన్. 78

సీ. చనవుకొన్నామంచు జట చెప్పుచుఁ బరీక్షఁగొని వరింపు మటంచుఁ బెనఁగువారు
ననుజూచె ననుజూచె ననుచు రిత్తకురిత్త జపలు వట్టుక పోరఁ బొడఁగువారు
బులకము ల్మైనిట్టపొడువంగ వడి నోరు దెఱచి మైమైఁ జూడఁ దిరుగువారు
జేసన్న నటజంబు చెంతకు రమ్మని మును దొంగమొక్కులు మొక్కువారు
నగుదు రీయయ్య లెల్ల వాఁ డపరుగడగ, గులుకుగుబ్బలు దళుకుఁ జెక్కులు మిటారి
మొలకనవ్వులు గలమోము ముద్దుగులుక, మాయపుం దెక్కులాడినై డాయునపుడు.

సీ. అటుమొన్న భార్గవజటికి శౌనకమౌని కొకవాదుమై నొంటుకుండఁ జేసె
మొన్నఁ బారాశర్యముని యోటరాఁ గూఁత లెగయించి వెరవేఁకి యెత్తఁ జేసె
నిన్న విశ్వామిత్రునికిఁ దంపరఘటించి యొడలెఱుంగక పడియుండఁ జేసె
నేఁడు మార్కండేయునికి సివం బెత్తించి తలవీడఁగ బయళ్ళ మెలఁగఁ జేసె
మానవాధీశ విను మింతమాత్రమైన బ్రతుకవచ్చును వీనిచేఁ బడినపాట్ల
కొల్లఁబాటయ్యె మాకునిందునికి యేమి, చెప్పెడిది మాతపంబు నీచేతి దింక. 80

చ. అన విని యంతయేమిటికి నానతి యిచ్చెద రిన్నినాళ్ళుఁ ద
ద్దనుజుని నొంచి మీపద ముదారముదాకృతి నొందఁ జేయఁ గ్రుం
డినయది నాకు నేర మవునేకద యాకొదవ ల్సహించిన
న్ననుఁడు వానిఁబట్టి నుఱుమాడెద నొద్దికఁ జెల్లఁజేసెదన్- 81

చ. అనిన రిపుక్షయోస్తు విజయోస్తు పతేభవతే యటంచు వా
రనుపదురాపకోప తరుణార్క విభాదళితారుణాంబుజా
ననఁగను మోము కెంపుగఁ దపర్థరణోన్ముఖభృంగయుగ్మప
జ్క్తినటనభ్రూకుటిక్రమము దెల్పఁగ నచ్చోటుఁ దర్లి నిల్చినన్- 82

సీ. అధిపభృత్య పరస్పరాన్వేషణాకారణప్రతివక్తృతన్నామకార్య
మననుగతస్వామి హయవేగభూరుహచ్ఛాయాసమాశ్రితచ్ఛాత్రకంబు
ధావనాయాసాస్వజీవనవృత్తిధిగ్వాచకాందోళికావహజనంబు
సమ్మర్దబహుళాది సరణికోభయపార్శ్వచారితవారణా ధోరణంబు
సరయ సరదుష్టనిష్పతజ్జరఠధూర్త, గణ్యాగాణిక్యసంభవత్కమనహాస్య
వారణక్షమతత్సుతాక్రూరదృష్టి, సంవృతాశంబు సైన్య మచ్చటికి వచ్చె- 83

క. ఈరీతి సైన్యమంతయుఁ, జేరిన నొకబయట రాజసింహము భటులం
దేరిజ వేయంబనిచి గు, డారము లెత్తించి యంతట ప్రవిగుర్రింకఁ- 84

గీ. పటపుటంగడి వీథులేర్పఱచి కొంచె, పాటి నడగని నెక్కి యాపాలె మెల్ల
విడియ నియమించి తిరిగె వేవేలు దివ్వె, టీలవెలుఁగున సంగీతమేలమమర- 85

చ. తిరిగి యతండు వచ్చి వడఁదేర్చుచు ఘుమ్మను వట్టివేళ్ళచ
ప్పరము కురంగటం దగు తుపారము చేరువఁ జారువజ్రపాం
డరరుచిగ్రమ్మ గుమ్మతగుడారమునం గొలువుండి పట్టణాం
తరముననుండి వచ్చునరనాథులకమ్మలు వించు నున్నెడన్- 86

గీ. ఊడిగపుటత్తి కాఁ డొక్కఁ డొలుఁగుఁ జేరి
విభుని చెవిలోన నేమేమొ విన్నవింప
నతని కనుసన్న గనుఁగొని యయ్య మంచి
దతనిఁ బిలిపించెద నటంచు నఱిగివాఁడు. 87

సీ. నేసమై సగము దీసిన బూడెపండుతోఁ గూడినబంగారు లాడె సింగి
బారసీలిపిని జొప్పడ భగవద్గీత లెన్నికవ్రాసిన చిన్నిపలక
బుడుత పసిమిరుచి పులితోలు చుట్టుతో బననిక ల్పించిన పట్టుజోలె

యొకత్తి బరదేశుల కొసంగఁ గూర్చిన రసవాదపు మెఱుంగుఁ బసిఁడి బుడ్లు
కొంపవలె నెత్తిపైఁ జుట్టుకొన్న జడలు, వెండికట్టులబెత్తంబు విడెముమీఁద
వీడియముగల్గుదొర పాతలాఁడెజోగి, బిలికొని వచ్చి పొడఁగనిపించుటయును.

గీ. పతికరముఁజూప రత్నకంబళము మీఁదఁ, గడవసమునైచి కూర్చుండి బుడుతవీచు
సురటిగాడ్పుల నుదుటి కస్తూరి బొట్టు, రవలు రాలంగ నాతఁడా రాజుఁజూచి-

సీ. ఇది చేత నుండిన నిసుమంతవడిలోన నేదేశమునకైన నేగవచ్చు
నిది మోళి పైనున్న నెదుటి చేవెళ్ళిన వైరికైదువజాలి దారితప్పు
నిది దట్టిపొఱ నున్న నెటువంటిరూపైనఁ బ్రాపించి వేడుకఁ జూపవచ్చు

*          *          *          *          *

*          *          *          *          *

*          *          బపనికలొసఁగి యొకమాయ పన్నుటయును.

ఉ. కంటెఁ బసిల్చినట్టికొన గల్గిన చంపురుఁగావి జాళువా
జంట పయంటపై నిగుడి చక్కని జక్కవ నిక్కు చొక్కపుం
జంట చెలంగు బంగరువు చాయలు దూచియనంగఁ జాలు వా
ల్గంటి మెఱుంగుఁ జూపులు బళారనవచ్చె మహాద్భుతంబుగన్- 91

ఉ. చొక్కపుఁ బంజుకమ్మల రుచుల్మెఱుఁ గెక్కిన చెక్కుజాలువా
నక్కులచక్కుజక్కిణిగొనం బిగిగుబ్బలు పిక్కటిల్లఁగాఁ
జుక్కలరాచడాలు తెలిచూపులు త్రొక్కనిచోట్లు ద్రొక్కనా
చక్కెరబొమ్మయమ్మహిపచంద్రుని చక్కటికేగి గ్రక్కునన్- 92

ఉ. రంగు చెలంగ గుబ్బల ధరాస్థలివత్తుము మోపలేమిసా
ష్టాంగ మొనర్ప సిగ్గువడె నంచు నభంగురపాకభిన్మణీ
సంగతకంకణారవముచాటఁగఁ బైటచెఱంగు కేలితో
ముంగలఁ గొంకుచుం గొలువుమొక్కుఘటించి పిఱింది కేగినన్- 93

సీ. సయిదోడ చూడు నస్సాయ యిక్లేజ యిక్లేశవోజులపతి యింగిలయ్య
* జగ్గుమంటివి వచ్చిశాణ నిద్దాహుంత్తె కారి బుర్సాపుత్తె గాలిసుమ్మ
అక్టెచూస్తుంపది యదెనన్నెమోసిలి గలవాఁడ నని యదిగాక గడిని
చిక్కారిసాదన జేసెనదియింన్న దోభాజలల్ల మెలుద్రిబజారి

---

* యీపద్యమును బ్రత్యంతరము లేకపోవుటచే నిచ్చవచ్చినట్లు దిద్దినఁగవిహృదయము చెడునని భీతిచేనా భారముఁ జదువరులకే వదలినాము.

దీనిపైయేఁకుసై సేసి నానువాని, చిక్కటారికోలారికచిస్తిరోలి
రాజుపాలానవిను యిటురాయటంచు, రాచదేవళ్ళు కెరలి విరాళిగొనిరి. 94

గీ. అంత వారెల్లఁ బత్కారణాభినూత, నాతివాచాటతాజ్ఞ ప్రభూతరోష
వీతిహోత్రసముజ్జాతధూతికీలి, కాశ్రుతిస్ఫీతతామ్రమాత్రులగుచు లేచి- 95

సీ. ఒఱలతోడుత పట్టిపారల వంకులు దుస్సి తెలిచల్లడములతో నిలుచువారు
నింటి కిమ్మని పిల్లబంటుచేతికి సొమ్ము లొసఁగి వీరావేశమొందువారు
జౌనన్నఁ జేవెళ్ళు మనిహెచ్చరించుచుఁ జికటారి పొడలికి త్సేయువారు
దీని ముంపరనొంచి వానిపైఁ బడువారు * * *
వాలు గొని లేచివచ్చు భూపాలుఁ ద్రోచి
యవ్వలి గుడారమున కేగుఁడనుచుఁ జెనకి
యతనిగద్దింపులకు భయమందువారు
నగుచు నంపఱు దొమ్మిగా నరయుటయును. 96

గీ. అంత నాలాడజోగి మాయావిధిజ్ఞ, పంచమంతయు నుపసంహరించి నిలిచి
మునుపుఁ గొలువున్న వేళ నేయునికినుండి, రట్లయుండఁగఁ గైవార మాచరించి- 97

క. పాతాళకేతుఁ డంపిన, దూతన్నా సామి కెదిరి దురమున నిలువ
న్నీతరముగాదు వినుఁడీ, వేతెంచి బలంబుతోడ నిటు విడియుటయున్- 98

మ. తనచారుల్గని వచ్చి సైన్యమున నేతద్వార్త విన్పింపఁగా
విని మీసంబులుదిద్ది దైత్యుఁ డహహా వీరా వడిన్వచ్చి పో
రనునన్నుం గది యించువారు మఱివారా నన్ను మార్కొంచురం
చనుమానింపకవచ్చి నిల్వఁగల వీరాగ్రేసరు ల్వ్రాపురే! 99

క. పెంపు విచారింపక విని, పింపఁగరావనక వచ్చి ప్రేలెదు వీరిం
జెంపలు వేయరె యనుచు ని, లింపారి నిజాప్తులం బిలిచి యిట్లనియెన్- 100

ఉ. వింటిరె యొక్కవార్త మనవెఱ్ఱులు చెప్పిరి తామకన్నులం
గంటి మటంచు నీతబిసిగాండ్రుడు మదీయమహోగ్రమాయకై
యంటతనంబునంజని ఋతధ్వజు సైన్యసమేతుఁ జేర నా
బంటుఁ దనంబుఁ బాపుటకుఁ బన్నినవాఁ డఁట వాఁడు వాఁడిమిన్- 101

సీ. గరళకంఠద్వేషి కరకకాయలు గొన్ని తినియైన నాఁకలి దెచ్చుకొనుము
దేవేంద్రమదభేది తెలిచాయ గలకోర పంటిమొన ల్వానఁ బట్టుకొమ్ము

ధూమ్రముబర్బరకేశ తుప్పువట్టినఘోరజిహ్వ మిక్కిలివాఁడి చేసికొమ్మ
కుటిలాక్ష మాంసంబు గొంతునఁ బడినోరు దెఱచి విప్పుము సిగ్గు దెచ్చుకొమ్మ
తపవులకుఁ గర్తె మనుజయూథప్రచండ, పలలపారణ తప్రక్తపానకేళి
లాలసామోద మీసుమాళంబు మీఁద, నరుసరంవఱు గంతులువైవఁ డింక 102

క. అని నన్నుఁ బనుప వచ్చితి, మనుజేశ్వర బాఱువెట్టుమా రాజుల ని
వ్వని తూర్పుదెసకు మాదొర, చనుదెంచు న్మ్లేచ్ఛవహన సన్నాహనమునన్- 104

గీ. అనినఁ జెలువవ్వ నవ్వి యజ్జనవరాగ్ర, గణ్యుఁ డతనికిఁ గట్టునద్ధం బొసంగి
మంచిపటునలె సేనడిపించు కొంప, మంచు వీడ్కొల్ప నాతఁడత్యుఁడరుగుటయును-

గీ. అధిపతియుఁ జల్వలుధరించి యారగించి, హితజనులు గొల్వఁ బగువారి యింట్లకెల్ల
నేలిగలిసేగి యిది వేళ కీలిజామాట, వాసులకటంచు లాలించి వచ్చెనంత- 105

సీ. బొంగులు నిల్పియుబ్బగఁ బైఁడిబ్రాఁత బొమ్మలగుడారంబు లమర్చువారుఁ
గొయ్యలు నాఁటి యాకులతోడిరెమ్మలు వాటంపు గుడిసెలు నైచువారుఁ
బొక్కళ్ళవలెఁ గుంతములు చెర్చి యామీఁద గడితంపుఁ బచ్చడాల్గప్పువారుఁ
బచ్చికల్పెడ్డుపాఱలఁ జెక్కి పూబొదరింట్ల మున్నుగాఁ గదియువారు
నచ్చుయాగ నీటికంనువలరయువారుఁ, పురుఁగుఁబుట్రలు చెదర నుబ్బుచునుకొక్క
పరిగ నవ్వమఁ జప్పట్లు చఱచువారు, నైరి తద్వేళఁ బాళెంబువారలెల్ల- 107

సీ. రాతిరి పొక్కళ్ళ రాలుకొల్పిన వహ్ని గలిగినపొగలు చీఁకట్లు గప్పె
గాశ్వలచే నూఁదకయ బగ్గమను శిఖుల్నిగుడుచోటులు పట్టపగలు చేసెఁ
దగవార్చి మూకుళ్ళ దిగువాఱనుంచిన కూటిబల్తావు లాగుబ్బుకొనియెఁ
బొరలించి చంద్రె నిప్పులమీఁదఁ గాల్చిన కఱకుట్లవాసనల్గ్రమ్ముకొనియెఁ
ద్రోవఁ బోనీక బల్లెపుల్ ఉవ్విలెప్పి, కడిగి జింకలవ్రేలాడఁ గట్టి తిత్తు
లొలుచ భీభత్సరసము మహోగ్రమయ్యె, భుక్తిగొన్నట్టివారి తేన్పులుపొసంగ-

క. చాలఁ గురంగటిమదుగుల, గాలాపు స్వోఁటలాడఁగా దొరకినబ
ల్మీలు చవిఁ దేల్చె నపుడా, పాలెంబున డిగినబక్కబంట్రౌతులకున్- 108

సీ. వలసినరమెడకుఁ గమ్మలుబ్రాయుబ్రాయసంబులవారి గంటాల కిలకిలలును
దొరపలంనిన కార్యసరణులెంచు నమాత్యకుంజరంబు లొనర్చు గుసగుసలును
బొలదిండి రాయల యలవుల గనివచ్చి సిలుదు వేగులవారి కలకలములు
నరుస కంపఱటంచు నంతులేర్పడియున్న బలకరంబులవారి యుబ్బలములు
నెపుడు వెదలు నొకోయంచు నెంచి యాడఁ

జూచు సంగీతమేళంబు సొగసుకాండ్రు
ధిమ్మనెడి మద్దెలల మ్రోత గ్రమ్ముకొనియె
రాజు పవళించు తెలిగుడారంబు వోలె- 109

చ. నలుఁగడి చల్వదాల్చి పయనంపు టలంతల నిద్రఁ జెందురో
వెలఁదులలేపఁ గొంకి పతివింతగుడారపు పారివారిగం
టలరొప కుల్కి లేవఁ జిఱునవ్వులతోఁ దమవారిఁ గూడి యిం
పులతమి దీఱినన్ నిదురవోయిరి నన్బొజుంగు లత్తఱిన్- 110

చ. గుమిగొని తెచ్చికొలుకుసిగుంపులఁ జెట్టులనీడఁ బొట్టిమం
చములపయి న్శయించి పటసారకుటీరము లెత్తి మేలిజా
మమున రమించు పల్లవులనంటున నేరము లెన్నుచున్నృప
ప్రమదల మ్రోల నీటునెఱపం బనిపూనిరి గుత్తలంజియల్. 111

చ. కనుకని తెల్లవాఱుపనుక న్రతిగోరెడు పల్లవాళిమే
ల్గనుఁగొని వీడెముంగలుపులాహిరిమేపుల నిద్రఁబుచ్చి చెం
దిన చిఱునవ్వుతో నపుడె నిద్దురలాయని వింతపైఁడి ప
ట్టిన వెలముద్దుగుమ్మలు వడిన్శయనించిరి చప్పరంబులన్. 112

క. అల పాళెమునకు నిలుపని, బలకరమై పారివారిపరిమై తగును
క్కళమై నిదురించని సరి వలపుల వెలచెలుల విటుల వర్తిల్లు టమరెన్. 113

సీ. ఒక్కండు పట్టుగా నూఁకొనఁ దబ్బిబ్బుబాటు గొల్లసివాలు పాడుకొనుచుఁ
బాముసాడించునేర్పాటునఁ దలయూఁచికొంచును జెంగు విన్పించుకొనుచుఁ
దమవారి గుమిగూడి దమ్మరాజులకత లొన్నెటికష్టములేక నొడివికొనుచు
లయయొక్కత్రోవతాళంబొకత్రోవఁగా నేమేమొ ఢక్కవాయించుకొనుచుఁ
జిటుక్కుమన్నఁ బరామరిశించుకొనుచు, నంటుకత్తెలు తమపయనంబు సమ్మ
తించకాడిన దగఁ జెప్పుకొంచుమింది, దుక్కళపునల్లమందుల దొంటికాండ్రు. 114

సీ. వెఱవకుమని వెన్ను చఱచి వేలుపుతోడు తెలిపిననింద్రాణి తెలియ దయ్యెఁ
దనుతానె తెలిసి మూసినకంటితోవాణి వీనులపైఁ గేలు మానదయ్యె
నది పరామరిశింతునని యేగు పతినాఁగి జలధినందనకొంగు విడువదయ్యె
దడదడమన గుండె తాళిబొట్టుచర గుబ్బలిపట్టి పడుకయిల్వెవ్వెళలదయ్యె
బాళెమున నక్కడక్కడఁ బదిలమునకు, మ్రోయఁజేసినతమకుల మొదలిపోటు
దారుమ్రోతల పటహంపుధణధణలకు నొంతిగా సంజ్ఞనిటులున్న యంపలోన. 115

క. అలరాజు విజయ మెనయం, గలఁడని చంద్రుఁడును దారకావనితలతోఁ
గలహించి ముడియనైచిన, పొలుపలరన్ వేగుఁజుక్క పొడిచెం బెడఁగై 116

క. అంతట దనుజేంద్రుండొక, దంతపుఁజవికెన్ బ్రధానదైత్యులతోడ
న్మంతనమాడుచు నృపుబల, వంతపువైఖరులు వేగువారలు దెల్పన్ 117

క. పసవాళ్లఁ బిలిచి బలముల, వెసలింపుఁ డటన్న వారు వెసఁ జని నిద్రా
జడులను బలాళి వీరుల, వడిగా మేల్కొల్పి ప్రకృతవార్తలు దెల్పన్ 118

చ. అపరుచు వచ్చె నొక్కపలలాశి నిజాంగన సిగ్గుతోడి న
వ్వొపవెడు చూడ్కిచేతఁ దనయుల్లములోని పురాతక్రియా
భ్యుపయపు వాంఛదెల్పఁ గనుబొమ్మ నదల్చుచు మీఁదివేలుపు
న్ముదితల నంటు గానిపయి ముందుగఁ జొకఘటించెనోయనన్ 119

చ. ఒకదనుజాధినాథుఁడు మదోద్ధతి గంధమలందికొంచు గొం
చక చనుదెంచె నుగ్రరణసన్నహనంబున రాజమార్గణా
ళికి నిఁక మీఁద డెందము బలీ యిడవౌనని బొమ్మగోడపైఁ
జికిలియొసంగి వన్నియలఁ జెన్నగు సున్నము వ్రాయుకైనడిన్ 120

గీ. విరులు సిగఁ జుట్టికొని యొక్క వీరదైత్యుఁ, డరిగె నిఁకమీఁదఁ గల్గు కల్పావనీజ
పుష్పముల సారసౌరభంబునకు వాని, వలపునకుఁ బూని సరిచూడవలయుననఁగ. 121

క. ఈనేలచుట్టుం దిరిగినఁ, బోనీయఁడు రాజు పాఱిపోరాదనుతీ
రూనఁగ నొకనక్తంచర, సూనుఁడు చక్రంబు ద్రిప్పుచుం జనుదెంచెన్ 122

క. అనలోపమన్నృపశరముల, మొనలంబడి తరణిబింబముం జొచ్చుగతిం
దనుజుండొక్కఁడు గ్రక్కునఁ, గనకరథంబెక్కి యక్కు గ్రిక్కుచు వెడలెన్.

సీ. పసవాళ్లగమికిఁ జేపుడికి దబ్బజనొప్పి పైపైచుకొని పహాలఁబడినవారు
నిండ్లలోననయుండి యెటువోయిరోకాన మనిపించి కనిపించకడఁగువారు
నింటికావలికి నన్నిచట నిల్పిరు గదా యని వేల్పులకు మ్రొక్కఁ జనెడువారుఁ
దొలునాఁడె నృపుసవార్తలు విని యొక లేనిపనిఁ బూని యెందెందో చనెడువారు
గ్రాసములు చెల్లలేదని గాసిచేసి, కొలువుజీవితముల కొసపుకొననివారు,
నగుచుఁ గోఁచపిశాచము ల్దిగులుపడఁగఁ, బక్కురక్కసిదొరలు ముందటను నిల్వ

సీ. నిలుచుండి వీణ చేతులఁబూని తెఱగంటిబయకాఁడు మేల్కొల్పు బదముఁబాడ
నలుసతో నాల్గుమోములదేవుఁ డొకయోర దినశుద్ధి దెల్పి వేవెనుక కొదుఁగఁ
దనయూరినుండి తెచ్చినపూలమాల జేజేలరాయఁడు చేరి చేతికొసఁగఁ

జాగరవచేసికొని శంకరుఁ డిచ్చుకాలకు సఖుఁ డౌకుబేరుపైఁ జాడిచెప్ప
గడియయ్యెడుక మునుంగుటఁ గని గురుండు, తెల్లవాఱెడునని పఱతెంచి పలుకఁ
గటికవారెల్ల దొరలువచ్చుట వచింప, దనుజపతిలేచి యొకభద్రదంతినెక్కి 125
గీ. కోటకావలికై యాప్త కోటితోన, నీవు నీవని నియమించి నిలిపి తక్కు
రక్కసులు వారణంబుల రథములందుఁ, దురగములయందుఁ బొడసూపి తోడనడువ
సీ. చెకుముకి యగ్గిజానకిత్రాటిమిడుఁగురుల్గ్రాఱలెడునది యొలగోలుమూఁక
వెదురుమల త్రెళ్ళ విధమున నీటియగ్గాల్చిపాల్చియది దండిబారు
శిరుగోపులను దుమ్ము లెగయించునదిసిలేముస్త్రీబుగల కాలుమొకరిపౌజు
కొమ్ముకత్తుల మెఱుంగుల వెల్లపావడ గ్గొనునది మస్తేనుఁగులచయంబు
సురగికెంద్రంబుపిల్లలై చుట్టు నున్న, కనకరథముల నడుమ సింగాణి విల్లు
దొనలు మెఱయంగఁ దేజిపైఁ దోఁచువాఁడు, ధారుణీశ్వరుఁ డని వేగువారు దెలుప
చ. అరిగి మహాభయంకరతరాహవదోహలబాహవప్రతా
పరుచులు వోలు చెందిరపుఁ బావడచేఁ బుఱచేయి వీసు
స్థిరమతి నంపపెట్టుకొలఁదిం గజరాజము నిల్పి దానవే
శ్వరుఁ డెలగోలునర్వఁగ నిశాచరుల న్నియమించి సంతటన్. 128
చ. అలరు మొగంబుతోఁ గువలయాశ్వము నిల్పి నరేంద్రమూళి తూ
పులపొదిదోయి వీఁపుకడఁ బొందుపడం బిగియించి మించురా
చిలుకలవ్రాఁతగచ్చుపని సింగిణి సైకొని యెక్కువెట్టి సే
నలు తనసన్న గోరఁగ గుణధ్వనిచేయుచుఁ జేయి వీచుచున్. 129
క. పేరెములువాఱి యొక్కొక, చేరువ గుంపగుచుఁ దారసిలి యిరువాగుం
ఘోరపుబాణపుఁ జువ్వలు, బోరనఁ గొనవిఱిచి వైనఁ బొసఁగ న్మోపటన్. 130
క. కొనద్రుంచినైచు బాణపుఁ, బెనుజువ్వలు పాఱి నేలపెట్టుగఁ బడుజీ
బున సిగిడి కాలుసేతులు, దునియలుగాపించి ముందు దుముసున నడిచెన్. 131
క. ఉయ్యాలచేరులనఁగా, నయ్యిరువాగులును దఱిమి యటు దిరుగుచు బ
ల్కయ్యమొనరించి యించుక, డయ్యక యొడ్లె పయిఁ బెట్టుటయు నట్టియెడన్.
చ. ఒకపరియొడ్లలోని రిపులుగ్రతనైచు తుపాకిమందు గుం
డ్లకు వెనుదీయకాఁగి యచటంబడు సాఫులఁ గోలుగొట్టసా
య కనిఁ బెనంగి యంతఁ దరియం బడి యచ్చటివారలం గకా
వికలుగఁ దోలి యొడ్లు విడిపించిరి చేరువకాంద్రశూ మెచ్చఁగన్. 133

గీ. అలసినట్టి జనులు తేలి యవలికరుగ, వేణుతుటుములు పెనుబోటు భేరిమ్రోఁత
లమర నరుదెంచి దొడ్డకయ్యమున నవియుఁ, బవలనంతయుఁ గని చండిబారుగదిసె.

క. అంపఱునిట్టులు వచ్చిన, యంపము గనుపట్టెఁ దద్రణాంభోనిధి దాఁ
టం జెప్ప గట్టెఁ బూనిన, చందంబున నలుగు లరిదిచాయల నీనన్. 135

గీ. ఒకఁడు కుంతానఁ బగవాని యురము గ్రుమ్మ
వెంట నేయాతఁ డీటెచే వెళ్ళఁ బొడువ
వెలసె సద్దఱు నిల్చిన నిలువు కదన
కాళికై కానడించిన కానుకనఁగ. 136

క. పగవాని గ్రుచ్చి యీటెని, నెగనెత్తె నొకండు రణమహీంద్రుమాలమునం
గగనమున నుండి వ్రాలెడు, ఖగపాళుల కంది యిచ్చు కైవడి మెఱయన్. 137

క. జముదాడి నొక్కవీరుఁడు, విమతేంద్రుం బొడిచి వాఁడు వెస నిజభుజసా
రము మెచ్చి చల్లునవకుం, కుమబలెఁ దద్రక్తమున నిగుంభితుఁ డయ్యెన్. 138

క. అలుగునగ చూపువేశం, బలతలమను సంతసోఁకిన న్మగవానిం
గళదాఁకెఁ బెనఁగు నొకమె, క్కలపు దొరకరాని నీటుకత్తియ యగుటన్. 139

చ. నిగళము లూడ్వ నెత్తి కరిణీపతి చేరినఁ దేజిపావడన్
మొగమునఁ గప్పి నూకి యొక మొక్కలపు న్నెఱరౌతు కుంభము
ల్పగులఁగ నేసిన న్వెడలెఁ బట్టను వెంటనె మౌక్తికావళు
ల్మగఁటిమి మెచ్చి చేరి జయలక్ష్మి సుమాంజలి యిచ్చు కైవడిన్. 140

మ. బలియుం డొక్కపఠాని రౌతు తనబాబానూకుచు న్రెండువీ
థుల మాస్ట్రీలతలల్ క్రొరాసిలతికం దుండించుచుం జుట్టి రా
నల రెండత్తనువు ల్దరంబడుట భూతాజ్ఞప్తిచే వెట్టి మో
పులు నేలం బడవైచి కూలఁబడు కాపుల్పోలె నప్పట్టునన్. 141

క. నరపతి యంతట దనుజుల, యురువడిఁ గని చేయివీవ నుగ్రాకార
స్థిరతంగరులకుఁ గరులున్, హరులకు హరులరదములకు నరదము లెదురన్.

సీ. రాజ నా చెయిచూడు గ్రాసంబు ఋణముగాఁ జేయుదు నే యంచుఁ జేరువారు
లలితంపుఁ దులశిప్రోగులు త్రుంచి నోటిలో నైచికొంచుఁ దురీనవచ్చువారుఁ
గలనిలోఁ బొలియుటకంటె భాగ్యమ్ములున్నవె యంచుఁ జెగి యనికలుమువారు
నేలినవానికట్టెదుట నే పనికివచ్చుట గదా మేలని చొచ్చువారుఁ
బూర్వవైరంబు మాని సొంపులు జనింప

నొకని గొకఁ డెప్పరించుచుఁ జికిలియొఱలు
పొఱపైచుచు వడిఁజొరఁబాఱువారు
నగుచుఁ గైజీతములవార లనికి నిగిడి. 143

క, దనుజులఁ గదిసిన నత్తఱి, జనితంబగు ధూళిపాళి చదలఁ బొదలఁగా
ననిమిషకోటికిఁ గరములఁ, గనుదోయిం బులుముకొనుచుఁ గనుఁగొనవలసెన్.

సీ. అరదము ల్దరదుర నరుదార నరుదేఱ నరదము ల్దరదురనరిగె నెదురు
కరులు ఘీంకార బంధురములై నడతేఱఁ గరులు ఘీంకారబంధురత నెదురు
హరులు హేషాతిభీకరములై పఱతేఱ హరులు హేషాతిభీకరత నెదురు
భటకోటి చటులతోద్భటములై చనుదేఱ భటకోటిచటులతోద్భటతమీఱు
సారథులు వ్రాలఁగొమ్ములు చదిసికూలఁ, బక్కెఱలు వ్రీలఁ గరవాలపటలితూలఁ
కేడివారంగ నవి పోరు ఖేచరాళి, హర్షమునఁ జూడఁగా బొమ్మలాడినట్లు. 145

మ. చదిసెం దేరులు పాఱె వారణము లశ్వమ్ముల్లరం గూలెఁ గం
ఠపరెన్ సైన్యము వ్రాలె బాహువులు వ్రదెస్సెన్మాంసము వ్రాలెనం
గదము ల్ద్రీలెఁ గిరీటము ల్పఱచె రక్తశ్రేణి కయ్యంపుఁ జో
క్కుడనర్పన్ భుజదర్పమొప్ప నిరువాగుం జేరి పోరాడఁగన్. 146

సీ. ప్రేగులుమీఁదఁ గన్పించి నవ్వెడు తలల్దూఁడులుగల తమ్మితుటుముఁ దెగడెఁ
గెంపుటుంగరపుడా ల్గీల్కొన్న బాహువు ల్ఫణిమణు ల్గలయహిప్రభులఁ దెగడెఁ
బలు జముదాడి పోటులమించువక్షము ల్నెఱియ లానిన భూమినీటుఁ దెగడెఁ
వ్రేటులరక్తము ల్వెడలించుతొడలు కుంకుమనీటి చిమ్మనగ్రోవిఁ దెగడె
దనుజమనుజేంద్రసైన్యముల్ దైన్యమెదలి
కయ్యమొనరింప సంగరాంగణము చూచు
దివిజవర్యులు మొగములు ద్రిప్పికొనఁగ
నప్పు డమ్మక్కుడ యనిపించె నమృతముగను. 147

వ. వెండియు నుద్దండతరదండధరకోపాటోప విభ్రమభ్రమిత నయనభ్రమావహస్యంద
నసహస్రసంగతరథాంగనికరాపభ్రవిభ్రమణ విధూత ధూళీపాళికా ధరాధురాన
హ గిరిశవరిణకరీశ్వరంబును గరీశ్వరధారాధరక్షతజపూరపారావార దుర్వారత
రంగాయమాన కనకపరికరంబును బోరనెడఁదగాయంబులవారలం గుంతసంఘ
టితద్విషేటి కాడోలికలం గొనిపోవువారును మున్నఱకమై నెక్కినకత్తలాణంబు
లం బరులపాలు చేయ నోపక డిగ నుఱికి కటారుల డొక్కలు విదారించి

నచ్చి పడువారును క్షతంబులవెడలు ప్రేవుల నూడనీకయదిమి కదనోన్మాదం
బున దుష్పటులు బిగియించి యెదిరించువారును గెలుపుగాయంబులఁ బడియుం
డియు మండిగాలిదుకొని కైదువులు జడిపించుకొనుచు రౌద్రాకారంబున ను
న్నవారును గళదెలిసి నలుదిక్కులుం బులుకుపులుకునఁ జూచి మానధనంబునం
దొడిగినచల్లడంబు లక్కడక్కడఁ జించుకొనువారును బ్రాణనిర్యాణసమయంబు
నందును నిజస్వామివిజయంబె విచారించువారును నడుగకమున్న యభ్యర్ణంపునుఖుఁ
గుల జలంబుదెచ్చి దప్పినివారించు బంటుల ఋణంబులు దీర్చుకొని వారితోనా
త్మీయులకు వలయు బుద్ధులుపదేశించువారును దెట్టువలుగట్టియున్న క్రొన్నె
త్తురులు గనుంగొని నెత్తురుకళవట్టి తమకుఁదామ త్రావువారును దొలఁగక
క్కడక్కడభ్రపడఁజిన ముదురుమానిసులకతంబునఁ బోఁగూడక నమోనమో
యనుచున్నవారును గ్రించుఁదనంబునఁ గొంచెపాటిచెనకులఁ దెచ్చికోలువేదన
లంబడి తన్నుకొనువారును గలిగి సంగ్రామంబు గావున నధికధామంబును జన్యం
బు గావున భూతక్రియాసామాన్యంమును సమరతలంబు గావున ధర్మోజ్జ్వలంబు
ను నై యాసమీకంబు సమాకులితనాకలోకం బయ్యె మఱియు. 148

గీ. పోరఁ బెనువానగా రక్తపూరమొలుకు, కాయములు పూను భూతనికాయమలరెఁ
నేళిగతి నిల్చి రణభద్రకాళిమ్రోల, వరలు పన్నీరుతిత్తులవా రనంగ. 149

సీ. గ్రుడ్డులు మిడికించుకొని దప్పికిమ్మను దమవారినొక్క బేతాళవాలి
గ్రొంతుమ్రోచిన దిగులొక్కని నోర ద్రేలిడి క్రక్కునొక్కపిశాచికావిభుండు
అన్నువట్టినను మ్రాగన్నుతోఁ బొర్లాడు నేలపైనొక డాకినీవరుండు
కక్కుర్తిమెక్కి యగస్త్యమంత్రమువల్కి బొడ్డు నంటుచు నొక్కభూతనేత
తనివితీఱినఁద్రేఁపు విన్నునకునిక్క, శతపదాల్ద్రొక్కు నొక్కనిశాచరుండు
పలలరాసుల బువ్వంపుబంతివిందు, మించుబోఁడులతో నారగించువేళ. 150

గీ. ఒక్కనికళేబరమరసియుఁ దగఁదినక, వీనిఁబడవైచె నాతఁ డాపీరుఁ డనుచు
గావనుచుఁ గుమ్ములాడునక్తంచరాళి, యెంతకార్యంబు దమకేమియెవ్వఁడైన. 151

క. ఒకవీరవరుకబంధము, నకుమూఁగి పిశాచికాగణము భూతావే
శకమున నది యెగిరినచోఁ, బకపకనవ్వించె నులికిపడి డాకినులన్. 152

* సీ. శౌనకమౌని విశ్వామిత్రుతోఁ దెమ్మె పన్నిదం బనుచుఁ జేపట్టి తిగుప
శుకుఁడు * * * *

---

* ఇక్కడఁగొంతగ్రంథభాగము మాతృకలోలేదు.

మాలిని. ధరణిభరణశేషా దర్పకద్వేషవేషా, శరనిధిసితకీర్తి సౌధయూథాగ్రవర్తీ
వరగుణమణిజాలా వర్ణితోద్దిష్టలీలా। నరపతికులహేళీనారనఘాత్మసమాళీ




ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ సవరమ న్వయాభరణ నారాయణభూపాలతనూభవ శఠగోపతాపసేంద్రచరణారవింద సంచలన్మానసమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణానంద కామినీమనోహర రూపరేఖావిజితచైత్రి కాశ్యపగోత్రపవిత్రి జాతివార్తాకవిజనామోదసంధాయక చిననారాయణనాయకప్రణీతంబైన కువలయాశ్వచరిత్రం బనుమహాప్రబంధంబునం బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# కువలయాశ్వచరిత్రము.

## తృతీయాశ్వాసము.

---

క. శ్రీరమణీమృదుపదలా, క్షారసకోపారుణప్రసారితవీక్షా
దూరితవైరికలాపా, నారీనవకుసుమచాపనారసభూపా! 1

గీ. అవధరింపుము జైమిని కలశతంగ, కులపతంగంబు లిట్లని తెలుపఁ దొడంగె
నట్లు పాతాళకేతుఁ డయ్యాతుధాన, పటలికన్నను మున్నుగాఁ బాఱు డెంచి. 2

క. దళవాయితోడఁ గోటకు, వెలుపటియిల్లిల్లుఁ గొట్టివేయించి పిదం
గులు లగ్గంబులమీఁద, న్నిలిపించఁగఁ బనిచి నిగుడు నెవ్వగతోడన్. 3

చ. అరిగిపురంబు సొచ్చి పలలాశనమౌళి కుమారుతోడ మే
ల్సరియగు దైత్యులం గసనుల న్నిలువ న్నియమించి యాయస
స్ఫురణఁ దనర్చు కోటతలుపు ల్బిగియించఁగఁ బంచి ధీరతా
స్థిరమతిఁ జేరఁగా నగరుఁ జేరి హజారము నందు నిల్చుచున్. 4

క. మించు తమిఁ గణజము ల్దిఱ, పించుచుఁ గైజీతములకు వేర్వేఱ వ్రా
యించుచు నెలకొలువునకుం, బంచియిడుచు నుండు గుండుబాణము లెల్లన్. 5

క. ఇటు లుండ నచట నృపుఁడు, ద్భటగతి దానవుని కూటిపాలెం బెల్లం
దటుకునఁ జూఱ లొసంగుచు, నటు నిలువక సేనతోడ నప్పురిఁ జుట్టెన్. 6

చ. అచలితవృత్తి నిట్లు విడియం దళవాయి పలాశి వీడు మె
చ్చుచు నలకోటకేగు జలసూత్రపుఁ జోటు లెఱింగి యడ్డక
ట్టుచు రసవర్గ మచ్చట కడున్వడిఁ జేరఁగ నీక శూరతా
రచనలఁ జిల్లరల్చులుపు రక్కసిపాలియగాండ్రఁ గొట్టుచున్. 7

క. ముత్తికె వేయించిన దిశి, జొత్తముఁ డించుకయు బెదర కుద్భటధీరో
దాత్తమతి నగరు సొరక వి, యత్తటి నటునూకు గనని యందె వసించెన్. 8

సీ. తెలుగంటిదొర నరాధిపు మెచ్చఁ జనుటకై నలువతో నాలోచనంబు సేయ
నిలనుండి వచ్చు వేగులవారి వెంటనే సురహాని గొణుగుచు సుద్దులడుగ
గిరిభేది నగరివాకిటివార్త లడుగంగ దిగధీశులు నియోగి తెగల నంప
అడ్డెలు విడి వేల్పు లమరగాండ్రసురేంద్రు కార్యకర్తలబందుగట్టికొనఁగ
భూరిభుజశక్తి ప్రముచ్చిమి పోటుగాఁగ, మేదినీభర్త పాలెంబు మీఁదఁబడిన
దానవులమూఁక తన్మహోత్కటభటోగ్ర, ఘాటఁ గ్రోడించి కన్నుఁ గోటఁ జేరె.

సీ. ఆచ్ఛాద వెలువ లుయ్యాలచేరులు సేలవైచిరి రని తోడి వారిఁ బవరఁ
జోటించుకయు లేక కోటరంబులలోని యురవుపాములు పెఱ బొఱియఁజొరఁగ
నఖిలపక్షులకులాయములుఁ బోఁ బిల్లల గఱచి యవ్వలి కోనకడకుఁ బఱవ
ముంచి చీఁకటులుకల్పించు నీడలు పోవఁ బద్మాకరంబుల పాఁచి విఱుగఁ
జెట్టుగులులేని పెనుగారుచిచ్చు వచ్చె, ననుచుఁ జెంచెత లెంపకై యలమటింపఁ
బార్థివేంద్రుని భటులు డాబాలు నడుప, నఱికి రయ్యద్రిపై విపినంబు నెల్ల. 10
క. దనుజుల తుపాకిగుండు, ల్గనఁబడు డాబాలు పలకలందాఁకి బిరీ
లునఁ దిరుగుఁ దమనియోగిం, చినవారల నొంచ మగుడు చెలువం బమరన్. 11
క. మనుజేంద్రుఁ డంత సేనలఁ, బనుపుచు సురతాణి లగ్గఁబట్టించిన న
ద్దనుజపతి వీరధర్మం, బునఁ జెగువకుఁ జొచ్చి యెదుర ముదిరిన కినుకన్ 12
మ. అరరే వేఁడి మెఱుంగు తూపుఁ గొనియయ్యా యెంతయోవింత యా
నరనాథాగ్రణి యేయఁగా నది దిశాంతభ్రాంతరోచిర్భరం
తరమై వాని శిరంబు నైకొని యనంతాకాంతపైఁ దాల్చెపం
తురసంతోషహృదంతులై ధిగధికాంతుల్పొంత చింత ల్విడన్. 13
ఉ. అంతటఁ జేరవచ్చిన వియచ్చరనాథుల దీవనల్మహీ
కాంతుఁడు గాంచి వారి మృదుగౌరవసారవచోవిభూతి న
త్యంతము సంతసం బొదవ నవ్వు నిజాంచితసైన్యము న్మహీ
ప్రాంతమునందు నుంచి పరహాసవిలాసవిభాసమానుఁడై. 14
క. నగరిపురిపునగరుండ, న్నగరీరథయూథసౌధనానావిధరు
గ్గగధగలు చూచువేడుక, చిగిరింపఁగురింపరాని చిడిముడి వొడమన్. 15
క. ఒక్కఁడె పవనోద్భవజవ, ధిక్కరణధురీణ మైన తేజిన్వడిగా
నెక్కి ప్రకాశాత్మవశప, దిక్కంబగు పురముసొచ్చి ధృతి నచ్చోటన్. 16
ఉ, గోడలుగోష్ఠముల్గరిడి గుళ్లు గృహాంగణము ల్గజస్థలు
ల్మేడలు మేలుకట్టులును మిద్దెలు ప్రాకలు మేలుమచ్చులున్
వాడలు వేదులు న్విపణివర్గములు న్వనజాకరంబులుం
జూడఁ బదాఱువన్నె గల శుద్ధసువర్ణము లౌట మెచ్చుచున్. 17
సీ. పరఁగఁ బిరంగిల బలుగుండ్లకై డాఁగఁ బఱుక లమర్చిన పాఁతరల్లును
వెలుపటి మందుతిత్తులు నూలిన యరాబు కొఱకమర్చిన పచ్చిగోడగుంపు
లెనసి మాస్తరు లగ్గకెక్క కుందెంగఁ దార్చిన కాంచనంపు పందనపుఁ జేతు

లెవటి సురంగంబు లెటింగి యా చాయఁగాఁ గల్పించుప్రతి సురంగముల గములు
ప్రతిబలముప్రేయు తిరుగుడు టాళ్లకతనఁ, గుమ్మ లానిన బంగారు గోవలురలి
పడిన మగరాలు చూర్ణమై పుడమిరాలు, నీలములచాలుఁ జూచి వర్ణించుకొనుచు. 18

క. ఘోరపశాఘార నిశా, చారికృశాంగులను జూచి జడియకుఁ డనుచున్
సారతరదాత్మమహిమం, బూర ధరాజాని యభయ మొసఁగుచునంతన్ 19

సీ. కోటవెట్టికి ముద్దుసమ్మలలో మట్టి తట్ట లందిచ్చు గంధర్వచయముఁ
గనుసీళ్ల పులిమికొంచును బానశాలలో మంచు గట్టించు నమర్త్య కులము
మలఁగికొంచును ఫిరంగుల లగ్గములమీఁది కురువడితోఁ జేర్చు నురగగణము
బలిమికాండ్రగు రక్కసులకు సంకెళ్లతో జలకుంభములు మోచుసాధ్యపటలి
విబుధరిపు పాటుఁ జెప్పుకో వెఱచిముత్తె, యపుహజారాన గుసగుసలాడుచున్న
కిన్నరశతంబుఁ గని బుజ్జగించి పనిచి, ననుచు వేడుక తోడుగా నగరు జరిసి. 20

సీ. నలఁగిన మైలచీరలను మైఁ బొంగారు సిగ్గులు బంగారు నీరుగాఁగ
ముడివీడు నిడుదక్రొమ్ముడుల డాలు శరీర మునకు నల్లని మేలి ముసుఁగుగాఁగఁ
బదలించు కఠినభూభాగమ్ముమీఁద నిబ్బరపుఁ జూపులు కల్పపాన్పుగాఁగ
నాఁకటి కన్యోన్య మలసతమై నాడు మాటలె యప్పుతెంపు తేటగాఁగ
దనుజు చెఱసాల నున్న గంధర్వకాంత, లపరిపాటునఁ దనుఁజూచి బెదరిలేచి
కొంకుసిగ్గులతో మఱుంగులకుఁ బోవ, నిలచి వారలఁ జేర్చి మన్నించిపనిచి 21

క. తోవరాచరాతినిద్దపుఁ, జవికెల తెగల న్నగళ్లచా వళ్లను నుం
బవడంపుఁ గొణిగెల లోగిలి, నవరనికేరులనుదాఁటి చనఁ జన నెదుటన్. 22

గీ. పచ్చిదేరఁగఁజిలుక బాబా వజీరు, జగడమునఁ గుమ్ములాడు నచ్చరమిటారి
కత్తెయల వేల్పు నెఱనీటు కాంస్ర్ర రూప, ముందు బొమ్మలుగల మేడయొకటిగాంచి.

క. తగురా మగరాసిగనిగ, లగురా తొగరాచసాలల స్వప్ననువుం
బిగడాలడా లిడెంతటి, సొగసని తేజీని డిగ్గి చోద్యంబలరన్. 24

మ. చనుచో నాతని కందుఁ గర్ణపవ విశ్రాంతంబు లయ్యొంగడున్
వఁతా యెంతటి వేల వే నెలఁత యైనం జింతనే చింత గుం
దుచటే యంపని భ్రాని పండులకుఁ జేతుల్ చాతురే యైన న
ద్దను జోవంత మెఱుంగు నంతకును గాంతా తాళుము న్వాక్యముల్. 25

క. అది విని మఱియున్ విని విని, యిదియేమో కాని చూతమిపుడనియవనీ
ధవనేత బూరికోరిక, నవలికి జని జనిత విస్మయ నిమగ్నుండై. 26

సీ. పలచనిపావడపై నొంటి కట్టుగాఁ గట్టిన వలిపె చెంగావికడమ
పాన్పుపైఁ బొరల నిబ్బరపు గుబ్బల పోరపటలి పెటిల్లునఁ జిటిలిరాల
కెరలు నిట్టూర్పులఁ గెమ్మోవి, బగులంగ గోరునఁ జిమ్ము కన్నీరువడిన
బంగారు గోడకరంగిపోవఁ పలాట బటువుల్లంతటఁ బడఁగ నేమొ
పనికిదిగ్గునలేచి పూపాన్పుమీఁవ వ్రాలి కూర్చుండి ముక్కుపై వ్రేల నిలపి
యొక్క చెలికత్తెయూరార్పఁ బెక్కుతలఁపు లన్ను కొనసున్న యొకవన్నెలాడిఁ గాంచి.

మ. భళిరా కన్నులు మీలఁ కీసొగసు రూపా చాల నేబాసురా
కళలందించ్చు మెఱుంగు ముద్దుమొగ మింకం జంద్రుఁడాదీనిముం
గళ నౌరా బలితంపు గుబ్బలివియే కాబోలుఁబూచెండ్ల మిం
డలు మేలే కురు లింద్రనీలముల కన్నన్ మిన్నలా నేకదా. 28

క. నెమ్మిగదానడతుమ్మెద, దొమ్మిగదా బెడఁగుగురులు తోలుకరిమించుం
గమ్మిగదా మెయి మరు దో, దుమ్మిగదా తగిన చూపు తొయ్యలికిభళీ. 26

ఉ. పబ్బర కాను మాట వనితామణి కొను మెఱుంగు జాళువా
గుబ్బలి జేని కోటవలి గుబ్బెత చన్గవ వేల్పుచావరా
ద్రబ్బల మేలితేట యలరాజముఖీమణి వేణికారుచుల్
లిబ్బిపడంతి పట్టి కవలీల జయంబగు దీనిప్రాపునన్. 31

చ. కలకల నవ్వువట్టున మొగంబు వరాలను చారెడేసి క
న్నులు పిడికింటిలో మిను మినుక్కను కౌనును ముద్దుగారు ప
లుక్కులుఁ జెవికమ్మచేఁ పసితళుక్కను చెక్కులుఁ పట్టెడేసి గు
బ్బలుఁ గను చూపు మేరకు గుభాలను తావులు దీంకే తగున్. 32

ఉ. జక్కవపిట్టకున్ గలికి చన్నులమిట్టకు నేమిపుట్టువో
చక్కరదీవికిన్ వనిత సన్నపుమోవికి నేమి వావియో
నిక్కపదానికిం జెలువ నిద్దఁపుమేనికి నేమినేస్తమో
చుక్కలకోటికి న్మగువసొంపుల గోటికి నేమి కూర్మియో. 33

క. అనియెంచి యంచువిలుపో, రుని యలుఁగులగుంపుమది చురుక్కన నాటన్.
జనియించిన తమకమురఁ, గ్కొనిముంచినఁ గఱఁగి తెచ్చికొల్ ధృతిమించన్. 34

క. ఎంత కడంగి నుతించిన, నంతకుఁ దగునేకదా మదాళినవాళీ
కుంతల కాంతనసుమనః, కుంతలసపాంగకంది కుండడిదేమో. 35

చ. కనుగవకెంపు కొప్పువిడఁగా ముడిగొల్పెడు బొందిమీఁది జం

కెనసెజ్జచూపు నెవ్వరు నగించని నవ్వు బయల్గుఱించి ప
ల్కును గళదేరు మేనుఁ గనుఁగొన్నను జక్కెరబొమ్మయొక్క చ
క్కని మొగవానికి న్వలచెఁ గావలయుం గలయం బలంపఁగన్. 36.

క. బలవంతపు వలవంతలఁ, జెలువంతయు నేరి సొమ్ముఁ జేసెనొకో యీ
వలపునఁ బగిలినవానికి, దలపున లవలేశమైన దయ లేదే మో 37.

ఉ. వానిదిగాక జన్మమును వారము నీరమణీలలాల య
య్యో నగు బాటుగా నతని యొద్దకు నెచ్చెలిఁ బంచి పంచినం
దాని టురాక వేఱిమియొనర్చునొ నావలపంచు నించు వి
ల్కానికిలొంగి నెమ్మదిఁదలంచుకొనన్ వలపించె నెవ్వఁడో. 38

క. అవ్వల నొకనికి మీఁదుగ, జవ్వనమిటుగట్టియున్న జలజేక్షణతో
నెవ్వగఁ బలుకులు పలికిన, నెవ్వగ యేకాని చేర నేరవు కోర్కుల్. 39

గీ. ఐన నేమగు దీనివృత్తాంత మెల్ల, దెలియవచ్చుగదా యంచుఁ దొలఁగియొక్క
లోవమఱుఁగున నిలువ నాలోలనయన, జేరి నెచ్చెలిహారాళిఁ జిక్కుదీర్చి. 40

మ. తలిదండ్రుల్ మన మీనిశాచరునిచేతం జిక్కిదిక్కేది యీ
యిలఁ గాసిల్లుట గానకేమయిరొ వారేమైనఁ గానిమ్ము నీ
యెల ప్రాయంబు నిరూఢి కాసపడి వీఁడేమేమి గావింప వ
త్తఱలుచున్నాడొ యెఱుంగ మిందులకె యింతీ వంత లేదాయె నే. 41

క. అక్కట బుధధ్వజభూవరుఁ, డెక్కడ నీ వెక్కడే యిదేమిటికే నీ
చొక్కపుఁ జక్కని నెమ్మే, నిక్కాఱియ కోర్వనేరవే వగ యేలే. 42

చ. తలఁపున నెంత మోహ పరితాపము గల్గిన దాచుకొందురో
యలయక లేక యీకరణి నంగడి వెట్టిదురో వధూటులా
పలుకవు నిన్నువంటి కులభామలఁ గానవొ వారికాత్మ నా
ఘులపయి బాలిలెదొ తమిబుట్టిన పట్టున మట్టుపెట్టరో. 43

క. తగులెఱుఁగఁ జేసి కూడఁగ, మగవానికిఁ జెల్లుఁగాని మఱియెంతైనన్
మగువకుఁ జెల్లదు మీఁదట, నగుబాటగుఁ బిన్నపనులనన్ రాదు చెలీ. 44

ఉ. నీమది నింతకోరిక జనించినయప్పుడు యెట్లు కూర్చునో
యోమరుఁ డింక నిన్ను వసుధాధిపమౌళికిఁ గూర్చకుండ నే
మీమనమంతగా రిపులమే మఱివానికిఁ గానఁగీఱిఁగా
దేమరియాప తప్పినసతీవిను మొక్కటి సావధానవై. 45

క. మనలంజెచ్చిన యూర్తై, త్యనిబాధలఁగలఁగి మునులుతో తెరఁగన
జనపతి యాతనితో నిడె, యనిసేయుచు నున్న వాఁడటంచును వింటిన్. 46

క. పురదనుజ కామినులు కా, తరలై తరళైకహృదయతం గుందుచు నా
తురలై గరళైధిత వా, క్పరతంత్రత మాని యునికి గనుఁగొనుమబలా. 47

క. గావున నృపతిజయించెం, గావలయుంజూడు మెదమ కన్నద రు ననం
గావిని పలికిన దానవు, నీవాయని చూచి కామినీ మణి కలఁకన్. 48

గీ. యేటి పలుకమ్మ యతడు నన్నేల యేలు, తిరిగి సంధించి నన్ను బోధించరాదు
మింత యేమిటికింక నాయించు వింటి, వానికెక్కిన ప్రాణమే వామనయన. 49

చ. అనిపలుకం ధరాధిప సురాధిపుఁడీసతి నెమ్మనమ్మునన్
ననునెనయం దలంచుట కనంబడె బోటి ఋతధ్వజేశ్వరుం
డని కొనియాడె గాన నటులైనది నిక్కమయ్యెనేని నే
డనువిపుడీ వధూమణి పదంబుల వైవఁగఁ దామసింతునే. 50

శా. నాభాగ్యంబదిరయ్యె యీయతివ యంపంబిందు భావించినా
కేభంగింగవయంగఁ గల్గునని యూహింపన్ మనస్థంబుగా
నాభీలాభవ భూరి ఫాలపహనాభానంగ కౌక్షుయ క
క్షోభక్షయ్యతఁ జెంది యున్నయది యిచ్చో మెచ్చ వచ్చుంగదా. 51

చ. ననుఁగొని తెచ్చినట్టి మునినాయక నిన్ను నుతింతు నోబలా
మునిఁ గొని యాడనేల పెను మొక్కలిరక్కసి జూనికై కదా
యనుకల భావనాపరహయంబుగ వచ్చితి గాన నింక నా
తని యవదానమెంచవలదా జలజాలక నిందుఁ గాంచుటల్. 52

చ. ఇపుడిటు కానుపించుకొని యేను ఋతధ్వజరాజనంచు
దట్టపు దమిఁ దెల్పి జాణయగుటన్ జెలి యెవ్వలికేఁగ సిగ్గు దో.
రపువగకొంత జారఁగ బరాబరి సేయుచునిందు మారుక
య్యపురుచిఁ జూపి డీనివిరహాంబుధికింగడఁ జేరనిత్తునో. 53

సీ. యీగుబ్బలిఁకమీఁద నాగోటికొనభాటి గదిసిన గజిబిజి గాకయున్నె
యీమోవియిఁకమీఁద నామోము మునిపంటి ఘాతచే నలిబిలి గాకయున్నె
యీదేహమిఁకమీఁద నాదు కౌగిలింత వగచేత వసివాళ్లువాడకున్నె
యీమరు లిఁకమీఁద నాకూర్మి పెనఁకువ, పాటుదేవడిఁ జిక్కువడకయున్నె
చిక్కువడుగాక యేమినా చింతదీర, ననుభవింపక పోనేర నకటయిట్టు

జేల తలచితిఁ బువ్వుఁబోఁడి దీర్ఘలతాంగి, గానవొకయింతయోర్వవోకవ యిదేల 54

క. భళి యేటి కోర్కు లివితో, య్యలిచేఁ బేర్కొన్న యట్టి యాతని నసుఁగా
దఁలఁచితి వేఖోకఁడెమో, యిలలోన ఋతధ్వజేంద్రు లెంపఁ ఋగలరో 55

గీ. ఐన నొకసాధనం బున్నదా ఋతధ్వ, జేశ్వరుండీ పలాశిలో కేంద్రుతోఁడ
నని యొనర్చుము నున్న వాఁడని వయస్య, పలికెఁ గావున నతఁడె కావలయు నేను. 55

క. అన్నిటికిని మంచిదియే, సన్నలతాంగులను డాయఁ జని తద్వచనా
చ్ఛిన్న మకరంద ధారా, భ్యున్నతికిం గర్ణపుటము లొగ్గుటయనుచున్. 56

ఉ. లోవ మఱుంగువాసి జనలోకరసాకరబాకశాసి మై
త్తావులకంటె మున్నరుచి ధారలు బాయలు దీర్పఁగా రతి
స్త్రీవిభు రంభ చుట్టమును జెక్కులి గొట్టు నొయారమొల్కఁగా
నావనజాక్షు లున్నయెడ కద్దరిపాటున వచ్చి నిల్చినన్. 57

చ. కని హృదయంబు ఝల్లుమన ఘల్లుమనంగఁ బదాంగదంబు ది
గ్గన వెస లేచి లేనడ యొయారముతోఁ దెరచాటుఁ జేరెఁగా
మిని చెలికత్తె తత్తరము మెక్కొన గద్దియఁ దెచ్చియుంచ మిం
చిన తమినందు మీఁద నివసించె ధరావరుఁ డాదరాత్ముఁడై. 58

ఉ. అంతటలో ఋతధ్వజ నరేంద్రుని మోహనమూర్తి మున్న గ
న్నంతయుఁ గన్నులంబడిన నాతఁడు కాడ యతండె యాగదా
కంతుని దాడికిన్ వెరవగా యని డెంపమునందు నెంతయుం
జింతవహింపుచుండె సరసీరుహ లోచన బోటి యచ్చటన్. 59

చ. ప్రకట గుణాంక యోపురుష సింహమ నీమహనీయమూర్తి మా
మక హృదయాంబుజమునకు మక్కువ నెక్కొనఁ జేసె నింకఁ గొం
కక కనిపించుమంచు నడుగన్ బనిలేదయినన్ శుభాభిధా
యకమగు నీచరిత్ర ముదయంబులకుం దగు నందమొందఁగన్. 60

చ. బహుతరదేహధామ ఘనబాహు విహారముఁ జూచినన్ మహా
మహుఁడవు గాక యొక్క నరమాత్రుఁడ వేయనిదానె జెంగియున్
సహజపుముగ్ధతా గుణమునన్ వినఁగోరితి గాక నీశుభా
వహన ధురీణమైన గుణవారము నేవిను నంతదాననే. 61

గీ. ఓ మహాభాగ నీకథాభ్యుదయమెల్లఁ, దగినచందాన వినినయందాక లేదు
పారవిరహిత ఘోరార్తి వారిరాశి, మగ్నమామక చేతోర్తి మహిమ కతన 62

క. కతలయ్యె మావితమా, వెతలన్నియుఁ దెలుపఁదగున్న వీఁవు వినుమా
జతనమున గుణము లనియెడు, రతనంబుల గని యటంచు రమణివచించున్. 63

వ. అని చెప్పి మఱియు నెచ్చెలి యిట్లనియె. 64

సీ. అనఘ విశ్వావసుండనియెడు గంధర్వరాజు దుర్గాపురిత్రాత వెలయు
నతని పాణిగృహీతి హారిణియనుపేరుగోరి కాంచినముద్దుగుమ్మ మించు
నాయమ్మ సుతులెంపరైన గల్గియు కూతు, రొకతె లేమికిఁ జాల నున్మళించి
యాత్మజాత నొసంగుఁడనుచుఁ దేవుండనియే, కంటఁ బడురాతికెల్ల మ్రొక్కె
వట్టిదకదా వధూటుల కల్గుఁడనుచు, నగవు పగవులటంచు నెయ్యంబులంచు
సంపకములంచు మఱియెన్నియైనకలవు, కాంతులవియుండె మీఁదటి కతలువినుము

గీ. అంతనక్కాంత గర్భాలసాంగియగుచు, నాకుఁ దెలియదుగా యొకనాటిరేయి
నంపఱుసు మంచిశుభవేళ యనుచుఁ బలికి, రప్పుడీ యుద్భవించెదు నమ్మఁగనియె. 66

గీ పుట్టినప్పుడె జవ్వనంబును సమస్త భామినీకోటిఁ దలదన్ను పాటిచెలువు
గలిగె దీనికి నదియె దుఃఖములకెల్ల, మూలమైనది యంత నాలోలనయన. 67

క. అసమాన వయోమపమున, లసమాన కలాదులం జెలఁగఁ జూచిమదా
లసయనుపేరిడె విశ్వా, వసుఁడున్ హారిణియు గారవంబునఁ బెనుపన్.

ఉ. అయ్య పరాకు మాప్రియవయస్య యటంచు వచింపలేదు మా
తొయ్యలి వీథిలో నోఁబుతో నడయాడఁగఁ జూచెనేని యా
తియ్యని వింటిజోదు శరధిం గదియించిన పూవుఁదూపులే
యెయ్యెడ వైచికొంచుఁ దమిహెచ్చినఁ బోఁ బొరలాడకుండునే. 68

క. ఏటికి మాటలు నాఁటికి, నేఁటికి మగవాఁడు వలచునే కద వినుమా
బోఁటి తటాలునఁ జూచిన, నాఁటదివలచు న్మనోంబుజాగ్రమునందున్. 69

సీ. బలవైరి పనిచినఁ బిలువ వచ్చినవానిఁ, గనుసన్నచే నిల్పి కడకుఁ బనిచి
మూఁపుపైఁ గేలుంచి ముచ్చటాడుచు వచ్చు నలకూబరుని మన్ననలు వరించి
నెనరుతోఁ గడుసాచి కొనివచ్చు నును గచ్చుటరిగెలవారి నందంబునిల్పి
కడువేగ మడుపులు గైకొని యుడిగంపు రాజీవముఖిహోజారమున నిల్పి
కొలువునకు నేఁగు రంభ నిచ్చలముగాఁగ, నగరులోపలఁ జొచ్చి మానాతిఁ జక్క
దనము వీక్షించి యామెనిద్దంపుఁ జెక్కు, నొక్కముద్దిడుకొనిపోవునొక్కవేళ. 70

సీ, శచిచేత జంభశాసనున కొక్కొకవేళ స్వారిసరాగాలు జరుగఁ బొసె
రంభచే నల యక్షరాజపుత్రకునకు లలిహుసారుగ వెళ్లంగఁ బొసె

పార్వతిచే నర్థ పద్మారి వహాళికి నిట్టట్టుఁ బీరంబులెత్తఁ బాసె
కమలచే నీలమేఘశ్యామమూర్తికి గరుడు నెక్కి వయాళిగనఁగఁ బాసె
నెందుసర్వసుపర్వ సర్వేందు ముఖుల, చేత నిశ్శేష దేవతా శ్రేణికెల్ల
సవన కోటులలోఁగట్టుగఁ బలఁబాసె, ననఘ మానాతి జాతురో యనుభయమున. 71

ఉ. అవెతలెన్నియైనఁ గలవయ్య మహాత్మ వచింప భారతం
బీవనజాక్షి మెచ్చుఁ జనదెవ్వరి నెట్టి మహానుభావుతే
జోవిభవంబు జెల్వినను జుక్కను నెవ్వరి రూపమెంచినం
దావిననట్లు పోవునొక తప్పుపనుల్ గదియించి యవ్వలన్. 72

గీ. అంత నొకనాడు తలితండ్రు, లనుప భూమిఁ గలవిశేషంబు లీక్షింపఁ దలఁచియేను
లోనుగాఁగల నెచ్చెలుల్ వేనవేలు, గొలువ సిగ్గుజయాన యియ్యలకు డిగ్గి. 73

క. ఇందుఁగల పుణ్యభూముల, నందందుఁ జరించి కోకిలాళిమదాళీ
కందళిత కేళిపాళిన్, నందనముం గేరు నొక వనంబున విడిసెన్. 74

చ. విడిసినయంత నొక్కదొర వేఁటకు వచ్చెనో కాని కొంచెపు
న్నడగని నెక్కి చేతను గనంబడు నెట్టెము మీఁది డేగయున్
బడలిన మోము గువ్వగుమి పట్టుల బారెడు చూపు మించఁగా
దౌడిఁదౌడినాడిగంపుఁ జెగతోఁ జనియెన్ మముఁ జూడఁ దేమియున్. 35

గీ. అతనిఁ గనుగొన్న నేకన్నెయైన వలచు, నమ్మహారాజు దరగవే గాతిశయము
నంది చనలేక యంతంతనరుగువారి, నడుగవారు బుత్తెర్వ జుంపెనుచుఁ జనిరి. 76

గీ. అతనిఁ జూచినపట్టి యీసుభాంశువదన, యదియు నెపముగ రతిదేవి యాశ్రమమెచి
నోటికందియ్య వగకోటి నూటికోటి, యొసెనేర్చి మనోజాతుఁ డింతిమీఁద. 77

చ. అదిమొదలీవఘాటి విరులంటదు కస్తురి గీరుబొట్టు పె
ట్టదు పువుఁదోట రాయదు పటంబులు వ్రాయదు వీణచెంతఁ జే
రదు నెనరైన చిల్కనుకరంబున దాలిని ముద్దటంచుఁ దా
గదియదు కంజకాండ కరకార్ముక కర్మహతాహతాంగియై. 78

చ. చెలుల మొరంగినిల్చి తనసిబ్బెపు గుబ్బలు నారుతీరు ని
గ్గులుగల కేలుఁ దమ్మి కనుఁగొంచు నయోయిటువంటి మేనికిన్
వలదె తదీయచారుతర వక్షము దం బువుఁ బంపఁ బోలె నీ
యలసత దీప నిద్రఁ గననంచుఁ దలంచి వితాకురాలగున్. 79

చ. ఎలమినరేంద్ర వాళి తనయింటికి వచ్చిన యట్లుగా మదిం

దలఁపుచు నిస్గతో మరుగునన్ నిలువంబడి వచ్చినాతఁడా
చెలువుఁడు చూడరేయనిఁ జెల్వలిఁ డెవ్వరిఁగాన మేయనం
దలఁకుచుఁజూచి కల్లయె యనంగడు వెల్వలఁ బాయ దీనయై. 80

సీ. అధిపప్రతాపాగ్ని నరికట్టుకొన్నట్టి, సొంపునం గనుఁదోయి కెంపుదనరఁ
బతికీర్తిచంద్రికాపటలిఁ గౌగిటఁ జేర్చు మాట్కి మేనున బాండిమంబు వెలయ
విభుదానధారాంబువితతికిఁ జోటిచ్చు పోలుపున శ్రమజలంబులు చెలంగ
నాయకధైర్యంబు బాయకుండఁగబట్టు కైవడి నైశ్చల్యగరిమ మెఱయఁ
గడపట నిజేశు మదిలోనఁ గట్టివైచి, కొన్నగతి సంతతధ్యానగుణము దనర
నమరియునతండు గనిపించినట్టులైన, నదరిపడి లేచు రేలెల్ల నిదురలేక. 81

సీ. తలచూపవెఱచు నీయళివేణి సమరంపసుమబ్రాపనవకాంచనములు గన్న
పెదవెత్త వెఱచు నీబింబోష్ఠి తరువార సుకుమార తతధీర శుకము గన్న
బొడఁగట్ట వెఱచు నీపువుఁబోడి ఝుంకార భారాతిభయపట్పదము గన్న
నడుగిడ వెరచు నీయబ్జపాదసమీప వికటానుభావహంసికలఁ గన్న
వెడవిలుతుచేతనగు నలజడియుఁ దేనె, జడియుగమ్మని దెమ్మెరల్ తోడరుజడియు
నలయు నెమ్మనఁ జలువఁ దాకలపరించుఁ, గలవరించునొకానొక కలవరించు. 82

క. పొన్నలకుం దెలిజాబిలి, మిన్నలకుం దలఁకు చిలుక మేలిమిపలుకుల్
విన్ననగున్ విన్ననగున్, గ్రొన్ననగుంపులకు దిగులుకొని మదిఁ బొగులున్. 83

క. ఈరీతి నారికీరీ, శారీభారీకృతోక్తి చకితాత్మికయై
పారరహితవిరహదశా, పారావారమున మునుఁగఁబడియున్నయెడన్. 84

మ. తనరెన్ మన్మథజైత్రయాన సుముహూర్తప్రక్రమంబేను పే
యనిశృంగారము భూరుహాళికి రతివ్యాలోల బాలామనో
జ్జనవప్రేమలకుబ్బు మంపలి వధూజాలంబు పాలింటి పి
ల్వని పేరంటము వాసనాజనకమై వాసంతమాసంబిలన్. 85

క. బెడగడరెలతా వనితలు, నడతెంచు వసంతరాజునకు నడుగులకున్
మడుఁగులు వఱచినకైవడి, నడరెడు తెమ్మెరలఁ బండుటాకులు రాలన్. 86

చ. తనరస మెల్లఁ జూపవలదాయని వేళ యెఱింగి యత్తరిన్
గనఁబడు మన్మథాగ్ని మొలకల్ వలె పోసులుగా జనించి యా
మని పథికాంగనాపురుష మంపలి డెందములొందఁ బంచి వే
సిఁగతి కెందుగాఁగ విరిసెం పలిరాకు వనాంగణంబులన్. 87

ల్వడి సంచద్రసమొఱ్ఱు తేఁజెలుకుమేల్వి లెక్కు డించంగ న
వ్వైడవిల్కానికి దూరదేశగమిఖోవిశ్లిష్టమోహావల
జ్జడిమాకంపితస్థైర్యదంపతిహృచ్చిత్రాదియాత్రారతిన్. 97

క. ఆతఁడీఁ దమి వెగ్గలమై, శాతోదరి పొగుల మిగుల జడిసి శరీర
దోర్వ్యథకము లైన చిన్నెల, చేత న్వారహ మని తెలిసి చెలువలు తమలోన్. 98

సీ. ఆయొనమ్మ యిదేటి యాగడా లిదియేమి యెఱుఁగు నిన్నటి నేఁటి మెఱుఁగుఁబోఁడి
యెఱుఁగునా యనఁగూడదిప్పు డిప్పుడు కొంత గడిదే బెలే వలకారివగల
గడిదేఱ కింక నెన్నఁడు మంచిమగవానిఁ గోరించు జవ్వనం బూపఁజేయ
జవ్వనం బౌనెకా చదువుకొన్నది గాన మనసు నిల్పఁగలేక మరులుకొనియెఁ
జెలువ యీబాము లనుభవించినను గాని, తెలియదే ప్రేగులోపలి తీఁట వంటి
వలపుకసికోఁత లివి పగవారి కైన, వలదుగా దీని కిపుడేల వచ్చెనమ్మ. 99

చ. తడఁబడు మాట గద్గదిక వార్కొను నిల్చినచోట నిల్వరా
దడఁగులఁ దొట్రుపాటు గదియంబడుఁ గంపము చెందు నిద్ర రా
దెపని కోర్కె హెచ్చు మది సేమె వితావిత జాలిజాలి యా
నడిగినఁ జెప్పఁగూడ దకటా మరులెత్తిన యాఁటదానికిన్. 100

క. ఇవి యన్నియుఁ జెలులారా, చివురాకుం బోఁడియందేఁ జెలువొందెడు ని
క్కన మింతకు విరహమహో, దన మేకార్జనము మీఁదఁ దగ వెయ్యదియో! 101

మ. అతివా యింతపము న్నసిప్పిలిచె డాయంబోయితిం బోయివ
చ్చితివా యంచనె నేప కంటి నదెరాజీవాక్షి యే లెస్స వేఁ
డితిఁగా నిన్ననె నేటికే చెలువ యంటి న్నావెత లీనకు స
మ్మతమా యన్న వితాకురాలయితి నమ్మా కొమ్మ యమ్మాటకున్. 102

క. అని చెట్టుసేయుఁ బోఁటులఁ, గనుసన్నలఁ గడకుఁ బోవఁగాఁ బనిచి నసుం
జనవిచ్చి మనుపుఁ గావున్, నెనసినచెలిమి వనితఁ జేరి యో సెయ్యముననన్. 103.

గీ. వచ్చి తడవాయెఁ గద మహీపాలయమహిషిఁ
జూచిన ట్లాయెఁ గద యింక శోభనాంగి
పోసనలవదె మనపురంబునకు మగిడి
తల్లి సంద్రములు కడుఁ బల్లడిల్లుకుండ. 104

క. తెలిసె నిఁకఁ గొన్నినాళ్ళ, యిలఁగల చెలువములు చూడ నిచట నె నిలుతొ
పఁబినకైనఁ సున్నది, చెలువా మది లెస్స యట్లు చేయుడ మేమిఁక 105

క. అనవిన్నఁ జూచి తలవాం, చిన పద్మాక్షిఁ జేటి యేమొ చింతాసంతా
పనిరూఢిఁ జెందునందము, గనఁబడియెడు నిట్టు లౌనొ కాదో యెఱుంగన్. 106

ఉ. సరసిజగంధి నీమది విచారము దోఁపఁగ వేఱొకండు లే
దరయఁగఁ గారణంబు నవయౌవనరూపకళావిలాసభా
స్వరుఁడగునట్టి యొక్క మగవానిపయిం గనుసైచి తేమొ దు
ష్కరతరచింతచే నదియొ కావలయుం దలపోసి చూచినన్. 107

మ. బలభిన్నీలకచామణీ యిదియుఁ దప్పా కాంతులంగోరి కాం
తలు చింతింపరొ కంతుసంతముల సంతల్లింపరో లేక నీ
తలనే పుట్టెనె యైన నేరమొకొఁ జేతఃకార్య మాద్యంతముం
దెలియం బల్కకయుంట నీవలన నింతే యంత నే వింతజే. 108

క. నావంటి బోఁటి గలుగం, గాచఁగఁ నేల యెంతకార్యం బైన
న్నీవే కావలె నన్నుం, దైవకటాక్షమునఁ గరగతము సేయ వలె. 109

చ. అనవిని యాలతాంగి నగవామతిలన్నను జూచి భావజే
దినివి గదమ్మ నీకు నింకఁ దెల్పకయుండఁగ నేర్తునమ్మ నీ
యనువు మదీయఘోరవిపదబ్ధికి నోడ గదమ్మ వాఁడి మై
నొనరినకంతుతూపులకు నోడఁ గదమ్మ యికన్ వధూమణీ. 110

గీ. నాతి యెఱుఁగుదువా యల్లనాఁడు డేగఁ, జేత సహియించి చిన్న తేజీదువాలిఁ
గాఁగఁ దోలుచు నీత్రోవగానె చనియె, నామనసు వానివీఁపనె నాటెనమ్మ. 111

చ. కలకల నవ్వుమోము పురిగట్టిన నెమ్మియి నూగునూగు మీ
సలు నపరంజిడాలు తెగుబుజంబులు చక్కనిముక్కు తేటక
న్నులు నిడుసోగకన్బొమలు నిక్కిన గ్రక్కునఁ బాలుగారు చె
క్కులు నిసుమంతకౌను తళుకుందొడల లాస్యపమాళికే తగున్. 112

క. కనమో వినమో ఘనమో, ఘనమోహనమోదకారిక చ మగవానిం
దినముం భువనంబులనా, మనము స్మరియించువాని మఱిగంటి మఱే. 113

గీ. వనజలోచన నేనుగానలసినట్టి, దానసైతేని నెటులైన మానవేంద్రుఁ
గూర్చి నాప్రాణ మిపు డెత్తుకొమ్మ లేని, పక్షమైనను నామీఁదిబాళివిడుము 114

క. అని పలికి సొమ్మసిల్లినఁ, గని దీని మనంబు తెలిసెఁ గద యికవీఁపన్
మనసిజుఁ డపయుఁడు శరమే, సిన నేమగునో పరాకు సేయుదమనుచున్. 115

గీ. ఎంతలే దింతి యికఁ జెమ్మ వంతయేల, యిందులకు నమ్ల యొప్పఁగూర్చికొంద మబల

యెప్పుడు నీచిత్తమే వచ్చె నిపుడు వట్టి, మాటలాడినఁ గలవమ్మ మానుషమ్ము. 116

క. కొమ్మలకుం బురుషులకుం, గమ్మని విలుకాఁడె వేల్పు గావున నతని
న్నెమ్మదిరాఁ బూజింతము, రమ్మా యలకేలివనికి రాజీవముఖీ. 117

క. అని పలికి యేను నెచ్చెలు, లును మచ్చిక హెచ్చ నీవిలోలేక్షణఁ దో
డ్కొని వచ్చి కుసుమవిస్మయ, వనిఁ జొచ్చి రసార్ద్రవచనవైఖరి బెరయన్. 118

చ. అలనపుఁ జంచలాలియుతమై సుమనోహరచాపహార్యన
ర్గలగతిమించి పాదపవికస్వరవైభవహారియైన యీ
యలఘువనోల్లసద్ఘనమహత్త్వము నేమని చెప్పవచ్చునో
లలితలతాంగి కామితఫలంబు లొసంగుచుఁ బ్రోమనంపఁజేన్. 119

మ. పొలఁతీ యీపొన గున్నపొన్నవిరికిం బూఁదేనె బల్కాల్వగా
యలరన్ సారెకు నెక్కుచుం దిగుచు జాలై దుమ్మెద ల్మించె ని
చ్చలపుం జాయలతావిజాజివిరి సేజాజోడు సైకొన్న క్రొం
దలుకుం బచ్చలమేనఁ దాల్చు జలయంత్రంబో యనం గంటి వే. 120

మ. సరసాళుల్ జగంధమానుచుఁ జరించంగుం భినీజాతము
ల్వారసం జొట్టుఁ జెలంగుచుండఁగ మహోవాలంబుకుంజాత్రి చేఁ
గర మొప్పార సుధాప్రభావమఘువృంగాళి న్వివాహాతివి
స్ఫురితంబై విలసిల్లె నోయబల యీపున్నాగముం జూచితే. 121

చ. అరవిరివెండిచెంబుల నయంబునఁ దేనియపానకంబు లేఁ
బరువగు గుజ్జుమావి చలిపందిరుల న్లతకూన లియ్యఁగా
నరుసుగఁ గ్రోలియు న్సరసిజాస్త్రిగుణస్థితిఁ గండుదేఁటి ని
బ్బరముగు బాళినై నధరపల్లవమంటుటఁ గంటివే చెలీ. 122

చ. హితగతినిందు బింబరుచు లింపుఘటింప మనోజకాంతసం
గతిఁ దగు కైరవారముల గర్వము మించె వధూటి కంటివే
హితగతి నిందుబింబరుచు లింపుఘటింప మనోజకాంతసం
గతిఁ దగు కైరవారముల గర్వము మించుట చోద్యమే చెలీ. 123

చ. తనతను వెల్లఁ గాంచికొని దక్షిణమారుతచోరకుండు నే
ర్పునఁ జనుదెంచి తావిఁ గొనిపో వనదేవత హెచ్చరిల్లి క్రో
యని పెనుబోటుఁ గూఁత లిడుసట్టిగతి న్వినవయ్యె వింటివే
యనుపమగాత్రి కోకిలకులానులకేళి కుహూకుహూధ్వనుల్. 124

గీ. మేలితేనియనిండిన మెట్టతమ్మిఁ, జేరి కొలనాడి పుష్పాపచేరి రత్న
పొసఁగ నవ్వలిక్రొవ్విరిపురుటియిల్లు, వింతగాఁ జెందెఁ దేఁటి బాలెంత కంటె. 125

క. అనియాలివితతకేళీ, వనపాళిఁగరిమ మోలి నర్తించుచుఁ గ్రొ
న్ననఁగుంపుఁ జిమ్ము వేడుక, జనియింపఁ గడంగి సరససల్లాపములన్. 126


రగడ.

ఆళివరో చూచితె యలరెడి మావులు—జతగూడిన వివె చల్లనితావులు
వలపిపాపలివె యిటురారాదటె—యేలపోయె దన నింతనె వాదటె
చాలుచాలు నీసంపెగ మొల్లను—బాలకంటివే పాదిరిమొల్లను
నేలఁత రాఁగదే నిమ్మల నీడకు—నలుక నేలనే యంతటిప్రోడకు
ఎగిరి పడఁబలే యీకంకేళికిఁ—జిగురుచాలదే చెలి నీకేళికి
నాసలేటికే యంపని పొగడకు—వేసటలే కీవిరులనె పొగడకు
పడఁతి రాకు నాపాలిటి పొన్నకు—ముడివిడెరోసము మొన్నటిచిన్నకు
వాసంతికకై వచ్చెదు చిన్నవు—రోసమెఱుంగని తొయ్యలి నవ్వకు.
యీవిరవాదుల కేటికి ముచ్చట—తావులవిరికే తెలుసుకు మిచ్చట
నెఱసిన విరికంటివె వాసంతులు—యెఱుకలేద నీకేటికి దంతులు
పొదలినవచ్చటిపుష్పాపచితిన్నెలు—అదిగైకొనిరే యప్పుడె కన్నెలు
తెలిన దాఁటితే తేనియకాల్వలు—వెలినిరి నేఁడీవివ్యకుఁ జెల్వలు
సరసను మొలచెను జాలుగ మొల్లలు—దొరసెడు నచ్చటఁ దుమ్మెదపిల్లలు
బొండుమల్లెలివె పోలఁతిరో మెచ్చితె—దండలు కడువింతలుగా గ్రుచ్చితె
పలుకకు కోయిలపదువులు మూగెడు—బొలఁతి వెఱచితే పూఁబొద లోఁగెడు
వెలఁది చూడు కురువింపలయందము—కెలఁకులఁ గడుఁ దొలఁగించె మరందము
సురపొన్నల కీసున వెన్నాడకు—తరుణి వెఱకు నిత్తఱి నన్నాడకు
కోవిదారములకును వాదేటికి—నేనఁ గయ్యముల కేగెడు మాటికి
వనితలు బడలిన నగకనిపించెను—గొనకొని తుమ్మెదకోపము ముంచెను. 127

వ. అని పుష్పాపచయంబు గావించి చాలించినంత. 128

క. మధురిమధురీణసవిధవి, వినమాధవికాప్రసూనవిస్ఫురమారం
దధునీమిథోవిహృతిమ, న్మథసుపథాలింపమందమారుత మొందెన్. 129

ఉ. మానవతుల్గనుంగొని రమందమరందనవారవిందబృం
దానుసరన్మిళిందనికరాంధుకబంధురగంధసాంద్రమం

దానిలమత్తసింధురవిహారవిలోలతరంగజాలడో
లానిశఖేలనాకలితహంసము నొక్కసరోవతంసమున్. 130

వ. ఇత్తెఱంగునం గనుంగొని జలమానవకుమారు లెమ్మెలకై చిమ్ముక్రొమ్మెఱుంగుజము దాడుల బెక్కునం బఱుక్కున నెగురనిడువాలువాలుగుపిల్లలకై నికటతటతరుపటలశాఖాశిఖానికరంబులనుండి దుముకు లకుముకులగరుత్తులం బెరుఁగు మరుత్తులం దొఱఁగు సరాగంబు లగుపరాగంబు లందగిలి యరవిందమందిరకుం దార్చినగందవొడియబొట్టెలచందంబున నీపకుచ్చలితరథాంగంబు లగుతరంగంబులసందున సదభ్రవిభ్రమంబునం దిరుగుజలభ్రమంబులం దగిలి నిగనిగనికెంపురాలు నింపిన గోముగను వామనగుంటలం బలపించుటకు శిరఃకంపనంబు సేయుచు జలబిందుసందోహకందళితచిత్రశతపత్రపత్రసమావేల్లితం బగుహల్లకంబు వారిదేవత కెత్తునరకతపాత్ర మౌక్తికారాత్రికంబుల డంబువిడంబింప నందులకు సోబనలువాఁడు ముత్తైదువులచెలువున మ్రోయు తేఁటినీటుకత్తియల తేటపాటలకుం జొక్కునో యన నాయకులతోడిపాలయలుకలం దొలంగి చని వనజకుడుంగంబులం గపటనిద్రాముద్రితలై చలితజలాంబులికలు సోఁకిన నులికిపడి యనునయింపం బతు లేతెంచి రని బయలుజంకించు నీటుకత్తియల తేటపాటలకుం జొక్కునోయన నాయకులతోడి పాలయలుకలం దొలంగిచని వనజకుడుంగంబులం గపటనిద్రాముద్రితలై చలితజలాంబులికలుసోఁకిన నులికిపడియనునయింపం బతు లేతెంచిరని బయలు జంకించు జక్కవమిటుచుబోఁడుల యలఘుబహుతరాక్షేపంబుల పెల్లునకుం గొల్లున నవ్వచుఁ బువ్వింటిసాది మవ్వంపునిగేరు మారుతమానవునకుం దీరసంచారిశిఖావళీకుమారికాకేకారావంబు లను గద్దింపులం జఱుకు వాహమించి నవదిద్దునెఱం బర్వినరజంబువిధంబున దుమారంబుగా నుప్పరం బెగయు పుప్పొడిపేరింట నుల్లసిల్లునుల్లవనీడలవీడుజోడాడు వేడుకలఁ గమలినీకమలబంధుపాణిగ్రహణంబునకుఁ గులదేవతల నెదురుకొనుచదురున లజ్జించుచు పుటసమంచితసకోరకబిసాగ్రపాలిక లగుచు వచ్చు మరాళికాబాలికలకలకలంబులసంగ్రమ్మికొని తమ్మిమేడలెక్కి పెక్కువగలఁ జేసుచిక్కున్నలసందునం దొంగిచూచు మధుపస్థానరోధ వధూమణుల మిథస్సమ్మర్దకలకోలాహలబాహుళ్యంబులకుం దగవు లూహించుచు నాళీకముకుళంబులను కలశకులంబులం బరిశోధించి నిస్త్రాసంపదం గలహంసదంపతులు పరిథమసమాగమంబునం బుణ్యాహం బాచరించి యెదురు నూడం బొడసూపిన యజ్ఞాతప్రభాతం బగు నిశాసమయంబు విధంబునం దనరు పరిసరతరుచ్ఛాయామాయాంధకారంబునకుం దిగులువ

డి యప్పటప్పటికి వికసితాంబుజంబులఁ గనుంగొని యవియు ముకుళింపమిం బొం
ను రథాంగకామినుల వినోదంబులకు ఖేదమోదంబు లనుభవించుచుఁ జెంగటఁ జె
లంగు చెంగలువమాలపై నంకించిపాడు చెక్కెరల తేఁటిజక్కులవారియాలాపంబుల
లకుం బరిఫుల్లసరోజం బనుకామిన్ని చేయవఁ బరఁగు విగళితప్రసవపరాగపరంపర య
నుపరిక్రముగ్గుల డగ్గఱ నంపం బగుమందమరుదాందోళితేందీవరముపైనుండి శిప
మాడు సారసవరారోహలకు సమీపంబున శైవాలకలాపంబు లనుధూపంబులర్పిం
చుచు మూఁగికొని యాగామికార్యంబు లడుగునమ్మలక్కలచందంబునం బొసంగు
నానావిధజలవిహంగమాంగనావ్యూహంబున కుత్సాహంబుఁ బొందుచుఁ గమలాక
రాభిధానంబుగానం గంకణవిరాజమానంబై పుష్కరస్వరూపంబు గావున రాజహం
సకలాపంబై శోభితరంగవిశాలంబు గావున శైలాసుప్రముఖానుకూలంబై సారం
గవిలసితంబు గావునఁ బద్మకరేణుభూషితంబై యొసంగుటకు నంతరంగంబున నా
నంద మంపుచుం జేరి. 131

సీ. వారు మీరును నొక్కనయసువారలు గాన నువిద వారికి మీకు నుద్ది యనుచు
నోడినదానిపై నోడిసిన నేలికసాని పాదములపై నాన యనుచు
నాజతతోడ నేకాంతమాడితివి మాగుంపులో నీవుండఁ గూడ దనుచు
నంటిమి గాక మర్యాదతో నిచ్చనే యప్పటికైనయట్లగు నటంచు
బాలయలనాఁడు నామీఁద నోలవెట్టి, తిచ్చినఁకమీఁదఁ జరియింపుమీ యటంచు
నందు కేమాయెఁ గాని లేవమ్మ యనుచుఁ, బలికికొంచును దెగలుగాఁ బంచికొనుచు.

మ. మెలఁతల్ తుమ్మెదకంటుకమ్మవిరిరువ్వీ పామపామామ మా
టలతబ్బిబ్బుల కుల్కికీలుజడఁ గొట్టం బూను జేజేలయొ
జ్జలయిల్లాలనిప్రాసినట్టి వలువ ల్చాలించి యచ్చంపు ని
చ్చలపుంజందురుకావి పావడలు మించన్ ఖేలనాలోలలై 133

గీ. డాసి దరి నిల్వ వారినీడలు పొసంగ, నీటిలోఁ దమ్మిమేడల నీటు రోసి
తన్ముఖాంభోజముల నిల్వఁ దలఁచి వచ్చి, పద్మ తాల్చిన విశ్వరూపము లనంగ. 134

చ. సుదతులు బంతిగాఁ గొలనుఁ జొచ్చిచనంగఁ గ్రమక్రమంబునం
బదములు మొదలు పెందొడలఁ బైకొని పొక్కిట దాఁగి చక్రసం
పదలు సహింపలేని కుచభారము లోఁగొని కంఠదఘ్నమై
తుది నటు మించదయ్యె నలతోయము కంబులు దాఁగమించుటన్. 135

మ. కొలనయ్యింతులు సొచ్చినంతరగసోఁకుల్ హెచ్చిన న్వేఁగుఁ ద

మ్ములపైఁ దేఁటులు వేఱుతామరలపై మూఁగం దదీయాళిచే
ఖిలు వాటింగదుమంగఁ దధ్వనికి రేఁగం జక్కన ల్దాఁటు చె
క్కులఁ దేఁజెమ్మెరపుష్పధూళి చపలనాఁగం జిత్రమయ్యె న్వడిన్. 136

చ. చెలువ యొకర్తు క్రౌంచశుకుఁ జెందొవ బిట్టెగరంగనైవ న
య్యలరు తపంజలిం బకుట యద్భుత మయ్యె మదీయపక్షరే
ఖలఁ జెలరేఁగి గాసియొనరింపఁగఁ దగునే యని యేసుడెంచి చే
తులపయి వ్రాలి వేఁడికొను తోయజపాంథుబింబమోయనన్. 137

గీ. సారసుచశైలమథితకాసారజలధి, నప్పడప్పుడు వొడము నజ్జాతకరణి
నొకశుకాలాపమించి వెల్లకిల నీఁద, నమరె ముద్దులుగారు చిన్నారి మోము, 138

చ. ఎలమినొకర్తు వెల్లకిల నీఁదఁగఁ జుట్టును గల్వమొగ్గల
గ్గలముగ మించెఁ జన్నుఁగవకాంతులు గన్గొనవచ్చెఁ బంబరా
జ్జలరుహగంధి పంపఁ బరిచారిక లప్పటి ముద్దుగాఁగ పొం
దులుగని నైచు గూటములతోడి కడానిగుడారము ల్బలెన్. 139

గీ. మొగము మాత్రంబు కానరా ముద్దుగుమ్మ
యొకతె నిలువీఁత యాఁడెఁ జెన్నొందెఁ గురులు
నీరజాకరమునను మున్నీటిలోఁ గ్రొ
పీటములు గ్రోలు మేఘంబు పిల్లయనఁగ. 140

క. బోరగిల నీఁదు నొక్కమి, టారి విశంకటకటీతటంబొప్పెరెన్
సారతరాపరపారా, వారాన్వృత మైనభూమివలయం బనఁగన్. 141

గీ. బాలికలు మేలి జీనువురాలనూడి, నీటికై జారు సౌరు వర్ణింపఁదగిమె
నలమువాలసపై నపరంటు నేయు, నలుపువిలుకాని సునుదోనియమ్ములనఁగ. 142

సీ. చనుఁగవమీఁది చందనము చెందినచోటు వెలిదమ్మిపుప్పొడి గ్గలసికొనఁగ
మొనల కుంకుమపచ్చ మించి మునినచోటు చెంగల్వవిరిసుంపు చేరికొనఁగ
సారమానుదుటి కస్తూరి మీఱినచోటు తేఁటిటేజవరాంద్రము మాటికొనఁగఁ
నెమ్మినిఁ బసుపువన్నియలు పన్నినచోటు నవకంపుటకరులు నాఁచికొనఁగఁ
జెంవ లీకితి నీరాడి కొలను వెడలి, తమముఖాంభోజముల నిండు తావి గ్రోలఁ
దేనియలు గ్రాయు కన్నుఁటి తేఁటులనఁగ, జలజకణములఁ గీలుఁగంటలు నెలంగ.

చ. తటమహిఁ జేరి యంతట మదాలసనుం గయిసేసి తాము స
త్కటమణి భూషణావళులు దాలిచి యేటిపరంకులన్ని యి

క్కుటిలకచా శిఖామణికిఁ గోరకులిచ్చు రమాకుమారు నె
క్కుటిభజియింపకున్న నిది కార్యముగా దని యేగి యవ్వలన్. 144

ఉ. చెలువగు పూఁబొద న్వలపు చల్లెడు కస్తురి తిన్నె యందుఁ గెం
దలిరుపంరగిపీఁట పయిఁ దామర ఱేకునఁ జెంతనున్న నె
చ్చెలి మొగ మోరసేయ రతి చెక్కులు నొక్కుచు మోవి యానుచున్
గలరన మిచ్చు పచ్చవిలుకాని లిఖించి సఖీశిఖామణుల్. 145

చ. అలిగినక్రొమ్మెక్కి చుక్కజవరా లదలించుచుఁ గాలఁ దన్నినం
బులకలు దాల్చు చందురుని బొంకము వ్రాసి వసంతు మత్తకో
కిలములఁ దేఁటులం జిలుకగేస్తులఁ దెమ్మెరయాకతాయలన్
నిలిపి యమర్చి తెచ్చిన వనీకుసుమంబులు కుప్పవోయుచున్. 146

క. పూజించి చిలుక ముక్కు, తేజీదొరఁ గూర్చి వికచదీవ్యత్స్రగ్గా
రాజీవ నవమధుద్రవ, రాజీవర వైఖరీపరంపరదొరయన్. 147

మ. హిమరుగ్బాంధవ మంత్రహీనము క్రియాహీనంబు సద్భక్తిహీ
నము మత్కల్పితమైన యీనిఖిలనానానూనపూజావిధా
నము సంపూర్ణముగాఁ దలంచి దయనానందింపు నీవంటిదై
వము చిత్తంబున మెచ్చినం గలుగలేవా మన్మనోభీష్టముల్. 148

గీ. అరయ హరునంతవాఁడు త్వద్గురుశరాగ్ర, దళితపురపర్వుఁడై మహావరముతోడ
నజ్జశరపాలిఁ గని హాళి నావహించు, నని న నీశౌర్యసార మేమనఁగవచ్చు. 149

క. దైవం బనిన న్నీవే, దైవము గాకింక నొకఁడు ధవళాత్ముల నా
శీవిషవిశిఖ శిఖార్తులఁ, గావింప న్వారులఁ గూర్పఁగా నెవ్వఁడేఁకన్. 150

సీ. వేఁడి యాఁగదవయ్యు విహితశైత్యాంధమంధరగంధవాహాస్త్రనంధయంబు
వాఁడి యాఁగటనయ్యు వనజాతిసహజాతి మార్దవనవకౌసుమవ్రజంబు
చేఁగుచూపుఁ గదయ్య జితసుధామాధురీసారకీరారావగౌరవంబు
వింతసేయుఁ గదయ్య సంతతాత్యంతపోషితహంసకాంతానిషేవణంబు
కామినీకాముకులకు యోగప్రసక్తి, దక్షముగనీకటాక్షము దప్పెనేని
గాన నిను గొల్చువారిచే కౌశలంబు, భవజయోన్నిద్రతారిణ పంచబాణ. 151

సీ. వీటఁబుచ్చవె దాసవిభుకన్యఁ గను బరాశరమౌనివరుసదాచారగరిమ
చేటపైనవె బృహస్పతిభార్యఁ గనుఁగొన్న తారకాకామినీధవునిగుట్టు
నగుచుసేయవె యహల్యాకాంతఁ జూచిన యమరలోకాధినాయకుని సవత

కొంచె వొనర్పవె కూర్మికూఁతు నీక్షించి యిచ్చినపద్మసంభవు పెద్దతనము
భావభవ యమ్మచెల్లగా నీవుచేత, నేజఁ బట్టిన నెవ్వారు నిలుచువారు
మారమణి నింతయేఁచిన యామీనధ్వ, జేంద్రుఁ జెనకంగఁ జాల వదేమొకాని. 152

క. మారామపట్ల నీసుడు, మారాజచ్ఛరము దాఁపుమా రాజ యిదే
మారాటమునకు నోర్వదు, మారాజముఖీమణీకుమారా మారా. 153

క. అని మఱియ యప్పుడు మగుడం, బనివడి పొగడు న్మఖాంధపాంథజిగీషా
తనుతత్తురంగ హేషా, ఘనతరఘోషాప్తి యొదవఁగాఁ గలఁగుటయున్. 154

శా. చీనాచక్కెర ఘాణపుంబులుఁగుఁ దేజీజోదు కేదంగి బ
ల్పానాకత్తికిఁ దత్తరిల్లి నవలా సాయంసమారంభవే
లానాలీకిని లీల సొమ్మసిల బాలాపాలికల్ చంద్రకాం
తానర్ఘ్యాంతికవేదిఁ జేర్చి బహుచింతాకంపిత స్వాంతులై. 155

సీ. మదనుగుణధ్వనికిఁ బొదలెదు తేఁటులే మంచకింకను ఝుంకరించఁ దొడఁగె
మానసప్రేమ యేమఱని రాయంచలే మించికొంకక హుంకరించఁ దొడఁగె
సహకారవృత్తిచే జరగు రాచిల్కలే కొంచకిక్కడ వెక్కిరించఁ దొడఁగె
ఘనమైత్రిచే నెమ్మిగను నెమ్మిగుంపులే ధృతియింకఁగా హుంకరించఁ దొడఁగె
నేమిచేయుదుమే బోఁటి యింక నేటి, మాటలే పోటుమదనకు మగువమీఁద
నింతిపగయేల బాలవాఁడేమి చేయు, మనలపాపంబు పొలియింప ననుచు మఱియు.

ఉ. కొమ్మ చిగుళ్లు దిన్నమ్మ లతకూన విరు ల్గొనిరమ్మ పద్మినీ
తమ్ములు గొంచురమ్మ వనితామణికి న్ననశీతలోపచా
రమ్మొనరించకున్న నలరాయని రాయిడి నేమి పుట్టునో
యమ్మకచెల్ల యింకఁ దడయం బనిలే దని సంభ్రమంబునన్. 157

సీ. అడుగునఁ బడవైచి రని దళం బెత్తునో నెత్తమ్మి పదముల నిలుప నేల
యంకంబునకుఁ దార్చి రని పొరవిచ్చునో యనఁటు లూరుల చెంత నునుప నేల
యధరభూమిని నిల్పిరని మొనచూపునో చిగురాకు కెమ్మోవిఁ జేర్ప నేల
యంబకమ్ముల నుంచి రని యొత్తువాఱునో హల్లకంబత్తుల నలమ నేల
యిచట సమవస్తుసంయోగ మేల యమ్మ, యిదియుఁ బగవూనె నేని నీయిగురుఁబోఁణి
తాళలే దమ్మ మీనేర్పు చాలునమ్మ, తరుణియివియెల్ల మదనసాధనములమ్మ. 156

క. అనుచుఁ బెనఁగొన్నశైత్య, మునఁ దగు శిశిరోపచారములు చేయుటయున్
మనసిజశిఖి బగ్గురుమని, పెనరునఁ దళ్కుఖుగుండె నెగ్గుడుమొగన్. 158

సీ. తనులతమీఁద జివ్వనినీకి మిహికాంబుకాండ మెంతయు నిరాకార మయ్యె
నఃచేతిపైఁ జులచుల స్రుక్కియుంపరదఁ గెందమ్మి పుష్కరాకృతి వహించెఁ
గలికి కన్నులమీఁదఁ గమలిన పరువంపు ననగుత్తు లరయ సూనంబు లయ్యె
మినుకుఁ జందోయిపైఁ దునిసి మౌక్తికరాశి తిలకింప ముత్తెంపు తెరలువూనె
బళిర యివియెల్లఁ దమపాటు దలఁప కిప్పు, డంగజాగ్నికి సాహాయ్య మాచరించి
కొమ్మపై వేఁడి చూపె నాకమ్మవింటి, యెమ్మెకానికి విజయకాలము సుమ్మ. 158
గీ. ఆదియుఁ గాకిందుఁ జనుదెంచునపుడు తమ్మి, విరులదగుకమ్మదెమ్మెరల్ వీచెనమ్మ
నైకొనక వచ్చినంతయుఁ గంటిమమ్మ, యబలనిందుండనీయరా దమ్మయనుచు. 160
క. ఇందీవరలోచన లిం, దిందిరకచ సేవదేర్చి తెచ్చిరి సుషమా
కందలితైందవరుచిగరి, మందిరమగుధవళవసనమందిరమునకున్. 161
గీ. ఇట్లు చెలువలుదోడ్కొని యేగుదేర, నంబుజాననతనగుడారంబుఁ జేరె
ననిన జైమినిముని యావిహంగములన, నంతర కథావిధం బెట్టిదని యడిగిన. 162
శా. లక్ష్మీశోపమ వీరవేంకటనృపాలశ్రీమహారాయ ద
త్తక్ష్మామండల మండనాయిత యశోదామాభిరామాఁశుసీ
రక్ష్మానతఱన కార్తికీకుముదినీప్రాణేశ చారుప్రకా
శక్ష్మాలత్ప్రతిపక్షభూమిపతియోషాలోచనాంభోరుహా. 163
క. ధాటీఘోటీఖురఖుర, కోటీపాటితవిరోధికుతలపతిశిరః
కోటీరహారశకలవ, ధూటీనవమదన విభవధూర్వహసదనా. 164

పంచచామరము.

వదావదాహిభోగిరత్న వర్ణవర్ణితక్షమాం, గదాగదాసిమద్విరోధిఖండనాత్తలోకస
మ్మదా మదావళారివిక్రమస్ఫురద్యశఃకలా, పదాపదానవద్రులోకపారిజాతవైభవా.


గద్య.

ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ సవరమన్వయా
భరణ నారాయణభూపాలతనూభవ శఠగోపతాపసేంద్రచరణారవింద సంచలన్మా
నసమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణానంద కామినీమనోహర రూపరేఖావిజి
తచైత్రకాశ్యపగోత్రపవిత్ర జాతివార్తాకవిజనామోదసంధాయక చిననారాయణనా
యకప్రణీతంబైనకువలయాశ్వచరిత్రంబనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.



శ్రీరస్తు.

# కువలయాశ్వచరిత్రము.

## చతుర్థాశ్వాసము.

---

క. శ్రీరాజద్వేంకటగిరి, శౌరిపదాంభోజభజనజనితోజ్జ్వలతో
దారవిభవేంద్ర సవరము, నారాయణభూపచంద్రనయగుణసాంద్రా. 1

గీ. అవధరింపుము జైమిని కలపతంగ, కులపతంగంబు లిట్లని తెలుపఁ దొడఁగె
నమ్మదాలస పటకుటీరంబుదారి, కమ్మతావుల తెమ్మెరల్గమ్మదారి. 2

క. వనిసొచ్చుట మరునకున, ర్పన లిచ్చుట సొమ్మసిల్లి సఖియలవలనం
గనువిచ్చుట వారచటికిఁ, జనుదెంచుట యెఱుఁగలేక తన్మయదశచేన్. 3

సీ. మనవులు విన్నవించిన వినునోయంచుఁ జేమకన్నియమిన్న చిన్నఁబోవ
ననబంతి కానుకిచ్చినఁ జూచునోయంచు నచ్చునెచ్చెలి తలవంచికొనఁగఁ
నెనరుతో హెచ్చరించినఁ బల్కునోయంచుఁ గదియు పైపలి సిగ్గుగాంచి యొదుగ
గసపించి జాతిచెప్పిన నవ్వునోయంచు నరుదెంచుహరిణాక్షి యనలి కరుక
వినక చూడక పలుకక వేదనాప్తి, నవ్వికాపద్మనయన కాంతవశరాగ్ని
తప్తకిసలయముక్తనూతనపునఃప్ర, వాళకృతశయ్యఁ బొరలాడు వేళయందు. 4

ఉ. ఈవనజాయతాక్షిఁ దరుణేక్షుధనుష్కతురుష్కమాళి యా
హావెతవెట్టెనంచు హృదయార్ద్రిదయాభ్యుదయాప్తి చేత రా
జీవశరప్రహారగతిఁ జెందుట తెల్పఁగ సేగె నాఁగఁ గం
గావిభుఁ జేరెఁ గింశుకనఖద్యుతిఁ జొత్తిలి మిత్రుఁ డయ్యెడన్. 5

శా. ఛాయాప్రాగవకర్షణంబు సరసీజాతాంతభోగంబు కా
లాయానీకపతంగపాకపితృజాలప్రాప్తి పాంథప్రజా
స్థేయస్థానగతిప్రబోధకము దూతీప్రార్థనారూఢజా
రాయత్నంబు జరన్మహాతప ముదారంబయ్యె నంతంతటన్. 6

చ. వడి నపరాద్రిఁ జెంద నని వాసిగఁ బద్మిని నెత్తిమీఁదఁ జే
యిడి కరసంగతి న్సమయమేగఁ దదాశఁ గుఱించి రాగమే
ర్పడఁగఁ జనంగఁ దేజమెడఁ బాయఁడె యీయినుఁ డంచు మ్రోఁత పె
ల్లడరఁగఁ జాటుచూటి సరసాళితతు ల్మొఱసెం గొలంకులన్. 7

చ. అవిరళనిర్గళన్మధురసాగ్రనిబద్ధ నిజానుబింబకై
తపమున హేళి కాలవశత న్నిజపద్మగృహంబుఁ జేర మా
ధవపద మాటచే రమ మదభ్రమరాళితమంబు వాని వెం
దవులక యుండఁగాఁ దలుపుదార్చె ననన్ముకుళించెఁ బద్మముల్. 8

ఉ. ఏకరథాంగభావము సహించిన నన్నిటు డించి పోవుట
ల్లోకుచితంబుగా దయిన నీవలె నేనును నీరధిప్రవే
శాకలనంబుగాంతు ననునాకృతి భానుని దేఱిచూచుచుం
గోకము బాష్పవార్ధి సమకొల్పె భవిష్యవియోగఖిన్నమై. 9

ఉ. ఎంతయు బాడబంబు తనయింటికడం జెలువొందు జీవనం
బంతయుఁ గొల్లలాడ భువనావనశాలివి నీవుపేక్షగ
న్నింతువె యంచుఁ బాళి మొఱవెట్టగఁ జక్రము దానిపై రమా
కాంతుఁడు నైచెనో యన వికర్తనుఁ డయ్యెడఁ గ్రుంకె వార్ధిలోన్. 10

చ. కరముల బల్మిచే మెఱయు కంజహితుం డను మేటిజెట్టితో
నరుమగఁ బోరిపోరి సమయప్రతిమల్లకులేంద్రుఁ డాతఁడన్
హరువుగఁ ద్రోచి మేనిచెమటూరఁగఁ దాల్చిన యొజ్జమట్టినాఁ
గరమమరెం బ్రవాళరుచిగంధధురంధరసాంధ్యరాగముల్. 11

సీ. రవిగ్రుంక ముకుళించు రాజీవములఁ బాసి గమిగూడు తుమ్మెదకదుపనంగ
విభునిఁ గానక భూమి వెనుకనే తెంచి చొప్పడు చాయ విశ్వరూపం బనంగఁ
దొగనంటు సోమాఖ్య నెగడి రాఁగలఁడంచు గుమిగొన్న తామసగుణ మనంగ
రేకొన్న పతిరాక కైకొన్న ఘుటిఁజుంపఁ గొనవిప్పు కురులడాల్గుంపనంగ
కాముకాగమనప్రతీక్షాపరాయ, ణోత్పలాక్షీజనాంజనవ్యూఢవిస్మ
రాయతాక్షీణనవవీక్షణౌఘమనఁగఁ, దండిచీఁకటితండంబు మెండుకొనియె. 12

సీ. నటదుగ్రథకాకినీనాదభిన్నాంతరిక్షమునఁ దాల్చిన వెండి కట్లనంగ
జవమందమందగంధవహాప్తి మింటిపై రాలు వేలుప్రమాని పూలనంగ
యామినీవిభువివాహమున కంబరవేది వరలు ముత్తెపురంగవల్లు లనఁగఁ
దమపుష్కరాభిఖ్యతథ్యంబు కా వియత్పథము చెందిన వెల్లదమ్ములనఁగ
సమయమనుయాత్ర నాళీకసార్వభౌముఁ, డంబుజంబులఁ జెందు రోలంబపఙ్క్తి
యనుతుపాకిని గగనలక్ష్యంబు నైవఁ, దగులు సీసంపుగుండ్లునాఁ దార లమరె. 13

క. అలపొడుపుగట్టు నగరు, న్వెలువడురాజునకు మ్రోల వేళాసతి మె

చ్చులకుచ్చుఁ బట్టివైచిన, వెలిపావడ యనఁగఁ దూర్పు వెలుఁగం బొల్చెన్. 15
సీ. తనభానుసంతతి ధరమీఁద వెలయింప భువనాధిపతి గురుస్ఫురణఁ బెంప
రహిఁ బాపమహిమచే జాతినాతి నొనర్చ నభవోగ్రధర్మ మొప్పారఁ జేయ
మానిత ధరణిజానంద మొనరింపఁ బాంథరామాత్మదర్పంబు లడఁప
వనభూరికమలవర్గస్ఫూర్తి మాయింపఁ దారేశరూఢివర్ధన మొనర్పఁ
జేసె రాయనిగర్వంబు గానుపింప, సమధిక పలాశపరచక్రసమితి నొంచ
నమితకువలయపరిపాలనమున మెలఁగఁ, దూర్పుదెస రామచంద్రుఁడు తోఁచెనపుడు.
• ప్రాగ్దిశాంగన కెంగేలఁ బట్టినట్టి, పురతకాల్పెట్టుగవిసెన పామువు వలన
నంద మొందిన నిద్దంపుటద్దమనఁగఁ, బొడుపుఁగెంపున జాబిల్లి పొడిచె నపుడు. 17
చ. అమలిన శుక్లపక్షమెనయంపగు తద్ద్విజరాజు మించిభే
దము సవరించి తేర్చు తెలితల్కులపాలనఁ బాంథదేహపాం
డిమబలెఁ జంద్రిక ల్నిగిడె డించిన నీరనఁ గాము కాత్మమో
హమువలె నంధకారనివహంబు బది యెక్కడనో యడంగఁగన్. 18
క. ఆకరణిఁ బొలుచు హృదయ, వ్యాకులతాతాపకారి యగు శోకారిం
జేకూరిన వగ వేఁపు, రాకూరిమిపట్టి యంబరంబుగఁ బలికెన్. 19
మ. నెనరొంపం ద్విజరాజుగా యితఁడు పోనీ యంచు నే నూరకుం
డిన నీవెంచక యేతువే యిటులఁ గానీ మంచిదే చంద్ర నా
నునువాలుంజడ చిల్వరాయనికి నిన్ను న్మేఁతగావింతురా
వినురా యేటిపరాకురా కుసుమధన్విం గూడి వే రాకురా. 20
గీ. అమృతరామకమండలు హరిణకృత్తి, కాసమన్వితు నుద్దండకరుని నిన్నుఁ
గన్న సన్న్యాసిగతి దోఁచుచున్నదరయ, గగనమధ్యాభియుక్తి నీకగునె చంద్ర.
గీ. శరధిఁ దోఁచుట నాళీకపరవిధంబు, గోరికాంచుటయును మ్రోయుగుణముగల్గు
వింటనంటుట మమ్మేఁచుచుంట తెలిసె, నేయువారలఁ గానమో తోయజారి. 22
క. నళినాప్తువలన మండల, కలితుఁడవై వెలయుటెల్లఁ గలిగిన కరణిం
దలఁతువె శంబరహారికిఁ, గలదే యుపకారమెందుఁ గమలకులారీ. 23
సీ. నినుఁ గడుపారఁ గాంచినవారిరాశికిఁ గడలేనిపాటులు గాంచవలసె
నిను నారికోరి కైకొను కల్వచెల్వకు విషములోఁ బ్రతుకుఁ గావింపవలసె
నినుఁ దలమీఁదఁ దాల్చిన శూలపాణికి నవిభవోపేతుఁడై యమరవలసె
నిను నమ్మి కొల్చి నిల్చిన తారకాళికిఁ జింతింప దుఃఖంబు చెందవలసె

నెవ్వరికి మంచివాఁడ విల్లెంచి చూడ, నించువిలుకాని కొక్కనికే మొకాని
వానిప్రథమాస్త్రి విధనంబువారి కొనవె, రాదు నీచెల్మి చేయఁ దారాసహాయ. 24

గీ. పాంథమదఖండనోద్దండపక్షకాండ, గర్వసాహాయ్యకలయొండు గన్న నీకు
నమరభోజ్యకళల్గలచంద్రుఁడులోకు, లాకటికిఁ బదాఱు గల్పించి యుచ్చెలాప్త. 25

గీ. అనుచు రామాలలామ పాంథాలిభీమ, ధామచయసీమ యగుచందమామఁ గినిసి
వినిశితాంభోజనారాచమెనసి యేఁచు, మనసిజుఁ గుఱించికొనుచు నిట్లనుచుఁ బలికె.

గీ. అర్జునవైరి నీతండ్రి గ్రైనగరుడ, గమనకేళికి గుండెలోఁగాల మింత
కొదవలే నీదుతల్లికిఁ గొంప చెఱుపు, వీసితోఁ గూడి యేఁచకు విషమబాణ. 27

చ. కమలశరా నినుం జెఱపఁగా నియమించినఁ జేరిమూఁడుగా
ళ్ళముసలి కావునం దయలలాట విలోచనకేలి నిన్ను ని
క్కముగఁ గరంచకుండె ననిరాదె గిరీంద్రకుమారికాపరుం
డమలినమంత్రదక్షసవనావని నాతనిఁ బాఱఁ ద్రోలుటల్. 28

సీ. భామానిరూఢి గన్పడ మండలాగ్రంబు మెఱయించు మొదట నీమేనమామ
కొమ్మలపైఁ బండ్లుకొఱికి లావులనల్లిఘాటి కన్పించు నీఘోటకంబు
కాంతాళిపైఁ బరాగస్ఫూర్తిఁ గల్పించి చెనకంగఁ జూచు నీచికిలితూపు
నారులమ్రోఁత నానందించి నిలువెల్లఁ గన్నులు దాల్చు నీకార్ముకంబు
బళిబళీ నీకు బాకైన తలిరుటాకు, లడవి లతకూనలన్నఁ బైనంటి నిలుచు
నీవు మామీఁద శౌర్యంబు నెఱపుటరుదె, మానినీప్రాణచోర రమాకుమార. 29

చ. వనజకృపాణ చల్లనయినర్తిలఁగాఁ దడిపాఁతగొంతు గో
సినగతిఁ దమ్మివాలు గొని చిమ్మెదు పాంథులమీఁదఁ దేనెఁబూ
సిన పెనుఁగత్తి కానలయుఁ జేతికి నీకది విప్రయోగమొం
దినయల ముద్దియం దగిలి నెయ్యముఁ జూపఁగ నెట్టు లోర్చితో. 30

గీ. అనుచుఁ జెల్వపుఁజెంగల్వయరిదికిరుసు, దురుసుమాష్టీని బదరి యియ్యరుసుపట్టి
గురుసుమద్యోతనునిదూఱి గరుసుమీఱి, పేరెములువారెదు మరుత్కుమారు ననియె.

సీ. మెడలపై నిడలేక పడగలు చిదిసిపో మేదిని భారమై మెఱయుఁ గాత
గట్టిగా నూపిరికట్టు పట్టంగ నాళీకనాభుఁడు పవ్వళించుఁ గాత
నాభీలపాతాలమైనను జొరఁబాఱి పిల్చి తార్క్ష్యుండు నొప్పించుఁ గాతఁ
గృతియైన భాష్యఫక్కికయందు నొకమాట తగుచుట్టుఁ బ్రోవమై తాఁకుఁ గాత
ప్రబలపన్నగకులరాజ్యపట్టభద్రుఁ, డెన్నఁ దనసీమ నొకప్రక్క నిన్ను మెసవి

లేఁడు పొమ్మని యనకున్నవాఁడు గాన, దళితపాంథవిహార శీతలసమీర. 32

క. కదుఁ దాత్పర్యము నాపై, నిడుతామరసాక్షి తోడి యీ నెయ్యంబు
న్విడుఁ గారింపకు మదిఁ, జెందెడుతాలిమి నొక్కవిడుత తెమ్మెరబుడుతా. 33

గీ. అనుచు నిక్కాంత వలవంతఁ బొరిచిపోఁడి, దొరలఁజెందిన కమ్మదెమ్మెరల దూఱి
ముమ్మరమ్మగు తాపమ్ము గ్రమ్మఁదమ్మి, సోనపున సొమ్మసిల్లుచు మేను సేర్ప. 34

ఉ. ఏను మనంబులోనఁ జెలు లింప అలంతలఁ జెందిరంచు
నప్పానుపునందు నిక్కలికి ప్రక్కనె యుంచుక పన్వళించు న
చ్చోనిఁక నేమి తెల్పుదు యశోధన కోలలఁ గొట్టి లేపిన
స్మెఱుఁగంగనీ కొపవె నిద్దుర యిద్దురవస్థకై వెసన్. 35

ఉ. అంతట మేలుకాంచి నయనాబ్జము లొయ్యన విచ్చిచూడ ని
క్కాంతయు నేను నిమ్నగధరగహ్వరపట్టనరాజగేహసౌ
ధాంతమునందు నుంటిమి మహాత్మక యిప్పు డిదేమొ యంచు మే
మెంతయుఁ జింత నంత గుఱియింప భయంపడి యున్న గ్రక్కునన్. 36

క. పాతాళకేతుఁ డఁట యొక, దైతేయుఁడు చేరవచ్చి పంభోళిహటా
త్పాతాద్రిభీతహరిణీ, రీతిం బగు మమ్ముఁ జూచి కృతహాసముతోన్. 37

క. లోకములన్నియు నన్నుం, గైకొని పూజించు మీరుగా మీరానా
లీకాంబకుఁ బూజించితి, రాకామినులార నాకరం బెఱుఁగరొకో. 38

గీ. ఇప్పు డేమయ్యె నింక నాయించువింటి, వాఁడనుఁగు నేఁడు గూర్చి మీవాంఛదీర్ప
నేర్చునో నేరడో చూచి నెలఁతలార, యింపుపసలార నన్నుఁ బూజింపుఁ డనుచు.

క. ఒక హెగ్గడి దానవనా, యకుతో నేమేమొ తెలిపి యాతఁడు వికట
భ్రుకుటీపటుతరనిటల, ప్రకటీకృతరోషుఁడై సభాస్థలికరుగన్. 40

క. ఆవచ్చిన చెలి నాతో, నేనగల ఋతధ్వజేంద్రుఁ డితనిం జంపం
గా విడిసినాఁడు బ్రదికితి, రీవేళకుఁ దాళుఁ డనుచు నేగెన్వేగన్. 41

గీ. నాఁటనుండియు వలవంత నాట నీవ, ధూటి పడుపాటు కనుచు దోధూయమాన
మానసాంభోజనై యున్నదానవయ్య, యనఘ నా పేరు కుండల యండ్రు సురలు.

వ. మహాత్మా! యిది మదీయవృత్తాంతంబు దురంతసంతాపచింతాపరాయత్తం బగు చిత్తంబు వివరింప భవత్కథాకథనంబున కడ్డంబుగా నింతయు విన్నవించితి నీయపరాధంబునకుం బ్రార్థనారంజకంబగు నంజలిరచియించెద నాఁడు ఋతధ్వజనృపసుంధరాపురంపరు దారుణం జూచుటం జేసి నిర్ధారణాసామర్థ్యంబు లేమిం జేసి డోలా

యమానమానసనై యున్నదానఁగాని నీయందలి సౌందర్యగాంభీర్యాదిగుణంబులు సోయంప్రత్యభిజ్ఞావిధాయకంబులై యున్నయవి. అయినను మద్విలోచనచకోరికాచంద్రబింబంబగు నీమూర్తియుం బోలె యుష్మద్వృత్తాంతంబుఁ గూడ మన్మనఃకమలంబునకు మార్తాండమండలంబుగా నానతీయ నవధరింపుము.

చ. అన విని యాజనాననగుణావని యావనితాశిరోమణిం
గనుఁగొని యింత నేర్పరివి గాక యుండిన నీవధూటి కిం
పెనయ వయస్య వౌదువె భళీయిటువచ్చెను రాక్షసాధముం
డును ఋతధ్వజుం డనవుడున్ భవదూహకుఁ దప్పు గల్గునే. 44

క. నాకోరికతో నీక, న్యాకాంక్షిత మెల్ల సఫల మయ్యెం దివిష
ద్భీకరుఁ డీదనుజుఁడు ఘో, రాకారతఁ గూలె మచ్ఛరావళిచేతన్. 45

గీ. అదియు నెఱుఁగుదు వింక నేణాంకవదన, మంజువాణియు నేను నీమాటలోని
వారమైతిమి మాకు నేదారి నడువ, వలయునో యట్లు నడిపింపు పలుకులేల. 46

చ. అనవుడు నమ్మదాలస ముఖాబ్జమునం జిఱునవ్వువెన్నెలల్
నునుఁ జనుదోయిపైఁ బులకలున్ నిటలంబున ఘర్మబిందువుల్
మనమున సిగ్గుఁ గన్నుఁగొనలం బ్రవహించు ముదశ్రుపూరముల్
కనఁబడ నున్నఁ జూచి చెలికత్తియ యత్తఱి రాజచంద్రుతోన్. 47

చ. ఇపుడు గదా మదాళి పయి నెత్తిన వింటిపయిం జెలంగు నం
దపువిరివమ్మి తేకు దెసనా దొరకేల్ రతి నిబ్బరంపు సి
బ్బపు వలిగబ్బిగుబ్బకవపై జెరలాడెఁ దొడంగ నేఁడుమా
తపము ఫలించె నింక వసుధావర తామస మేటికియ్యెడన్. 48

సీ. వేఁడిసెగల్గల్గువేల్పు సాక్షిగనైన యప్పుడు గాని కేలంటరాదు
ప్రామిన్కురోపలు గన్పడఁ గంటెకట్టునప్పుడుగాని గళీయుక్తిఁ బొందరాదు
పొలుపుగా వ్రేలిమి బొట్టుమరించునప్పుడుగాని ముంగురుల్ పొదువరాదు
మొకమోరసేయ సన్నికలు మెట్టించునప్పుడుగాని పాదాప్తిఁ బొరయరాదు
నృపదంపతులకు విడెమిచ్చుమోవ, మెనయునప్పుడుగాని పాన్పెక్కరాదు
నీవెఱుంగవె శాస్త్రోక్తి నిర్ణయమ్ము, చారము లుదారకుంభినీజంభవైరి. 49

ఉ. ఏను వచింప నీవు వినుటిప్పుడ కా యిఁకమీఁద నీసరో
జానన యొక్కవేళఁ బొలయల్కఁ బరాఙ్ముఖ యున్న నప్పుడే
మోనముఁ బిల్తు పెద్దతనముం గనినప్పటికైన నీసుపా

దానతి నాకుఁ బోఁటియయి యప్పుడె యప్పనిఁ జేర్పఁగం డునే. 50

సీ. రాచిల్క రాయబారమున దారికిరాక చడ్డింపు కోరమీసములు గువ్వ
యదిగా దనుచు నింతటంతటఁ జేరరాఁ గేడింపబట్టుగాఁ గేకనైచి
నీ బంట నన్ను మన్నించవేయన వివి వినమి సేయుదు దుంటవిల్లునంచి
దుడుకుగాఁ జెఱగంట ముశిగొన్న బొమ్మలానించిచూచిన తెగనింపఁ దీసి
యతనుఁ డీయింతికలుక చల్లార్ప నీవు, పాదముల వ్రాల దీనబాష్పములు చూచి
యస్త్రసన్న్యాస మొనరించు నట్లుగాఁగ, నింపు సొంపారఁగా విహరింపుఁ డింక.

గీ. అనిన మదమంది యమ్మంచరాద్రి ధీరుఁ, డావధూటులఁ దోడ్కొని యాత్మపురికి
నరుగుటయ కాని లేదు కార్యం బటంచు, నగవు దైవాఱఁ గుండల మొగము చూచి.

క. మంచిది మనపురిఁ జేరుద, మందు న్లేచుటయు నవ్వయస్యయుఁ గమ్మల్
మించుగ ననియాడఁగ భదుఁ, డంచుం జేఁజూపి మందహాసముతోడన్. 53

చ. చెలువుని వెంటఁబోఁ దరువుసేయు మనోజ్ఞము మాట చెల్లనీ
కలమెఱు లజ్జకన్న ఘనమైన కటీతటి వ్రేఁగున న్నడ
వ్వైళకఁగ నంచబిత్తరినలె న్మరిపంబున నమ్మదాలసా
జలరుహగంధి రా నృపతిచంద్రుని వెంబడి మేడ డిగ్గినన్. 54

మ. అతఁ డచ్చోఁ దురగంబు నెక్కి హృదయాబ్జాపూర్ణమోదార్ణవాం
చితుఁడై వారల వెన్క నుంచుకొని యక్షీణైక్యమాణిక్య దీ
ధితిజాతావృతదిగ్వితాన మగు దైతేయాధినాథాయతా
యతనం బల్లన నిర్గమించి పురబాహ్యక్షోణి కేతెంచుచున్. 55

ఉ. అచ్చట నున్న సైన్యము బలాధిపతుల్ వెనువెంటరా సము
ద్యచ్ఛటులాశ్వటిం గువలయాశ్వుఁడు ధీయాని చౌకుచేసి చన్
బ్రోచ్చలితావనీరజము లొక్క మొగంబుగఁ బిక్కటిల్లవై
యచ్చరవీథిఁ గప్ప నదియాత్మపురాంగణసీమఁ జేరినన్. 56

గీ. అచటి కెదురుగవచ్చు ధరాధిపతులు, కామినీయుక్తుఁడై చేరఁ గ్రమ మెఱింగి
దవ్వులనె నిల్వ నిజమణిధామ మొంది, రమణులును దాను సంతసపూరమున కరిగె.

ఉ. అంతట నాసురాంతపుని యక్కలితమ్ముఁడు తాళకేతుఁ డ
త్యంతమహోగ్రహోముఖకహాకహ నాదమహాట్టహాసవి
భ్రాంతసమాకశోకపరిపాకభయాకరదైకలోకదు
ర్దాంతవిరక్తనోదరగదాశ్రితకేశవుఁ డొక్క యిమ్మునన్. 58

చ. కొలువుననుండి యింద్రుఁడు కపకు న్మన మంపినవాఁడువచ్చినా
పిలువు మటన్న వేత్రధరబృందము తోఁకొనితెచ్చి ముంగల
న్నిలిపిన వాఁడు భీతియు వినీతియుఁ దోఁప దురాపకోపచా
పలమున హుంకరించు నిజభర్తకుఁ గేలు మొగిడ్చి యిట్లనున్. 59

క. దేవర ప్రతాపగరిమకు, నే వెఱతుం గాని నిర్జరేంద్రుఁడు వెఱవం
డానంతమైన నిపుడే, మోవింతలుపుట్టె దనుజమూర్ధన్యమణీ. 60

సీ. దొర కాపులై కావ్యసరణిఁ దెల్పెడి కవీశ్వరులకు లంచపంచంబు లొసఁగి
సమ్ముఖమ్మననుండి చనుదెంచు సల్రాయసమువారి కాళపాళలు ఘటించి
బోనవెచ్చము గొంచుఁబోవు శచీదేవిదాదులకును బరిధాన మిచ్చి
పిలువ నేతెంచు వేగులవారి వెంటనే యరుగు నియోగుల ననుసరించి
కినిసి వాకిటివా రడ్డగించుకతన, నేనువచ్చినమాట దేవేంద్రుతోడఁ
దెలుపు మని యెంత వేఁడినఁ దెలుపరైరె, వినివినమిచేసెనోకాని వేల్పుఱేఁడు. 61

క. మనగురు వఁట నేవచ్చుట, వినెనేమో గ్రుడ్డికంటి వేలుపుదొరతో
వినిపించి యతనియనుమతి, ననుఁ గొని చని సమ్ముఖమ్మ న్నిలుపుటయున్. 62

సీ. ననుఁ గని పాట నిల్పినతుంబురుని జూచి యాతాన మీసారి యనుమటంచుఁ
గమలజోద్భవ సుమాళము చెందినాఁడవు వింతవార్తలు గలవే యటంచు
నీతని నంపరాదే యంచు సన్నగాఁ దెల్పువారలను గద్దించుకొనుచుఁ
గ్రేఁగంటఁ బల్కనుంకించు నగ్నని పట్టుగద్దిగ లెస్సయెగా యటంచు
సద్ద సేయక నిరుపమైశ్వర్యగర్వ, పటిమపవఁతులు జలకంబు పట్టియున్న
దనఁగఁ గట్టికవారింప్లకనిపికొంత, యంవఱ నటం మ్రమోయ నయ్యాసనమున.

గీ. మనగురుఁడు చేరి ననుఁ జూపి మనవి గాఁగ
నితని వీడ్కొల్పుఁ డన్న దేవేంద్రుఁ డొద్ద
నున్న గీష్పతిఁ గని కనుసన్న సేయ
నతఁడు నాదిక్కుఁ జూచి యనాదరమున. 64

క. ఏమోయి తాళకేతుం, డేమని పంపించె నిర్జరేంద్రుని కడకు
ద్దామక్షేమాహతసాం, గ్రామికుఁ డాతనికి శుభమె కదయనిపలుకన్. 65

గీ. చుఱచుఱను జూచి దొరనిన్నుఁ జూమువాఁడు, నంతలోననె నీవు నన్నడుగువాఁడ
వాబలా షాట్క్రొవ్వగాకంచు నేను, గోత్రపరిపంథితోఁ గొంకుకొసరు లేక. 66

క. తారారంభలు చక్కఁగ, వారనఁగా మెచ్చి దనుజవల్లభుఁడు నినుం

చేరుకొని వేఁడుమన్నాఁ, డారమణుల నొప్పగింపు మటుగాకున్నన్. 67

సీ. అలవాటు చేసికొమ్మఖిలమరుత్పాలకులఁ గూడికొని నిల్వఁగొల్వఁగను
నభ్యసింపఁగఁ జేయు మలజయంతునకు వేళ యెఱింగి వెండికాలాచి దాల్ప
దారికిఁ దెచ్చుకొమ్మారూఢిఁ బౌలోమి సైరంధ్రికాసదాచారమునకు
నలవడఁగా నేర్ప మచ్చరలకు మాఱువలుకక నీ బోనిసపాటులకును
దలఁపకమృతంబు వైజయంతంబు మఱవు, విడువు వజ్రాయుధముతోడిగొడవ యింక
నిచటనుండక వెడలి ర మ్మిపుడు దేవ, పట్టనం బేను దోరణకట్టినాఁడ. 68

క. అని నీల్గి నన్నుఁ దప్పకఁ, గనుఁగొనలం గొప్పనిప్పుకలు కుప్పలుగాఁ
గనుఁగొనుప్రథమునకు ప్పెఁ, గని దేవగురుండు రోషకలుషేక్షణుఁడై 69

క. ఓరీ మాదొర గోరిన, తారారంభలవిటావతంసులచేతన్
మీరజనీచరుఁ డగ్రజుఁ, జేరంజనుఁగాక యని వచించుచు నలుకన్. 70

గీ. వీనివెడలంగఁ ద్రోయుఁ డివ్వీటికోట, దాఁటునందాఁక ననుమాట నోటనుండ
నీటు వోమీటి గరువంబు మాటి యిటకుఁ, బెద్దపర్వున వచ్చితి పెసరువుట్టి. 71

క. ధారాధరవాహను గ, ర్వారూఢియు గురునిశాప మటులుండేఁ గదా
మీరజనీచరుఁ డగ్రజుఁ, జేరం జనుగాక యనుటఁ జెందితి వగలన్. 72

క. పాతాళకేతుఁ డాదృప్త, దైతేయుఁడు వీఁకఁ దమ్మదాలసకొఱకై
యేతెఱఁగున నేమయ్యెనొ, కో తెలియ దటంచుఁ దెలిసికొను నట్టియెడన్. 73

గీ. ఆరితేఱుటిల్లఁ గొందఱు చారవరులు, వచ్చినతిసల్పి కువలయాశ్వక్షితీంద్రు
చేతనైనట్టి పాతాళకేతు పాటు, తోఁపఁదెల్పినఁ దాళకేతుండు కనలి. 74

చ. ఒదవినశోక మాచికొని యుగ్రతరాగ్రహకేళికావశం
వదుఁడయి యింద్రు గెల్చుటకు వచ్చిననే మటుమీఁదఁగాదె నేఁ
డదయత నన్న రేంద్రుఁడు మదాలసకై కద భాసమానదో
ర్మదుని మదగ్రజుం బిలుకుమార్చెను దాని హరింతు నిత్తఱిన్. 75

గీ. కపటమునఁ దెత్తునాహంసగమన నదియె, ఱంగి మార్కొన్న నాతని భంగపఱతుఁ
బగయడంపక యున్న నీపగిది నెగులు, సైఁచవచ్చునె యిదియ నిశ్చయ మటంచు.

సీ. ఎదురిండ్లు ఫలుసాల లెనసివర్ణింపఁజాలిన మేలిపర్ణశాలికలు కొన్ని
యాగమాతంబుల యందలి యర్థము ల్ప్రకటించు కీరశారికలుఁ గొన్ని
హవిరన్నసంభృతమద్దివిజకోలాహలాంకములైన యాగవాటములు కొన్ని
దున్నివిత్తకపుట్టి యొన్నుల వేఁగున వ్రాలు నివ్వరిప్రాలచేలు కొన్ని

తోఁపు లోకకొన్ని తెలినీటిదోనలు కొన్ని, కొలఁకు లోకకొన్ని పెంపుడుపులులుకొన్ని
మొసవు లోకకొన్ని చేమంతి పొదలుకొన్ని, బెరయఁగఁ దపోవనంబుఁ గల్పించి యపుడు

గీ. తోడిదైత్యులు శిష్యులై కూడి వడువఁ, బేరు ముండవ్రుఁ డనుచుఁ గల్పించుకొనుచు
గొన్నిమాయలు మదిలోన నెన్నికొనుచుఁ, గువలయాశ్వుని పట్టన క్షోణిఁజేరె. 78.

ఉ. అంతట పౌరసారసదళాక్షు లుదారవిహారసౌధయూ
థాంతము లెక్కి కంటి రటవమ్మ మునీశ్వరుఁ డొక్కఁ డిమ్మహీ
కాంతునిఁ జేరి రాక్షసనికాయము చేత మదీయయజ్ఞమా
ద్యంతముఁ గోలు పోయితి నయా యని శోకనిపాతవ్యాకులతఁ జెప్పుచుండ చందముల్. 79.

ఉ. నిన్నఁగదమ్మ గాలవమునిప్రభు వెంబడి నేగి రక్కసు
న్వన్నియమార్చి రాచిలుకవంటి మదాలసఁ దెచ్చి యుద్వహో
త్సన్నతిఁ గోరి నేఁటికి ముహూర్త మటంచును నిశ్చయించె నీ
యెన్నిక చిన్నవోవఁగ ఋషీశ్వరుఁ డెక్కడవచ్చె నక్కటా. 80

సీ. తలవాంచి బెళుకుఁ జూపులు క్రేళ్లుత్రిప్పఁగఁ దెరమొఱంగుననిల్చు నొరపుఁజూచి
చెలికత్తె చేమెచ్చవలెనన్న సిగ్గుతోఁ దలఁబ్రాలువోయు బిత్తరముఁ జూచి
వ్రేలిమిఁ జెమరించు కేలనందెడు లాజ లందిచ్చునట్టి సోయగముఁ జూచి
కులదేవతకు మ్రొక్కు కొనువేళఁ దనపేరు వలుకఁ గొంకెడు ముద్దుబాగుఁ జూచి
ముచ్చటలు దీర్పపూనిక వచ్చియితనిఁ, దోడుకొనిపోవుచున్నాఁడు దుడుకుఁదపసి
యతని మాటకు మారాడఁ డయ్యె యితఁడు, డిందుముఖి రాజులకు సౌఖ్యమేదమ్మ

క. దార నయ్యెద నని [illegible]ము, రరయఁగ జను లెవ్వరైన నాపెనుబెడ ద
ల్పరికింపరు దారతనప్పు, న్సరవు ల్మతిక త్తివిూఁది సాములు సుమ్మీ. 82

సీ. మంత్రుల మర్మకర్మము లెఱింగెడు దారి కోటలు కాపాడుకొనెడు నేర్పు
తటికాపు చెడకుండ సరిగోరుకొనుకీర్తి యీతిబాధలు చెందనీని సొంపు
పరులయాలోచన ల్పరికించు గరిమంబు నర్థార్జనమువిూఁది యాదరంబు
వేఁటతోఁటలమీఁద విలసిల్లు నాసక్తి యొడ్డోలగం బుండు నొప్పిదంబు
తగిలిపికువీఁకుసేయ నుద్దండవృత్తిఁ, జెలఁగుటయె కాని మనసు వచ్చినమిటారిఁ
గూడితమిమీఱ సయ్యాట లాడికొనుచు, నడువఁ గూడునె మేదినీనాయకులకు. 83

క. అని యాడికొనఁగ మాయా, ముని వెంబడిఁ గువలయాశ్వమున్నాకిరయం
బునఁ జని యారాకొనుచుఁడు, గనియెం బత్వర్ణశాలికాప్రాంగణమున్. 84

గీ. అంత నమ్మాయతపసి యయ్యధిపపర్యఁ, గమ్మనమ్ముల దుమ్మెవదిమ్ముఁదోలి

మాన్మరపుఁ బుష్పవృష్టుల్ నెమ్మిఁ గ్రుమ్మరించు, తెమ్మెరలు గ్రమ్మ కమలాకరమ్ముఁ జేర్చి

గీ. అధిప నీవింక వచ్చిన యపుడె తొలఁగి, రక్కసులమాయ పద్మాకరంబునందు
వరుణజపమొనరించి యేనచ్చ్చ నునుక, నిచట నుండంగ వలయు నీవేమి యనక. 85

గీ. అయ్య నిను నమ్మఁ గూడ దేనరుగుదేరఁ, దామసంబైన జరగెన వేమొ నీవు
కాకయుండిన నిమ్ము నీకంఠహార, మిప్పుడన చిన్నినవ్వుతో నిచ్చుటయును. 86

క. జలదేవతకుం బ్రాంజలి, సలుపుచు నక్కొలన మునిఁగి జనపతినగర
స్థలమున నంతిపురంబున, నలరం బొడచూత డిగ్గియందేలుటయున్. 87

గీ. కుండలియుఁ దానునవ్వుచుఁ గూడియున్న, యమ్మనాలసఁ గని మంత్రియందమొంది
యమ్మనుజరాజు మానినీమాగ్న్ముగా చె, రక్కసులఁ దోలి భుజబలప్రాభవమున. 88

ఉ. అమ్ముని యంత సంతసము నంది యభిందితకార్యధుర్యరూ
ధమ్ముగ నీవివాహముచటుం జరగింపఁగఁ గోర్కె వేడ్క యీ
యిమ్మునఁ బట్టణంబు రచియించెద నాదు తపోబలంబునం
గొమ్మను బిల్వ బంపు మిటకు న్మఱుమాటలు పల్కకేమియున్. 89

గీ. అనిన మాటాడ వెఱచి యమ్మనుజనాథుఁ, డానవాలుగ నీకంఠహార మిచ్చి
నిన్ను వేవేగఁ దోడి తెమ్మన్న వచ్చి, నాఁడ రావమ్మ కుండలతోడఁ గూడి. 90

మ. అనియా మౌక్తికహార మిచ్చుటయు సాంద్రానందమున్ బొంది మా
సిని మేకోలునఁ గుండలానవనము న్వీక్షింప నయ్యంబుజా
నన కానిమ్మని పల్కెఁ గృత్రిమవిమానం బెక్కఁగాఁ జేసి య
ద్దనుజాధీశుఁడు తానదృశ్యుఁడయి చెంతం బోయి సంతుష్టుఁడై 91

వ. అత్తఱిం దటిత్తరుణభానువిరాజమానం బగు నమ్మాయావిమానంబు జలయంత్రంబును పమఁ బ్రవేశంబునకుం గమకించునంపకంబురకంబునఁ బోవుగా సెగిరి యొక్క పరిరథంబువిధంబున మంపగతిం జనుచు నొక్కసారి లకోరిధారి రివ్వున నిగుడుచు నొక్కతేప బొంగరంబు రంగున బిఱబిఱం దిరుగుచు నొక్కమాఱు గాలిపటంబునీటున నసియాడుచు నొక్కయెడఁ జుక్కతెగిపడ్డ విధంబున డిగ్గుచు నొక్కచోటం బుట్టచెండు వడువున నున్నరంబునకుం బోవుచు నొక్కవంక జీనుదిగవైచిన కప్పలి చొప్పునఁ గదలక నిల్చుచు నొక్కపరి బైరిడేగ యొయ్యారంబునం దిర్యక్ప్రచారంబుఁ జూపుచుఁ బోయి మేరుధారుణీధరంబున నిబిడాంధకారబంధురం బగు నొక్కబిలంబున దమాలతాలతక్కోలరసాలసాల ముఖసాలవిశాలం బగు వనంబునం బునఃపునర్వర్ధమాన గిరిఝరీవితానంబులకు నుబ్బగన్పించు పన్నీటిపిల్ల

కాలువలవలం బ్రోదిసేయు జాదివిరిదేనియవాక వెంబడిం బోయికొనిన పోఁకమ్రాకు ల కట్టకడపట నెట్టుకొనిన యిందుకాంతవేదికాభ్యంతరంబులతోడి గురివిందపందిళ్ళ నొరసికొనియున్న తిన్నెని మాగిపోతివన్నియలఁ జెన్నగు చవికల సమూడుకొన్న కన్నెసుపహాన్నగున్నలఁ బెనఁగొన్న నవీబియ్యపుజాతికి నాధారంబగు గొప్పకెంపులు బ్బ చప్పరంబులం గప్పికొన గుజ్జుమావులక్రేవలఁ దమ్మితావులకుం దావులైన తెలినీటి కేళాకూళినంటికొనిన యానంటులవలనం దొరఁగు కప్పురంపు రసలుం బాఱు కాలువకూటంబు డిగ్గిచను మెట్లసగ్గఅ నగ్గలంబగు నీలంబు నిగ్గులు గగ్గోలుపడు కోనపాదిరిం గౌఁగిలించిన పొగడగుంపుల నట్టనడుమఁ బట్టుగఁ బొదరిండ్లఁ జుట్టఁబడియున్న బిత్తరం బగు క్రొత్తతుత్తియంపుఁ బడుకటింట నపరంజిగొలుసులం జెలంగు తూఁగుటుయ్యెలచేరువకుం జని యద్దనుజపీరుండు నిజాకారంబుతో నయ్యిష్టఱం దగ్గృహాంబున ముచియాతిఘోరాకారలగు దైతేయభామలం గాపువెట్టి కృతకృత్యుసంగాఁ దలంచుకొని యాక్షణంబున. 92

చ. మునుపటిపారికాంక్షి వినయుం భజియించుచు నంబుజాకర
బునఁ బడి తేలి యోనృపతిపుంగవ నీభుజసారగౌరవం
బున జపమెల్లఁ జీఱెఁ బొలివోవక నీవిఁకఁ బట్టినస్థలం
బునకయి పొమ్ము రాజునకుఁ బోలునె యాశ్రమవాసఖిన్నతల్. 93

చ. అని యనుపన్ హసావని నృపాగ్రణి యమ్మునిలోకచంద్రు వీ
డ్కొని తన తేజి నెక్కి గిరికోటులఁ గాననవాటులున్ మహా
జనపదములున్ వనంబులును జయ్యనఁ దాఁటి పురంబుఁ జేరి కాం
చనసుమదారమై తగుహజారమునం బ్రమదారు చేరఁగన్. 94

క. తురగంబు డిగ్గి యచ్చటి, పరిజనుల న్వీడుకొల్పి పార్థివచంద్రుం
డరిఁగి గృహాంతరమునఁ ద, త్తరుణీమణి లేమి నద్భుతసమగ్నుండై. 95

ఉ. అక్కట యెందువోయెనో మయూరపు సంచుల ముద్దుగుమ్మ యే
చక్కని దాఁగెనో కలికి చక్కనలెక్కనగుబ్బలాఁడి యే
దిక్కననున్నదో సొలపు దేఱెడుచూపుల ఘోంతకారి యే
యిక్కన నిల్చెనో యొరపు నీనెఱు చిల్కలకొల్కి డైమా. 96

ఉ. ఆనవ లామెఱుంగుఁదొడ లాకరసంగటన మాచుసోయగం
బానెరు లామిటారితెరు లాముదిసంబునఁ బల్కుపాటనం
బానొస లామెఱుంగుబుసలా తెలివయ్యెదచక్కఁ జేర్చుపొం

పేశలినాక్షికైనఁ గలదే కలరే యిటువంటి కామినుల్. 97

సీ. గిలుకుబంగరుమెట్టియలు జాఱఁగాఁ జక్కనలవరించెద నంచునిలిచినిలిచి
బయట నున్నది చిల్కపంజరమున నుంచి మఱివచ్చెద నటంచు మరలి మరలి
యతివ యల్లపుడేమి యంటివే యేచిరాకయియుంటెఁ దెప్పనుం జడిగి యడిగి
చెమటచేఁ దిలకంబు చెదరెనో యని వింతసోలపుతో నద్దంబు చూచి చూచి
ప్రొద్దు గడపుట కని తోడి పూవుఁబోఁడు, లపరనైనంగఁ దనమాపయానగరిము
యినుమడింప మదీయమోహనగృహంబుఁ, జేరు టెన్నఁడో యానీలచికుర నికర. 98

శా. కైజాచేసినబొందుమల్లె విరిబ్భంతిదాజగాజోదు తే
జీజాతం దలవాంచి బోఁటిచెఱఁగుం జేఁ గట్టిగాఁ బట్టి ను
న్నాజుం గంబము చాఁటున న్నిలిచి క్రేఁగంట న్ననుంజూచు నం
భోజాతాక్షిని సెజ్జకుం దిగుచు నేర్పు ల్గల్గునే మీఁదటన్. 99

క. ఎక్కడి యాలోచన యిది, యక్కట యక్కలికి యున్నయప్పటికిఁ గదా
యిక్కోరికియని ననవి, ల్మొక్కలిదొరవిరిలకోరి మొనకుం దలఁకున్. 100

సీ. పాడఁగనవచ్చు నాప్తులవేళఁ గాపంచు నవసరంబులవార లడ్డగింపఁ
బనిగల్గియుండినఁ దనకు మంత్రులకు లేఁజిగురుఁబోఁడులచేతఁ జీట్లు నడున
నిదియేమొ కడువింత గదయంచు నవరోధ బిసరుహాక్షులు గుసగుసలువోవఁ
గొలువుకూటమునందుఁ జెలఁగెడు సింగంపుగద్దియగవిసెన గైకొనంగ
బొక్కసంబులు పెనుబీగములు భజింప, సుషిగములవారలకు నాటవిడుపు గాఁగ
నోలమును మాని మేదినీయువతిజాని, యింతి భావించు నంతఃపురాంతరమున. 101

క. ఈకరణి నన్నృపాగ్రణి, యేకరణీయములు మాని హిమకరవిలస
ద్రాకలకు న్వలిదెమ్మెర, రాకలకుం జాలిగొని విరాళిఁ బడంగన్. 102

ఉ. ఆతని నేస్తగాండ్రు భుజగాత్మజు లవ్వగ లెల్లఁ గాంచి య
య్యో తమవంటివార లిటు లుండియు నీదొర నీదురంతచిం
తాతను తానితాంతహృదయవ్యథఁ గూఱఁగ నూరకున్న సం
గాతులమౌదుమే యిపుడుగాక మఱెప్పటికీ వయస్యతల్. 103

క. అని యయ్యిద్దఱుఁ జని తమ, జనకుం డగునశ్వతరుని సమ్ముఖమున న
జ్జనపాలువిరహవేదన, వినిపించి తదార్తిమాన్పవే యనివేఁడన్. 104

చ. తనయుల స్నేహబాంధవవిధానము లెంచి నరేంద్రుఁ డంతమా
ఘునుఁ డటువంటివాని కుపకార మొనర్చినఁ గీర్తిఁ జెందదే

యని రజతాద్రికిం జని నగాత్మజతోఁ జదరంగ మాడు రు
ద్రుని గని మ్రొక్కి కుండలివరుం డటు నిల్చిన నాదరంబునన్. 105

గీ. అంబికయును నితం డెవ్వఁ డనుచు నడిగి, యధిపుఁ డశ్వతరుండు గాఁడా యటన్న
నీతఁడా యశ్వతరుఁడు సంగీతవిద్య, దొడ్డవాఁడంట యనిన రుద్రుండు పెలఁగి.

క. వెనుకం బురుహూతు దెసం, దనతంబురవలన గెలిచె నానాగతుల
న్మనతుంబురు నీవెన్నడు, వినవంబురుహాక్షి నేఁడు విను మనిపలుకన్. 107

గీ. మంచిది సగటుపై నిదె మంత్రికావ, లున్న దీచదరంగ మిట్లుండనిమ్ము
వెనుక నాడుదమని సతి వనజనయన, యభిముఖంబుగఁ గూర్చున్న యవసరమున. 108

గీ. ఛార నారాక ఫలియించె నంచు నెంచి, యచటఁ గూర్చుండి యయ్యురగాధినేత
గవిసెన సడల్చి తంబుర కలికి పైఁడి, బిరడలు బిగించి శ్రుతులెల్ల సరిగఁ గూర్చి. 109

క. రాకాశశాంకవదన ప, రాకా యిటు నీకు మ్రోల రహిఁ గనిపింపన్
నాకుఁ దరమౌనె యైనం, గాకుండిన నీకు ముద్దు గద యని యంతన్. 110

సీ. శ్రుతితోడఁ గూడి మెప్పులు రాజిలంబుగ సంచునందగ నాలపించు సొంపు
గమకయుక్తమైనను గుక్కవిడునక హొయలుగా నవకదంబుగఁ దానము నెఱనేర్పు
పరరాగముల వింత సోరనీక వ్యాప్తిమై మించు గారాగంబుఁ బెంచు వింత
తాళంబు తప్పక తనువు గదల్పక భావుమీర పదంబు పాడుదారి
ఎదనెదఁ బరాకు వినుదను హెచ్చరింపు, మీరు మెచ్చిన యీవిద్య మీకొసంగు
నట్టిదని గర్వపరిహార మలర నతఁడు, గాణ వవుదనదుష్టమార్గము నటించి. 111

గీ. గోఁటి వాద్యంబు కిన్నరమీటు బడ్డి, వాద్యము రబాబు వగలు సర్వంబు మెరయ
దురుసుగతి జూపఁ బార్వతీ తరుణి మెచ్చి, జాజ సరిగంచు పయ్యంటఁ జక్కఁ జేర్చి

ఉ. ఎక్కడి నారదుండు మఱి యెక్కడి తుంబురుఁ డోగిరీశ యే
దిక్కునసైన నీవిధము తేటపడం గనుఁగొంటలేద యే
పెక్కువ తప్పులెంచుఁ గనిపెట్టుక యుండితి మెందుఁ గానమ
మ్మక్కజ భాసు మేలు హవుపంచు ఫణీశ్వరుఁ జూచి యింపునన్. 113

క. నరమ దుగుమునిన గంగా, సరసిజముఖి యీసుతోడి జంకెన చూపుల్
బొరసిన మొగంబుఁ ద్రిప్పెఁ, గిరిజకు డెందమున వింత కినుక జనింపన్. 114

ఉ. అమ్మక చెల్ల యెన్ని వగ లద్దిరనాయకుఁ డొద్ద నుండఁగా
నెమ్మొలు గాక యేను నదమిచ్చెద నంటివి పెడేటిమాట దో
సమ్మొసు మీ నగుచు ... నాగు ... లేక యే

కొమ్మని యీఁగఁ జెల్లునె యకుంఠిత చాతురి గల్గియుండినన్. 115

గీ. అని పలుక నెంత లేదామృగాక్షిమాట, వినకు మడుగుము పరమిత్తు విభుఁడుతనకు
నంతచనువిచ్చినాఁడన నవ్వధూటిఁ, జుఱుకు చుఱుకునఁ బార్వతిఁజూచెనపుడు. 116

చ. ఉరగవిభుండు లేచి కుధరోద్భవఁ గన్గొని యమ్మ మేదినీ
వరుఁడు ఋతధ్వజుండు భుజవైభవశాలి మదాలసాసతిం
బరిణయమాడునంచు నిజమందిరమం దిరవొంపఁ జేసి త
త్తరుణి వయస్యఁ గుండల వితావితఁ గావక వంతఁ గుందెడున్. 117

గీ. వారి నిష్టరి రప్పింపవలయు ననిన, గిరిజ, కానిమ్మనంగఁ దత్సరసిజాక్షి
కాని కుండల రాపంచు గంగ పలుక, నభవుడిద్దరియందు మధ్యస్థుఁడగుచు. 118

గీ. మంచిపహిరాజ రెండునాళ్ళుంచుమించు, గాఁగఁ గుండల చనుదెంచు గాకయిప్పు
డమ్మదాలస వచ్చు నీవలుగుమనిన, నదియపదివేలుగా నెంచి యాతఁడడఁగె. 119

ఉ. అంతటి లోననే యలమదాలస నిద్దురవోవ నయ్యుమా
కాంతుఁడు మాయచే నురగ కన్యాగృహంబున నల్పనాతఁ డ
త్యంతముసంతసించి తనయాత్మజగా నురరీకరించి య
య్యింతిని గొల్వ వెవురు మృగేక్షణల న్నియమించి యత్తరిన్. 120

చ, తనయులఁ బిల్చి మీరు వనితామణి వచ్చిన మాటఁ దెల్పక
జనపతిఁ దోడి తెండనఁ బ్రసాదమటంచును వారలేగి గ్ర
క్కున నడిగంపుఁ జేడియలు కొందఱు గొల్వఁగ నున్న భూవరుం
గనిన నతండు నిండు కుతుకంబునఁ జేరువ నుంచి యిట్లనున్. 121

ఉ. ఇన్ని దినంబు లంబుజవనీశుఁడు చెంవొనయిండ్లలోన ర
క్కొన్న మదాళిఁ బద్మగృహకోటికిఁ బొమ్మని తీపరించు నం
తన్నుఁ జేరవత్తురుగదా యొక యామము బోవుదాక రా
కున్న తెఱఁగు మాకు విన యోగ్యము యేని వచింపుఁ డింపుగన్. 122

క. పరబల ఖండన మంత్రా, చరణమొ గృహకృత్యగత విచారమొ కాకో
పరపుత్రులార మీ, రిట కరుదేరక యుండ నాఁగినది యెయ్యదియో. 123

చ. అనుడు భుజంగరాజ సుతు లట్టివి యేవియులేవు లెండు మా
జనకుఁడు మీగుణంబువిని సంతసమంది మిముం గనుంగొనన్
మనమునఁ గోరి తాన పయనంబయినన్ వలదా యిలాబలా
రిస దోడిఁ దెత్తుమంచు వివరించుటకై తడవుంటి మిత్తరిన్. 124

క. అతీసనఁ బలుకఁగరా, దో తెలియదు గాని శౌర్యధూర్వహానీసం
గాతముచే నీమన్ననఁ జేతం దొడి తేరఁ బ్రతినఁ జేసితిమనుఁ డున్. 125

క. మాయురె తా రానలెనా, యాయెడకే నరుగుదెంతు నాయిల్లనఁగా
నీ యిల్లనగా వేఱా, వోయఁగ రా విట్టులైన భువి సఖ్యంబుల్. 126

మ. అనుచుం గట్టికయింతి దేవర పరాకయ్యా పరాకంచు బో
రన ప్రోయన్ వలెవాటు కుప్పటి చెరం గల్లాడఁగాఁ జేఁగటా
రిని లోభాగము నూఁది నిల్పఁదగు వారి న్నిల్పుచున్ మేలికుం
దనపుం గద్దియ డిగ్గి నిల్చె నురగేంద్రపుత్త్రి దివ్యాకారతిన్. 127

చ. నిలచి పరావనీప రధి నీరథి మంథనమందరాద్రి య
బ్బలి యయుఁడొకంత పాప దొరపట్టులు తెన్నెఱిఁగించుచుండఁగా
నలరుచుఁ నేఁగి కాంచె సికతాంచితతీరసమేతకేతకీ
తిలకగ చంచరీక సుదతీ కృత గీతిక గోమతీనదిన్. 128

చ. కనుఁ గొని చిల్వరాచకవ గ్రక్కున నన్నదిఁ గ్రుంకఁ జేసి తో
డ్కొని చనఁ నేఁగి చూచె ఫణకోటి మణీఘృణి వేణి కోర్థ్వ దీ
పనికర భ్రూత్రపాచరిత శౌర్యకేళి విధూత రత్నరు
గ్జనిత నవస్మితానన భుజంగిక యొక్కపురంబు ముందరన్. 129

చ. అపటి వియోగిభోగి జలజాక్షులు మారునిఁ బ్రాసి కొల్చినో
నచలితభక్తిఁ జందురిని యందమెఱుంగమి మున్ వసుంధరా
రుచి గరుణావలోకులు పరుల్ చెలి నీ యొక మబ్జునంటిపన్
వచనము లంతలోఁ దలఁచి వ్రాయుదు రున్ముకురాగ్ర వీక్షులై. 130

క. ఈకరణిఁ జూచి డిగు నా, భూకాంతున కొక్కయింపుఁ బొడమించెను వ
ర్ధీకర నైశాకర రు, చ్యాకర ముక్తానుషక్త హర్మ్యతలంబుల్. 131

సీ. తీవయుయ్యేల లూఁగు పూవు బోఁడులపీఁగు కొప్పు చీఁకఁటిఁ డాఁగు కోర్కియొకటి
నును పుట్ట చెండాడు వనితల యరవీడు జిలుగుపయ్యెదఁ గూడు చెలువ మొకటి
యలయంచ నడలించు చెలుల జంకెనమించు బెళుకుచూపులముంచు బెరికి యొకటి
పూవుబంతులు రువ్వు పొలతుల తెలినవ్వు కలికి వెన్నెల క్రొవ్వు గనుటయొకటి
గాని మఱియేమి వలదని కంకణంబు, గట్టుకొని సల్పుపతి దృష్టిఁ గ్రమ్మరించి
చలిది గట్టించి త్రిప్పె నిస్తుల సువస్తు, నవ్యసంతోషకరమగు నాగపురము. 132

ఉ. ఇట్టునలెఁ జూచుచుంజను నరేశకు శేషయబాణు చూడ్కి న

న్నిటమగుడించెభోగి పరిణీ తరుణీ ఫణ ధోరణీ నవా
ఘటిత మణీగణీభవపకంప ఘృణీత వియచ్ఛిరంగ మో
త్కట ఝరిణీ సరోజ మతికారి నమేరు వహీర మారుతుల్. 133

క. అవ్వనముఁ జేరి మున్నవ్వు, జవ్వనపున్ రాచకొమరుఁ జల్లనిపుంచుం
దువ్వరల నిన్వటిల్లెడు, పువ్వుంబొదరింట నునిచి భుజగ కుమారుల్. 134

క. ఇట నుండు మేము నీవ, చ్చట యురగేంద్రునకుఁ దెల్పి శోభనలీలా
ఘటనాపూర్వంబుగ ని, చ్చటి కేతెంచెద మటంచుఁ జనుటయు నతఁడున్. 135

మ. వెలుఁగు ల్గాఁపగు మిన్నతీవియల కీవిన్ రాయు పన్నీటికా
ల్వాల తుంపుర్లకు మారు గాఁబలెఁ జలద్వాసంతికా నూన ని
ర్మల మారందకణాళి జారి తనపై వ్రాలంగ రాయంచ లె
క్కలు ఝూడించినఁ గ్రమ్ము తెమ్మెరల రాకన్ హాయి మంచున్నెడన్. 136

చ. హడపము వీణ కిన్నెర హిమాంబువు నించిన గిండి చల్వపా
వడలుఁ గురంగనాభియు జవాదియుఁ బట్టుపునుంగు వీవనల్
ముడి విరు లద్దముల్ సురటులుం దెలిపంతపు దివ్వెల్ ముదం
బడర ధరించి యూడిగపు టబ్బురపున్ వలిగుబ్బెతల్ పగన్. 137

సీ. జిగిచాలు పగుకీలు చిగురాకునకు బ్రాఁకు కలికికోయిలలకుఁ గౌలు పనుప
నెలగోవగలమోము తెలిపమ్మిఁగల తుమ్మెదలకు నమ్మిక కమ్మలలవరింప
నెఱికప్పుఁగను కొప్పుఁ నెరిమబ్బునకు నుబ్బు నెమలికిఁ ద్రోవబత్యములనునుప
నునుమోవిపైకెవి ముసు బింబ నికురుంబములకేఁగు రాచిల్కకొళ్ళవులియ్య
లెనగవు డాలు కైదండ పూనుచూపు, తళుకుచే బ్రొముక్కఁగోనెడు ముత్యాలశెట్టి
పేటి పాపటబొట్టు తుంపిళ్ళ గుజ్జియ్య, నచటికేతెంచె నొకచకోరాయతాక్షి. 138

సీ. కావలిఁగనునింతి కానుకిచ్చినబంతిఁ గనుసన్న నొకకన్నె గైకొనంగ
దెలిచూపు గమి తారసిలుచు నిల్చిన యంతఁ బడతులిద్దరు బరాబరులు సేయ
నగుమోము జిగితమ్మి నిగుడు ఘర్మము గ్రమ్మి నంతుకై చెలువపానడలు దండువ
తొలఁగు బంగరురంగు జిలుగు పయ్యెదకొంగు సకియ యొక్కతె చక్కసవసరింప
కట్టిక మిటారి మొకరి చెల్కత్తెగములఁ, బొడఁగనఁగఁజేయ బంగారుపొంతి మెఱుఁగు
టరిగె గుంపుల నీడ నొయ్యారమొసఁగ, వచ్చి పుష్పాపచయకేళివాంఛ దేలి. 139

క. మడమఁబడు నిడుపవాలిక, జడ నడుమున జుట్టిపైట సరిగె చెరంగుల్
బెడఁగుఁ జనుదోయి పొడ లే, ర్పడ బిగియించుచు ననుంగుఁ బడతులుగొల్వన్. 140

చ. చిలుకలలోన చిక్కులయి చెల్వపుటంచల లోననంచలై
తెలివిపొసంగు తీవియలఁ దీవియలై సరసంపుఁ బల్కులన్
గులుకునడల్ పసిండి తలుకుల్ గలమేనులు గానుపింపఁ జే
తుల కసివోవఁ దేనియలతో ననతోయము లెల్ల గిల్లుచున్. 141

సీ. కలిగొట్టుఁ జేరబో కళి గొట్టు సేయునీ బీరమేమిటికి జంబీరమదిగొ
సిందువారము తెనె సింధు వారము లేని పైరుగాఁ దేఁటి కింపై రుచించుఁ
జూతము పదరమ్మ చూతము మదవతీ గానంబు లచ్చోట గానరావె
రమ్మ మారుని గుడారమ్మ మారు నిజమ్మ గుంపు వోటుల గుజగుంపు లేల
యీరమా యీరమానీతి యీ ప్రసూన, వాసనల్ వాసనల్ వంకనందికొనఁగ
పాటలాపాటలాళిచేపడియె ననుచు మాటకే మాటకేమి లేమావివిరులు. 142

క. అని జవ్వను లవ్వనిఁ గ్రొ, వ్వునఁ బువ్వులు గోసి కడు దవులొల్కను నవ్వుల్
నన రువ్వులు కొంపరు మెచ్చని చివ్వలు నివ్వటిల్లఁ జని యవ్వలనన్. 143

సీ. కంబముల్ గాన నిల్కడఁ గన్న పోఁక బోదియలపై నడిగాగ డీటుకొన్న
యలదీన చాలు వాకిలి సొచ్చి లేమావి గుమురుల క్రీనీడఁ గొప్పకెంపు
లలితంపు మెట్లఁ గేళాకూళికవ్వల జలయంత్రములవీఁగు చలువ గాన్పు
గదియంగఁ గలువ మేల్కట్టు పూవుల గప్పు సాంబ్రాణి దూపంపుజలపసాళి
నరసిఁ బురివిప్పఁ జను నెమ్మి నాస గలుగు, దాని గాఁజేసికొనెడి చిత్తరువుబొమ్మ
చిలువచెలువంపు జడ గుంపు సొలపు నింప, నీఁడు గాననియొక చిన్నిమేఁడమీఁద.

క. చెలునైన పసిడిగద్దియఁ, గొలునై నలువంకఁ జెలువ గుంపులు గొలువన్.
బలువైఖరి పావడ నెల, తలు నైవఁగఁ గన్నెయున్నతఱినటమున్నన్. 145

శా. ఆజన్మస్థిర ధర్మకర్మ నిపుణుం, డారాజు రాచిల్కమే
త్తైజీ జోత్తైదొక పొంతకాఁడయి తనుం ద్రిప్పంగ నయ్యాతి య
య్యోజన్ వచ్చుట గొలెఁ బూపొదలలో నున్నట్లు వీక్షించి యా
రాజీవేక్షణ వెంటనంటఁ జని గారామార సౌధస్థలిన్. 146

క. వలభిన్మణిగణగుంభిత, వలభిం ద్రుచి తమంబు వలఁగొని పొదువన్
జలదాచ్ఛాదితుఁడగుత, మ్మలదాయ యనంగ నిలిచి ముదితం జూడన్. 147

శా. ఏకైకాంగవిలోకనాకల నతుష్టైకాంత సామంత భా
వాహూతంబులు తద్విధాత్మరచనా త్యార్చర్య గాఢాప్త మూ
ర్ధాకంపంబులుఁ దత్సమానకృత మానాధీన నానావచ

శ్రీకంబుల్ మహిపాలలోకములు నారీమాళిపై ప్రాలుచున్. 148

చ. అలికచ కావిమోవి బెడఁగానెడు తేనియ సోనవానలన్
నిలిచి శరీరకాంతి ఝరిణీ పరిణీ తమలై కుచాచలం
బులఁదప మాచరించుచును మున్న వరోరువిలాసిరంభతో
గలసిన కొంతపో విభుముఖంబుఁ గనున్ నృపవీక్షణావలుల్. 149

క. మినుకు చను గుబ్బగుబ్బలి, కొననుండియు గాఢనాభికూపంబునఁ గ్ర
క్కున దుమికి నెలవు మఱిఁ గనుఁ, గొనమిన్నపుచూపులుడ్డుకుడుచు మవెఱలెన్.

గీ. కలికిలేగొను నిలువెల్ల కల్లయగుట
వెస నవ్యశ్యాంజనంబు సెవించెనేమొ
నెగడపటులయ్యుఁ బతిదృష్టి నెనుకఁ దొడఁగె
వెఱచువారలఁ గనుఁగొన్న వెంటఁ బడరె. 151

క. ఈనటనఁ జూచి నివ్వెర, గానఁ బడెన్ రాజహంస గమనావృత్తిచే
మానసము మానసముగా, నానరపతి యతిశయప్రియంబు దగంగన్. 152

సీ. శాబాసు ననచెండు జిగిఁ జెండుచనులాండు గబ్బిగుబ్బలిచాలు గొబ్బఁ జాలు
హాయిసరే నెఱిమించు సచలించుకనుమించు కమ్మపమ్ముల మేలు గ్రుమ్మఁజాలు
చాగురే విరిపువ్వు సరిరవ్వు చిరినవ్వు తొగరాచ జిగిజాలుఁ ద్రోవఁజాలు
మాయురే యళిపెంపు మరపింపు నెరిగుంపు మేలినీలపుడాలు వేలజాలు
మెలుసంపంగి దండలు డీలుపఱచు, కెలునునుపూలతీగెల వ్రీలజాలు
వాలుగల డాలు దొరచేతి వాలుకలువ, వాలుగాబొలుఁ దలఁప నీవాలుగంటి. 153

చ. అనికొని యాడి చేడియ నొయారపు రాశిని జేసినట్టి య
వ్వనజజుచేతికిం బిరుదు వైవఁగవచ్చుఁ గదయ్య దీనిప్రా
పున ముద మొందు కెంపలిరు బొందళిపుందొర మాచు వారలన్.
వెనుకొని పూవుటంపరలఁ బెంపరలాడకు మన్నమానునే. 154

శా. ఔనేకా మునుపెన్నఁడో చెలియ చాయంజూచి నట్టయ్యెడున్
గాన న్స్వచ్ఛ మదాలసావయవ రేఖావైభవం బింత యే
లా! నామాన స విూలతాంగి పయి లీలాడోలికాకేళికా
శ్రీనైపుణ్యముఁ జూపఁగా హవణుఁగాంచెం దద్గుణాలంబమై. 155

మ. వరభామాంగము మించుఁగా నితరముం బాటించకే మన్మనః
స్థిరహంసం బది మానసంబుగను రీతిన్ నాతి నీక్షింపుచోఁ

గరముత్సాహముఁ జెందిపొంగెడు నదేకాదా మహాచిత్రమై
యిరవొందెన్ మదినాకు నాకె వెరగయ్యెంగంటివే యిచ్చటన్. 156

క. ఐనప్పుడే మదాలస, గానోపుఁ జుమీ లతాంగి కాకుండినఁ దోఁ
గానీ కాకుండు బలా, యీనిగనిగజిగులు గందుమే యెందైనన్. 157

సీ. మోముచాయయె కాదు ముద్దుపల్కులలోని తతితీపు మెడగుల్కు దానివగయె
మోవి కావియ కాదు మఱిపెంపు సొంపుతో నాను జంకెన చూపు దానివగయె
పలుసోయగమె కాదు పచ్చిదేరఁగ నాఁడు తరుణిపై బొమముడి దానివగయె
మోముచాయయె కాదు ముద్దుమాటకుఁ జెక్కులోనిండు లేనవ్వు దానివగయె
అన్నియును నాయెఁగా యీమృగాయతాక్షి, యదిగొ గూర్చున్నదుం బ్రలీలాంబుజంబు
నలుగి యొల్లని మూర్కొన్న చెలువు దాని, వగయె కావలె బాపురే వనజజన్మ.

క. అని సమవస్తు నిరీక్షణ, మునసరి సేయంగ బుద్ధి పొడమి తలఁచి యా
జనపతి రతివిపరీస్పృత. మనమతిచంచలముగాఁగ మఱియుండవలెన్. 159

గీ. ఇది మదాలస యగునేని యిచటకెట్టు, లఱుగుదెంచెనో దీని ప్రాణంబులైన
యల్లకుండల యిప్పుడే మయ్యెనొక్కొ, వీరికెడఁ బాయనలసెనో విధికృతమున 160

సీ. అలనాఁడు మందరాహార్యకందరభాగమునఁ గుంపఁగాఁ బలాశనకులాగ్ర
జాతు మాయామాతి విఖ్యాతు భీతామరవ్రాతుని పాతాళకేతుఁ గూల్చి
ప్రమదంబుతోఁ దేజిపైకిరమ్మన నాలుగడుగులు పిఱుదన నఱుగుదెంచి
యటు నిల్చి మురిపెంపు టల్లికసిగ్గుతో గొరలు కొంకునఁ బైట కొంగు నేల
నలమి యాకాంత వింత దైన్యంబు నెట్టి, కొనఁగ ననుఁ జూచి దానిఁ జూచిన నెఱింగి
పనితతోఁ గూడ దాని నా వెనుకనుంచి, తోడి తెచ్చితిఁ గాదె మత్పురమునకును. 161

ఉ. అంబరవీధిపైఁ గువలయాశ్వము మీఱి లకొఱి కొలవే
గంబునఁ బోవ వెన్నువెనుకం బడుదాని వశంబుగాకరాఁగ
గంబున దాని మోవిపలు గంటొనరింపక దానిపాలభా
గంబునఁ జిందులాఁడు నలకంబులు దీర్పక మోసపోదునే. 162

చ. విడివడి రువ్వనన్ గగనవీధికి గుఱ్ఱము చౌకళించినన్
వడకుచు గబ్బిగుబ్బల మొనల్ వెసవెన్నున నాఁటి రొమ్మునన్
వెడలఁగ గోలతుంగె భయవిహ్వలమై ననుఁ గౌగళింప న
ప్పడఁతి మనీయ వేగ రసభంగ మొనర్చె భయంబుఁ దెల్పుమన్. 163

సీ. ఎదురుకోవలె నంచు నే తెంచు నున్నెవారలఁ జూచి దవ్వు దవ్వులనె తిరుగ

దొరలు వచ్చిరటంచుఁ దిరుగు త్రొక్కుళ్ళ నియోగు లొక్కొకచోట నొదిగినిల్వ
నలయమాత్యులునిల్చుటపసి పాఱులను గంచుకిముఖ్య మొకముఁ జూడక యొతలుమ
గట్టికవాని యాగ్రహవృత్తిఁగని పౌర లంతంత సన్నఁగ నణఁగుదేర
నభ్రయానంబు వీడి హయంబు పురముఁ, జేరనీనారి తిరిగియాచెలువ నడుగ
యదియు నావల్లఁ దెలిసి యియ్యధిపవర్య, కటకమని తెల్ప నడిగితిగా దెపుడున్..

క. అటువంటి కూర్మికత్తియ, కుటిలాలక నెడసె నేమొకో యదివిధిసం
ఘటనము గాఁపలె నీవలఁ, గటకట యీకార్యమెట్లు గావించఁబడెనో. 165

క. ఆనిపతితలపోయఁగ నిం, పున వీణియలందు గీతముల్ వడిఁ బలికిం
చినగతి వినఁబడె నిద్దఱు, వనితల యన్యోన్యకలహ వాచాప్రౌఢుల్. 166

సీ. చనవరివలె నెందుఁ జనెదు వద్దములేక మాకును నొకయుద్దమా మృగాక్షి
యంతటి దొరసాని వగుదు వెవ్వతెవీవు, తెలియదే యింద్రునికొలువుదాన
నతనిఁ గొల్చిన వారలరయ నెంపరులేరు వారిలో నెంచఁగ తారగానె
యిటు నిల్వ మెవ్వతె వైన నేమిభయంబు నిలువదీరదు పోవవలయుమాకు
యెంతవేగిర కత్తెవే యింతికాన, మామగునగొల్వ వచ్చితి మోమిటారి
యేరిఁ బోలుదు కొలిచినవారిలోన, సుదతి యాకారగరిమంబు చూచికల్కి. 167

క. అనుకలకలంబు చెవిఁబడఁ, గనుసన్నె యవసరంపుఁ గల్కిమిటారిన్
వినిరమ్మని చెలిపంపినఁ, బనివిని యదివచ్చి వినయపరవశయగుచున్. 168

చ. సముఖమువారిఁ ద్రోచి బురుసాపని చీరజరీచెరంగు వ
క్త్రమునకు మాటుసేయుచుఁ బరాకు లతాంగి సురేంద్రు కొల్వుబో
గముపఁట వేరుతార యనఁగా నుతిఁగన్న మిటారి యొంత గ
ర్వమొ యిటుచొచ్చి రానవటి వాకిటి కావలి చెల్వ నిల్పెనన్. 169

క. వారల జగడపుమాటల, తీరిది వేఱుమిలేదు దేవి యనఁ గఁగ
న్యారత్నంబును విస్మయ, మారంగను గొమ్మనిక్కమంతయు వినుచున్, 170

గీ. ఎదురుగానేఁగి యానెకా యచట నిలిచి యెంతవింతనటించితి విందువదన
చాలురావక్కయనుచుఁ గెంగేలు వట్టి, తోడుకొని పోయిబంగారు మేడమీఁద.

చ. కలప మలందుచొ నొలుకు కస్తురి చిందులచేత ఘుమ్మనన్.
వలపునెఱుంగు బంగరు తివాసిపయిన్ దగునొక్క రంగుకే
ల్సలువు పరంగిలాగి జిగిచొక్కపుఁ గద్దిగ మీఁద నిద్దరుల్
దలగడఁ జేతుబూఁది చిఱునవ్వులతో వసియించు యున్నెడన్. 172

గీ. రాజముఖి కొంతవడికి దారానఘూటి, సొగసు నెమ్మోము దప్పక చూచి పేర్మి
నువిద నీ వెంత కొంచక త్తెవె జయంతు, గాపు జేసిన గరితవు కావె నీవు. 173

క. అనిపల్క నందులకు బ, క్కున దారయు నవ్వ నచట హారజూటననీ
వనితామర లోకఘనీ, వినుత ఘనీభూత రుచుల వెన్నెల గురిసెన్. 174

ఉ. ఆననజాక్షి యంత దివిజాంగన కేలు దెమల్చి యా నెకా
యా విధమేమొ లెస్స వినవైతి పరాకున మున్ను నీకథల్
నీవె వచింపగా వినవలెన్ వివరింపుమటన్న నేమి తే
దే; వినవే యటంచు నది తెల్పదొడంగె సు దంతమంతయున్. 175

చ. కమలదళేక్షణా యమరకాంత్తు జయంతుడు నేను గూడియుం
టి మి కద నాడు వాని నెఱినీటుల వెక్కుడ వాని వింతయం
దములకు వాని యిచ్చకపు దల్కులకున్ మఱి వానిమేనిడాల్
కొమరున కేను మేలువడి గుత్తకు నిచ్చితి నేమిచెప్పుదున్. 176

సీ. ఇంద్రుక స్త్రైదుట నే నృత్య మాడెడు వేళ బుడుతలచే నాకు నుడుపులంపు
అమ్మతో నొకయోని నలుక గడింపుచు నెటులనో నాయింట నే వసించు
తోడిచెలులొత్త మాదులు వచ్చిపాడగన్న నను జూచి కనుగీటి నవ్వజూడు
నెవ్వరు వినిపించి రేనియు వినఁట్టి మనవి నే తెల్పినంతనె ఘటించు
బ్రొద్దుపోకకు గస్తూరి బొట్టు బెట్టి, కీలుజడయల్లి సురతావిపూలు జుట్టి
సొగసు జేసి యొగాదిగ జూచి సిగ్గు, మురిపెమును బొందు ననుజేరి ముద్దు పెట్టి. 177

చ. సనసన గా నెఱింగి తనుజాతుడు నేనును నుండ గొల్వులో
దివిజవిభుండు లెరగవు దెచ్చికొనున్ శచియల్క జూడ గా
తవమున బిల్వనంపి నను దప్పక జూచుచు సొమ్ములెల్ల మ
క్కువనొసగుం చురుక్కురని కోడలిజంకెనచే నదల్చుచున్. 178

క. ఈకరణి న్నాతోడిదె, లోకంబైయుండ నేను లోనగుచు బురీ
రాకేందు వదనలాకడ, నీకడ నను కొనగ నతడె నేనైయుంటిన్. 189

సీ. పనియుండి యొడబాసి చని రాకయున్న నే బిలువ నంపింతు నెచ్చెలుల చేత
వసత యొవ్వతె హత్తు కొను నెవీని నటంచు వెంటనే బుడుతల వేగబనుతు
నతని నెవ్వరు దూరనాడిన వారితో జలపట్టి వట్టివానులకు బోదు
రతిపారవశ్యత నతడొనర్చిన మోవిగంటి పిమ్మట నొవ్వగా నదల్తు
వాడు నవ్వుచు నింటికి వచ్చె నేని ప్రేమ నెట్టింప, నే చెలరేగి యుందు

రిచ్చవడుమోముతోఁ జేర వచ్చెనేని, గుండెఘల్లన నేమనుకొందు నబల. 180

చ. వలచుట జాతిలోనఁ దలవంపగునే కద యింకఁ దాఁచఁగా
గలిగెడి దేమి నాననుపుకాండ్రను దొల్లిటి వారి వీధిలో
పలఁ గనినంత వెచ్చనగుబాటున కోరిది యన్నదమ్ములన్
బిలిచివరీతిఁ బిల్వ వలపించెఁ జుమీ యతఁడంబుజాననా. 181

గీ. అట్లు వలపించి లోనయ్యె నంచుఁ దెలసి, తరుచు కానల్లు పెట్టి మాయిరుగుపొరుగు
చెలులతోనైన ముచ్చటఁ బలుక నీక, త్రాడు గట్టిన వాని చందాన నేలె. 182

సీ. పలుక నియ్యడు కమ్మవలపు హెచ్చన నాసవములు దెచ్చిన యింద్రవనితతోడ
జూడ నీడొక వేళ జోగునకై వచ్చి మేలు దెల్పెడు జోగురాలి నైన
గూడఁగానీడు కొక్కోకంబు చదువుకోఁ జేరు వేలుపు రాచ చిన్నపడుచు
సరసమాడఁగనీడు వరుసఁదప్పక తెచ్చి విరులిచ్చు పుష్పలావికలతోడ
అకట యేమందు తల్లి యిల్లాలికైనఁ నెడగలదు గాని వానిలోనడచు దాని
కుబుసు పోకకు నేని వేఱొక్కదారి, మిసుక నీడదు మేరకు మేరగాక. 183

సీ. తారానథూటి బందాకోరుగాఁ జేసె మనజయంతుఁడే జాణయనెడు వారు
నదిగాక మోహింపఁ డతని బాటునఁ నేలుకొనుటకై యట్లున్నదనెడువారు
దీనికేమాయెనే వానిఁగాక మఱెవ్వరిని బిల్వపఁట చూడు మనెడువారు
నది బుంతవాని మాయలకు లోఁగునె యెంపరిని జక్కఁ బెట్టునో యనెడువారు
ననుచు నచ్చర నెచ్చెలు లాడుకొంద్రు, నిగళముల తోడ మదహస్తి నిగుడు పగిది
వెంటఁ గావలి మాష్టీలు వేగిరింప, భూధరారాతి నగరికిఁ బోవువేళ. 184

కం. అతఁడెంత యెంచినను సం, మతమై మదిఁ దోమఁగాని మఱి యితరవిటా
యతనానావిధలోక, స్థితి గొంపల మొంప వలపు చెడ్డది సుమ్మా. 185

చ. అడకువగాని పేరిమి జయంతుని పట్టున నొక్కతీరుగా
నడతునె కాని మున్నె నెర నమ్మిన నెచ్చెలి కాండ్రువచ్చినా
కడపయు మెట్టిరేనిఁ జతకానడ నిత్తు విరుల్ దుకూలముల్
విడెములు నాదిఁ గాగ నను వేఁడక మున్న ప్రియంబుఁ జెప్పుచున్. 186

క. మిన్నక తదీయసఖులే, కన్నియగావలెనటన్నఁ గానీ దానిన్
చిన్నారి నగవు మాపులు, సన్నన రప్పించి కూర్తు సమ్మదమొదవన్. 187

సీ. ఒరపుగా విరులతో నెరికొప్పు ఘటియింతు నదిమాసగిల్లజిలుగల్లి కొందు
గీఱుచు నున్నడి గాజు నామము దీర్తు నదమాని డిల్ల బొట్టునుగరింతు

నలిపన్నుఁబోయి నొప్పులపండగిలింతు నదిమాని ముత్యాల హారముంతు
మినుకు సైకపు వ్రాతపని చీరఁ గట్టెఁదాల్తు నదిమాని తెలిచల్వ యలవరింతు
రవిక బిగియింతు నదియును నవలవైచి, కుంకుమపుఁబూత చిమచిమఁగొనెడు విన్న
పచ్చికొనగోటితాఁకులు రచ్చసేయ, గుబ్బయరగానరాఁ బైటకొంగువైతు. 188

చ. వినుమిటులుండఁగాఁ దిమిరవేణి కుబేరుఁడు కమ్మపంపఁగా
దిన చిరి చీటులందు గడిదేరు జయంతుని వర్తమానముల్
వినినలకూబరుం డదిర వేలుపు జోని కుమారునిన్ మునం
బెనయఁ గనింత సేసెనిది యెంతటిదో యని విస్మయంబునన్. 189

సీ. తిరుగఁడే కొన్నాళ్లు సరసీతిలోత్తమా పుంభావ సంభోగములకుఁ జొచ్చి
చెలఁగఁడే కొన్నాళ్లు చిత్రసేనాకంతు పారావతారావ పటిమ మఁజగిలి
నడవఁడే కొన్నాళ్లు నవ మేనకాధరాధర సుధాపాన విస్ఫురణకలరి
మెలఁగడే కొన్నాళ్లు కలితోర్వశీవశీకరుణాకరోక్తి వైఖరికిమెచ్చి
కరలి రెరగంటి దొరసూతి కేళులందుఁ, జొచ్చిచూడక మానినచోటుగలదె
నన్నుఁబలె యొర్తుపైఁబడియున్నవాఁడె, సుకరమగ మేలువడెనె వాడొక తెకేని.

గీ. చదివికొన్నాఁడు మదనశాస్త్రములెల్లఁ, దెలిసికొన్నాఁడు వెలమిటారుల బెడంగు
కొసరు వగలెల్ల నటువంటి కోడెకాని, వలచి వలపించుకొనియె నే వనరుహాక్షి.

సీ. అతఁడింటి కల్లంత నరుదేరఁ దావచ్చి మించుచూపులనె తేలించునేమొ
యతఁడు కీల్జడకేల నదిమిన మే నోసరించి కోపమున గద్దించునేమొ
యతఁడించుక పెనంగి యలయఁ దానదలించి మించి పైకొని పచారించునేమొ
యతఁడు చక్కెర మోవి యానఁ దా గుల్కుటెల్గించి బిగ్గిలఁ గౌగలించునేమొ
బెడఁగుమొనపంట నగమాకు మడుపులిచ్చి, కొసరుమాటలమటియును గూడనెచ్చ
రించి యాతని కాసపుట్టించునేమొ, బాల సురతాంతమందు బాగాలొసంగి 192

క. ఇదిగంటివి యీనరకున్, మదనక్రీడారహస్య మతకోవిదయై
ముదమునఁ దేలింపుచునను, చదురాలై యిపుడుచాల డొక యొనర్చెన్. 193

సీ. నేవచ్చువేళఁ దానింట నుండకపోయి పొరుగింట నిరోంటఁ బ్రొద్దుగడపు
నలవాడు నీచుట్ట మరుదెంచె ననిన నేమాయెలే వచ్చెఁ గాక [illegible] బిగియు
నిలలేక స్వయముగాఁ బిలువఁబోయినఁగాని బెదరించు నిదిగొ వచ్చెదనటంచు
వలసినప్పుడు వచ్చి యలిగియున్నట్టినే పలికించుదాక దవ్వులనె నిల్చు
నంతటను నేనె పైటకొంగలమి బలిమి, సెజ్జపైఁ జేర్చి యలుకలచిక్కుఁదీర్చి

మ్రొక్కుచు నవల్చి నునుపోకముడివవల్చి, కరఁగఁ జేసిన యటువిూఁదఁ గౌఁగిలించు.

చ. పరిపరిరీతులం బ్రసవ బాణునికేళి యొనర్చు తొంటివై
ఖరి నెర పారుతెంపు రొపగానఁబడం దలయెత్తి నామనో
హర డవునీవ యంటి నవురాయను నంతటి పారవశ్యముం
బొరయుదు నున్నసంచుఁ గను మోడ్చుట లేదిపు డించుకేనియున్. 195

క. నెనరైన దాసికిటునవలె, గనరై నను వీడ చూచెఁ గడుమాలిమి చే
వనరంగ స్మృతులు నెయ్యెస, పసవవెయతి పరిచయావజ్ఞాయనఁగన్ 196

గీ. దీనిపొగరార్పనెరనేర్చు దిట్టతనము, మురువు హరువును గల జగన్మోహనాంగి
తేనుగా యంచు దివిని గాలింతు నేఁడు, కలిగెఁ గాతార నవకాంతి చలితతార. 197

చ. అని చెలికాంద్రతోడ నతఁడాడిన ముచ్చటలెల్ల వారునన్
గనుఁగొనివచ్చి యిచ్చకముగా వినిపించిన నెంత మాట చ
క్కని జవరాలు రంభ యదిగాక జయంతుఁడు తామునుండు వ
తఞన కిదిమెరె తామెయగరాయని చీటిని బుచ్చిపంపుదున్. 198

ఉ. అంతట నుక్కునాఁడల ధనాధిపుఁ డశ్వము వాగె వెక్కసీన్
రంతులు మీర నెక్కి పెనురౌతన జోడన చెల్వఁ జూపుచుం
బంతము మీర వీథుల దుమారము రేఁగ సవారిఁ జేసి ప్రా
ద్దంతయు నెక్కుఁగా నడుమ యించుక మేఁశ్రమంబు పూనఁగన్. 199

చ. హరిగెలనీడ వేత్రధరు లయ్యెడ నామములుగ్గడించి హె
చ్చరికె యొనర్ప మ్రొక్కు భటజాలము వీడ్కొని యాస్యపద్మముం
బరిజనులంపపుంజలువ బావడలందుదునంగ నాత్మమం
దిరమున కేగి యందు నొక తిన్నని కెంపుల తిన్నెనిల్చుచున్. 200

ఉ. జెట్టులు చేరి లేత విడి చెందొవ వ్రాతరుమాలువున్ సిగం
జుట్టి యలందుకుంకుమపుసోకుల బంగరుతీగెరంగుని
ట్టట్టన నీని జందెము భుజాగ్రమునం బడవైచి సీత్కృతుల్
దట్టముగాఁగ వింతవగలన్ మెయిమర్దన సేయునత్తరిన్. 201

చ. చెలువపు వెన్నతోఁ జలిదిదిక్కములున్ మెడ త్రాఁడు చీఁకటుల్
గులికెడు నీలిదట్టి పొరలోపల కమ్మ చెరంగు వెన్నునం
దొలకెడు నెత్తి జుట్టు తెలిదుప్పటి వీనుల మానికంపు నా
గుల పడగల్ రహిక్ష దగనొకొండను రొూంటరి బోయఁడుస్థతిన్. 202

గీ. వచ్చి యనఘాయ కువలయాశ్వక్షితీంద్రుఁ, డల్లపాతాళకేతుఁ గీటడచె ననుచు
నచటికరుగు మనుండి సురాధినేత, మిమ్ముఁ రమ్మని యిదె యుత్తరమ్ము పనిచె. 203

క. అని వినిపించు కుబేరుని, కని చెంద్రిక విూఁదవ్రాసి యందు శిఖావే
సిన కమ్మ గద్దె చేరఁగ, నునిచినఁ జూచుకొని చుట్టి యున్ముఖుఁడగుచున్. 204

సీ. హరినీలములమేడ యవలకెంపుల సజ్జ కడమకట్టఁగ నుడుగర యొసంగి
పెరవోట వడిదాచిపెట్టిన నవనిధానములు దేవాప్తసంఘములఁ బనిచి
కారుకు లెత్తి చక్కఁగఁ జేయుఁడ లచైత్రరథమని తగు భటప్రతతిఁ బనిచి
యరయమిచే డొక్కలంటి పెట్టుకయున్న యిభకోటులకు మేపు లిడ ఘటించి
పుడమిఁ బాతాళకేతుండు గడసినపుడె, నిత్యముగ నిల్చె నలకాధిపత్యమను చు
ననిమిషాధీశ్వరుని చెంతకనుపఁదలఁచి పుత్త్రుఁ బిలుమన్న నూడిగంపుభటులపుడు.

గీ. తోడి యక్షకుమారుల తోడఁ గోడి, పడవగొడవలఁ బడి యర్థపతిసుతుండు
గౌడమైల శలాయత్తు కాకినన్నె, మొదలు గాఁగల కుక్కుటంబులను దెచ్చి 206

ఉ. పట్టెపు జుట్టునిక్కు మెడ బాగునఁ జివ్వనయారె పొంకమున్
రెట్టల బల్మి నెమ్మిఁ బురణించిన యీకల జోకలున్ దగల్
గొట్టక యుండ మేపు పలు కోయపుమందులు గల్గు పుంజుఁ జే
పట్టి గ్రహంబు వెన్కఁగనుపట్టఁగ నల్లలు దీసి యంతటన్. 207

గీ. ఎదుటిదానిని విడుమంచు హెచ్చరించి. యతఁడు తను వేగిరింప మల్లాడికొనుచుఁ
గినిసి యొండొంటిఁ బిట్టుదాకించి యీసు, బోడమ రెంటెనిగదియించి విడుచుటయును.

వ. అప్పుడనిర్వార గర్వథామంబులగు నత్తామ్రచూడ సార్వభౌమంబు లతి రూక్షవీక్షా పరంపరలఁ జురం జురంజూచి పవరంజుకొని జుంజురించిన మెడలు నిగుడించుకొని సాటిలేని యీసునం గాటియ్యక తిరుపులు గట్టిన యొరపునందిరుగుచు నింపుసొంపుల గుంపులు గొని నిజవిజయపరాజయంబులు గోరుచు నొకళ్ళొకళ్ళ తొక్కుళ్ళఁ బోడము జగడంబుల జరాలు మనంగటాకులు డుస్సుకొని పెద్దలు వారింపం దేరి యచ్చటికిం జేరి ముంచుకొను కొంచెపుగాంగ్రుడు పెడమోము వెట్టినటెంక వెంటనుట్టినదువ గోడి నెత్తికొను పోవుచు నెట్టికొనిదగలు తొట్టినం బట్టి యీకలం దెమడ వెడలించి పన్నిటితేటల రెట్టలకుం జలువ పుట్టించిన కట్టలుకం బట్టి తప్పించుకొని యొండొంటి నంటి నొప్పించుచు నేవమీరి గౌతమమునిపుంగవాంగనా మానభంగకరణాది కారణారవ నిగ్నిద్ర చరణాయుధలోకపట్టభద్ర గెలిచితివనుచు నుతింపుచుఁ బందెపన్నె పావడలు వైచుచు మచ్చరంబున నిరువాగును నెచ్చరించి

న నిలిచి తన్నుఁ బోయనెసఁగు వేరకుమారుని కుక్కుట కంఠీరవంబు వెనుక నడని కేడించి చుట్టుకొని చురుక్కునం జుట్టు నొక్కినఁ గ్రక్కున నది లేవనిషించి యెదిరి చరణాయుధంబునకు నడ్డంబుగా నవచి యారె విరుగఁబన్నిన నంజక యక్షకుంజకుని పుంజు బిరబిరంజుట్టి రెట్టలోపలం దలసానిపి గిలిగింతలు గొనినం బ్రతిపక్షియు నెగిరి తప్పించుకొని గుప్పున నవ్వాలం గుప్పించి యెదురై యులికి కరము వంగురిన నలకూబరుని కోడియు సమంపరయంబునం గ్రిందికిఁ వగ్గి నెత్తుర జొత్తిల్లఁ గుత్తుక కఱచి వెనుకకు ద్రొగ్గి యీడిగిలంబడిన నరాతియు మెడ ముడివిడిపించుకొని తరిమిన గ్రమ్మికొను చెమ్మటనవయ మున్నె యోడెననుచు నెల్లవారలు గొల్లుగొల్లున నవ్వుచు నెన్నుకొనం గిన్నరరాజకుమారుని చరణాయుధంబు సేవదేరి యడియాసలంవన్నికొని వచ్చు నభియాతినలయించి సిలువంబడు నెడం జేరి పారిపోవంవన్నిన. 209

గీ. కేరితోడఁ దట్టికొని బిట్టుకేక వైచి, మీసములు దీటి యెదిరికిరోస మొదవ
డవిణ వాయింపఁ జేయుచు డాసి పుంజు, నట్టె చూచుచు నున్నట్టి యతనిఁ గాంచి.

చ. ఉడిగపువారు చేరి సమయోచిత మేతగఁ దెల్పుసుద్దులే
నుడువుచు నౌగదా యని కనుంగొన జేవర సంతరించు నె
క్కుడునగపుంజుతోడ నొకకోడి యెదుర్చెనె యంచుఁ జెంతకుం
వడిఁజని యయ్యగారుపిలువంబనుపం బని వింటి మంచనన్. 211

సీ. ఒక్కఁడు చెంపకై యొరఁగుపువ్వులతోడి దసిలీరుమాలు వందముగఁ జుట్ట
జేరి యొక్కండయ్యగారిచ్చుకట్టు వర్గములకు ముల్లెలు గైకొనంగ
నొక్కండు దరహాసమొదవంగ నేటికుక్కుటము కేడించిన గొడవఁ దెల్ప
నొక్కండు రంభాపయోజాక్షి పడవగెల్చినమాట వినిసంతసించు ననఁగ
నటిగి తండ్రికిఁ బ్రణమిల్లి యతఁడుమకమ్మ,నచ్చుటలు దెల్పి తేజీదు వాలి నోలి
నలసియున్నాడ నీవేగు మనుచు ననుప, నగుమొగంబున వీయని నగరువెడలి. 212

సీ. సానిపటాణి తేజిని ముందరనిల్పి సామి యటంచు సలాముసేయ
మావటీఁడు గజోత్తమముఁ దెచ్చి యంకుశంబు దనర్చుకేళితోఁ మ్రొక్కుచేయ
సారథి రథముకన్ చాయనుఁ బోనిచ్చి యటునిల్పివచ్చి జోహారుసేయ
దాకాధినాదు దండమ్ము ముందరనిల్పి తమిసపాత్తులతోడ దండమొసఁగ
పావలటు మీటి కొల్లాయ బండియెక్కి, దురదురన రంభ యింటికినరిగి తనదు
పయన మెఱింగి సన్మసపడనిదాని, గుస్తరించుచు ననిపించుకొని యాతండు. 213

చ. స్ఫురితవిభాసమానమగు పుష్పకనామ విమానమెక్కి ని
ర్జర తతి తోడ నేఁగి దితిజక్షణ శిక్షణ దక్షరూక్షభా
స్వరశర సాంద్రు నావృపతి చంద్రునుతించు సురేంద్రు వెంబడిం
జరిగి శుభాకరంబగు తదీయపురంబును జేరి యందులన్. 214

క. అల యదితి విప్రపూజలు, సలుపంగనుఁ గొనఁగఁ బాకశాసనుఁడుతనున్
నిలుపఁగ నులుపానించిన, చెలువొందెడు విడిదిలో వసించెనతండున్. 215

గీ. అనముదాలస తారామృగాంకవదన, తెల్లముగమీఁది కతలెల్లఁదెలుపు మనియె
ననిన జైమిని ముని యావిహంగములన, నంతరకథావిధం బెట్టిదని యడిగిన. 216

అశ్వాశాంతపద్యములు

శా. సంధ్యాతాండవ చండ ఖండపరశుస్ఫాయ జ్జటా మండలీ
సంధ్యాహిండితగాంగ భంగజ మిథస్సంఘర్ష పుంజీకృతా
వంధ్యారావ ఘుమం ఘుమోన్నతి సప్తగ్వాజ్ఞాల పుణ్యాకృతీ
వింధ్యత్క్ష్మాధర కూట కోటి విచరద్విద్వేషి యోషిత్తతీ. 217

క. అమిత ప్రతాప తాపని. సమదాన విభానభావ జన్మాకారా
నుతగోత్ర గోత్రభిష్టుత, హిమకరనిభకీర్తి కాంత హిమకరగండా. 218

మాలిని. ధరణిపకులసోమా, దర్పితారాతిభీమా పరిహృతకవిభూమా భానుసంకాశధామా
సరసకవనభోజా సాధు సంతానభూజా, మురరిపునుతతేజా మూర్తిమాంబాతనూజా.




ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ సవరమన్వయాభరణ నారాయణభూపాలతనూభవ శతగోపతాపసేంద్రచరణారవింద సంచలస్వాంతసమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణానంద కామినీమనోహర రూపరేఖావిజితచైత్ర కాశ్యపగోత్రపవిత్ర జాతివార్తాకవిజనామోదసంధాయక చిననారాయణనాయకప్రణీతంబైన కువలయాశ్వచరిత్రంబను మహాప్రబంధంబునందు చతుర్థాశ్వాసము.

సమాప్తము.



శ్రీరస్తు.

# కువలయాశ్వచరిత్రము.

## పంచమాశ్వాసము.

---

క. శ్రీకర సపరము తిమ్మధ, రాకాముకగర్భజలధిరాకాచంద్రా
లోకనుత దానగుణ సం, ధాకర్ణసమాన నారణ నరేంద్రమణీ. 1

గీ. అవధరింపుము జైమిని కలపతంగ, కులపతంగంబు లిట్లని తెలుపఁ దొడఁగె
సమ్మదాలసతో మనోహర సుధా, విధానధాన వచోరీతిఁ దారపలికె. 2

వ. అవ్విధంబున నమరావతీపురంబుఁ జేరి నలకూబరుండు. 3

మ. తననీటుల్ మెఱయించు జేన పొడవుఁ దాల్మింటి యుండంపుఁ గుం
దనపుంపల్కులు గ్రుమ్మరించు చిరుసానాకత్తి చిమ్ముం గళం
బున గోరోత్తుల పేరి యారజపు సొమ్ముల్ మోవిపైఁ గెంపు ని
గ్గను మీసంబులు దిద్దినాడికొను జగ్గుల్ మీర నావీథులన్. 4

సీ. చూచి దిగ్గున లేచు సుదతిఁ గూర్చుండవే యనుచోట మొగమున నలరుకులుకు
రంభ సేమము వేఁడు రమణీమణి మొగంబుఁ జూచుచో నవ్వులో సోలయు హొయలు
నెదురుగాఁ జనుదెంచు నింతి మ్రొక్కులనందికొనుచోటఁ జూపులోఁ గులుకుసొగసు
కసయంపలము డిగ్గ నని తోఁ బరిహాస మాడుచో మాటలో నంచగింపు
బుదత లందిచ్చు తెలనాకు మడపుపంట, నందికొనునీటు నుడువులో నార్జంపు
చిత్తరపుపాట రొమ్ములో బిగువు నెగడ, నేఁగు నాకారి వెంటనయ్యెమ్మెకాఁడు. 5

ఉ. చక్కదనాలకేమి నెఱజాణవు నేకవ తప్పగాదు లే
వెక్కుల రంభభాగ్యము కడింది సుమీ యిటువంటి నాయకున్
దక్కఁ బెనంగెఁ జూడు మనినం బిగువెత్తెదు నీకు రోసమా
యెక్కడిదో యటంచుఁ గలహింతురు నాఘులతోడ నచ్చరల్. 6

చ. అలిగెడుతీరు వేడికొను నంచముఁ బొందికలోని పొరువా
పలుపుల భేదముల్ సురతబంధములుం గళలంటు నైఖరుల్
వలపులు రేఁచు పచ్చు నెరవాదులతో వివదించు కట్టుఁ గొంగు
లముడివీఁడ నచ్చరలు గుంపయి పొంచు వినన్ ముదంబునన్. 7

చ. వెలుపలికచ్చు నొక్కయెడ వేలుపుసానికి నన్నెకానికిం

గలహము కల్గెనేని జతనంబునఁ జేరఁగవచ్చి రోసపుం
బలుకుల వాదు రేపి శిగపట్లకు డగ్గరఁ జేసి క్రొవ్వునం
గలకల నవ్వువాఁడు చవుకట్లసియాడ రుమాలు వీచఁగన్. 8

సీ. సంగీత మేళముప్పొంగఁ దేజీనెక్కి కంప మంటుచు రవగాలు చూపు
పగటుపావలు మెట్టి బట్లు కైవారముల్ జోడింప హరిగెల నీడకేగు
విచ్చుకత్తులవారు వెంటరా నందలంబును నిబ్బరంబుగాఁ బోవనిచ్చు
జేగను బూని మాష్టిని సుద్దులుచెప్పి కొనుచు నెచ్చెలికాండ్రఁ గూడి యరుగు
పికిలిపిట్టల కోట్లాటఁ బెట్టి చూచు, దిట్టతనమునఁ జెఱకు పందెంబు లాడు
డీకొనఁగఁ జేసి యనికిఁ బొట్టేళ్ళవిడుచు, రంభచుట్టంబు వైభవప్రాభవమున. 9

సీ. అమ్మకచెల్ల చోద్యముగాక నామీఁద మనసు పుట్టునె వానికను మృగాక్షి
యెన్ని మాయలు గుత్తకున్న దానిదొరంగి యనల మాటాడునే యనులతాంగి
కాక మరేమి రంభాకాంతతోడి కయ్యాన కెన్వతె యోర్చు ననువధూటి
అనువుకాదయి తన యక్కరదీరిన నచటికే చనుగదా యను మిటారి
యైరి గుజగుజలాడుచు నాత్మవిటులు, కొసరుఁబల్కులతోఁ గుచ్చిగుచ్చియడుగ
నేమి లేదని మాటి సారేందువదన, లాతఁడడిగింప నిజగృహాభ్యంతరముల. 10

ఉ. నంటున నొక్కవేళ సురనాథకుమారునిఁ దోడికొంచు మా
యింటికి వచ్చి సిగ్గుపడి యేఁ జన నానలు వెట్టి పిల్చి క్రేఁ
గంటనె నన్నుఁ జూచి యరుగుంగద యేమిటికో యతండు చో
క్కొంటఁగ మోవి నొక్కికొని యావల యూచు నొయార మేర్పడన్. 11

ఉ. అంతట మేళవించిన యొయారపుతంబుర చేతికిచ్చి యే
వింత పదంబుఁ బాడఁ బదివేల విధంబుల మెచ్చికొంచు మే
మింతటఁ బోయి రావలసదే యని దుప్పటిఁ దెచ్చి కప్పుచోఁ
గొంత కరంబుగీరుఁ గొనగోర ననున్ నును మేను జుమ్మనన్. 12

క. అది మొదలుగ నితరవధూ, హృదయంబులఁ దన్ను నిలువ నీయనికతనన్
మదనుఁడు నాముద్దులోపల, సుదతీమణి తనబలంబుఁ జూపందొడఁగెన్. 13

క. నానాటఁ బాటలాధర, యేనాటలు పాట లుడిగి యినుమడి కోర్కుల్
లో నాటఁగఁ దద్రూప, ధ్యానాట మనోంబు జాతనై వర్తిలు[illegible]. 14

చ. కలికితనంబుఁ జేర నయగారము మీర జయంత యేమిరా
పలుకవు వింతచో మనసు బాఁకనొ యేమిటఁ బ్రొద్దుపోదురా

యల నలకూబరుం బిలువ సంపర యంచును బిల్వఁబంచి సొం
పులఁ గడకంటిచూపులనె ముచ్చట తీరఁగఁ జూతు నాతనిన్. 15

ఉ. జవ్వని యించుకే మొగము చాటున నుండఁగ గుబేర సూతి యా
దవ్వులనుండి నాపెదవి తప్పక కన్గొన నే నెఱింగి లో
నువ్విలులూర ముద్దుమొగి యూరక తాఁబయలానినందుకే
నవ్వఁగఁ దానునవ్వి సురనాథకుమారునిఁ బిల్తునాయనున్. 16

సీ. వానిఁ దొయ్యారంపుఁ బావలు తెప్పించి సిబ్బెంపుఁ జనుఁదోయిఁ జేర్చుకొందు
క్రేనఁ దప్పక చూచి కీవిగా వాఁడంత నన్నుఁ జూడఁ జూపు గ్రక్కున మరల్తు
వానిపైఁ బద్యమెవ్వరు లేనివేళఁ బాంచాల శయ్యఁ బాసంగఁ జదివికొందుఁ
బరులతో నర్మోక్తి పలుక నే నెఱిఁగి లేనగవుతో వానినెమ్మొగముఁ జూతు
మఱియునొక్కొక వేళ సుమాళ మొదవఁ, బరిమళంబుల బాగాలు పలకనుంచి
నే నొసంగఁగఁ గొంకిన దాని కరణిఁ, బ్రియునిచేతనె వాని కిప్పింతునమ్మ. 17

చ. అలికచ జోలి తప్పనటు లయ్యెడు నాదువికార మంతయున్
దెలుపఁగ వచ్చెనే వినఁగదే మఱియంతట నొక్క నాఁడు నె
చ్చెలులమొఱంగి కేళిగృహసీమ జయంతుఁడు లేనివేళ గు
బ్బలపయిఁ బైటజారఁ బువుపాన్పు పయింబడి నెమ్మనంబునన్. 18

సీ. ఇది యేమిచోద్యము మదిలో వితావితా నలకూబరుని మీఁద నాకుఁ బ్రేమ
దొర కుమారుండును దురుసు కటారిగాఁడీ జయంతుఁడు బాయనీఁడు నన్ను
వాఁడైన మఱిఁ గొంచె కాఁడు మాష్టీని జోకలు జూపఁడగు వగకాఁడు కాని
యంపఱిలో మున్నె యగడాట చాలదే యింక గొహారు వాదేల తనకు
నేటికి గొహారు తనకు నాకేల వెఱవ, నార యిల్లాలనా వారివారికరణి
కంటికింపైన వానితోఁ గలసి మెలఁగ, నన్నుఁ గన్నాఁడు మావారి నాయకుఁడు. 19

ఉ. ఒక్కటి రంభ యేమను నొకో యని లోఁగుట యింతె కాక నా
కెక్కడి యాజ్ఞ యాసరసిజేక్షణకైనఁ బనేమి యెమ్మొకా
డొక్కతె సొమ్మగా నిలుచునే యది యేలిక సానియే యిదే
మక్కటి యైన వాని నిలయంబున నుండఁగ హత్తుకొంటినో. 20

ఉ. అందులకేమి యిప్పటికి నైనటు లయ్యెడుగాని నేను వా
రంపరు గానకుండఁగ ధనాధిపపుత్రునిఁ దెచ్చి కూర్చు వా
రెందు మఱెవ్వరిట్టి పని యెవ్వరితో నెఱిగింతుఁ గూడ నే

యంచము లెస్స యంచొక యుపాయముఁ గాంచి సునిశ్చయంబుగన్. 21

ఉ. అంగజసన్నిభుండగు ధనాధిప సూతికిఁ దార ప్రొక్కి చే
యాఁగల విన్నపంబు మదనాతుర నైతి మదీయమందిర
ప్రాంగణ వృక్షవాటికి రయంబున రావలె రాకయున్న నీ
యంగన నైన రంభ పవమాన యటంచొక చీటి వ్రాయుచున్. 22

గీ. ఒక్క సంపంగి బంతిలోఁ జెక్కి వింత, యంచమిది లెస్స చూచి కొమ్మని కుబేర
పుత్రునకు నిచ్చిరమ్మన్న బోఁటిపైఁట, బొదివికొని ముద్దునడలతో బోవునపుడు. 23

ఉ. చెక్కిటఁ జేయిఁ జేర్చి ననుఁజెందెడు కోర్కుల నూడిగంపు వా
డొక్కఁడుఁ దాను నుండి యతఁడో చెలి రమ్మన రేంద్రనందనుం
డెక్కడనుండెఁ దార యిపుడేమి యొనర్చుచు నున్నదంచు పె
న్మక్కువ నాదరించి బహుమానము సేయఁగ దాయ నేఁగుచున్. 24

గీ. అయ్య మాబాన తమయవ్వ యాచరించు, విష్ణుపూజలకటిగె నెవ్వేళ రాదు.
వనితయీబంతి మీచెంత కనిచె వింత, చెలువు సౌర్వంగ గలదని చేతికొసఁగ. 25

చ. కనుఁగొని మోవిఁగోర్గతి మొగంబునఁ జేర్చుచుఁ బల్చకం బలెం
గనుఁగవఁ దార్చుచుం జెలికిఁ గప్రపు వీడెమొసంగి పంచి యి
చ్చిన తమిచెండు విచ్చి యటఁ జెక్కిన చీటి పఠించి చూచి యే
మని కొనియాడెనో తెలియ దంతట నిచ్చల నేను గ్రక్కునన్. 26

ఉ. ఇంతకు వచ్చునో యతని కీపని కిట్టె మనస్సు గల్గదో శచీ
కాంతుని యొద్దకే యరుగ గాంచునో చూతమటంచు వెంట నే
కాంతయు రాక యుండఁ దిరుగందిరుగం గనుఁగొంచు మవ్వన
ప్రాంతముఁ జేరి యంచొక లతాంత నికుంజముఁ జేరబోయినన్. 27

క. మొలవంక పెద్దకత్తియు, చెలువగు చేలమ్ము ధట్టి చెరగులు బురుసా
తళుకు రుమాలువు మించఁగ, నలకూబరుఁ దద్గృహంబునం గనుఁగొంటిన్. 28

గీ. అప్పుడేమందు నాడు సిగ్గమ్మలార, వెనుకడుగుగాఁగఁ దలవంచికొనఁగఁ జేసె
కాంచి వాడును నిలువునఁ గౌగలింపఁ, బొంగి పైఁబడితిని బైడిబొమ్మవోలె. 29

మ. అకృతానందనివాస దీనవచనం బప్రాప్త చేష్టావిధా
నకమజ్ఞాత నఖక్షతాంకుర మసందష్టాధరోష్ఠంబ పే
తకపోతారవ మప్రయుక్తగురు బంధప్రౌఢిమంబైన ద
ర్పక జన్యంబున గేస్తురాల నయితిం బ్రావీణ్యహైన్యంబునన్. 30

చ. విడువని కౌఁగిలింత పురివిచ్చుని మచ్చిక తప్పులేని సం
దడి కొసవింత చూపు మరునాటికి రమ్మని మ్రొక్కు తోడి త్రో
క్కుడు వగ మాట నీటొలయు గూడని నెమ్మది గల్గి యొక్క కై
వడిఁ జెడఁ బాసి యింటికిని వచ్చితి నాతఁడు నేఁగునంతటన్. 31

క. దినదినమున్ వనమున మం, దనజనముం గనుమొరంగి ధనరాట్సుతుతో
ఘనరాగము దనరారఁగ, వనరాశిక్రీడ నోలలాడుచునుందున్. 32

ఉ. అక్క యిదేమొ కాని తెలియం బడదాతఁడు వీధివెంట బల్
టక్కులతోడరాఁ బొదిగిటన్ నిలువంబడి తొంగి చూచునో
పక్కన చేప్పలున్న వెకదా మఱి యెక్కడనుండి వచ్చునో
పక్కన వచ్చునమ్మ చలపాది మిటారపు నవ్వుతొక్కటన్. 33

క. తనువు జయంతుని పక్కన్, మనసాధనరాజవరకుమారుని చెంతన్.
జానుపుదుఁ గోరకదళనా, ననద సెనాజోదు దురమునం బెనఁగునెడన్. 34

సీ. చెలరేఁగి వలరాచ వెలుపుల పెనుకతల్ వినిపించునప్పు డూకొనెడుదారి
ఎటుఁ బోయి తన నిట్టి యొడకంచుఁ బొసగింపఁ బోవుచోఁ దడఁబడుబొంకుమాట
త్రేకఁటి యలుక కల్పించి మంచముకోఁడు గౌఁగలించుచొ కమ్మగాని వింత
యల్లయా చెలిమంచిదని మెచ్చుచోఁ గోపగించక మైకొలుగాంచు నేర్పు
నించువిలుకాని జగడాన నెంతతడవు, చాలుననుపల్కు నిన్నాళ్ళసరణిరాజ
రాజతనుజాతుఁదలప కూరకయ యుంటఁ, దెలిసె దేవేంద్రసుతుడు సందియముఁ జొదె.

గీ. అంత నచ్చట రంభావృగాయతాక్షి, యేమొ నలకూబరుం డంటి యిటువుకొనియె
నౌర యింటికిఁ గమ్మకు మరుకెమ్మ, యంపఁ డెంతటి వోరతనంబనుచుఁ బలికె. 36

సీ. వినవింపుగా మేళవించి యుంచినయట్టి యల్లవీణియ యుంచి నట్లెయుండ
వెరబొంత గొనెన వేసి మూసినయట్టి యరలపెట్టియ మూసినట్లెయుండ
నెటికగాఁ బెట్టి దండెమా మీఁదవైచిన యంగదట్టము వైచినట్లెయుండ
నెరపుగా నూరి గిన్నియల నించినయట్టి యరిదికుంకుమ నించినట్లెయుండ
నెందుపై నిచ్చలేక యేమేమొ తలఁచు, కొనుచుఁ జెలులను జంకించుకొనుచుజిలుక
కొసరుమాటకుఁ గట్టిగాఁ గసరుకొనుచుఁ, దాళఁగూడనివింత విరాళియెత్తె. 37

గీ. చికిలిలోపలనే చీ[illegible]చిటుకుమన్నఁ గనకననహూయ బకదారి కువలకడన
మరుని వెరళించు[illegible] మల్లంటు విరులకడనఁ, బసుకయిలుమాని విరహతాపంబుబూని. 38

సీ. నీనాయకుఁడు వచ్చెనేయన్న విసువుగా నతఁడేమిటికి వచ్చునమ్మ యనుచు

సొలవకుమదిగొ వచ్చునటన్నఁ బోలి వాఁడిటువచ్చి యెంత రాకెంతయనుచు
రాకున్నవాని గోరకుమన్న నయ్యెఁబో నవ్వానిఁ గోరనాకేల యనుచు
యదివచ్చెననలేచి యందరౌనౌననఁ జిక్కును బిల్వనచ్చితినటంచు
చెలుల కాత్మీయవిరహంబు తెలియనీక, మాటిమాటికి నిలిచిన చోట నిలువ
కాలతా తన్వి మది జాలిమాలికొనుచు, నతనికడకేగు తమి నున్న యవసరమున. 39

సీ. కైటభాదినిశాట ఝాట ఖండనపాట వాటోప కరు మీఁది పాటలమర
రాజతాచల రాజ రాజహంస విరాజి, తంబగు తనుకాంతి యోజమెరయ
తోయజినీ ప్రాణనాయకరుచి ఛాయ కాయతంబగు జటా చ్ఛాయ వెలయ
సామజ ఘనసార సోమ కల్పకభూమ ధామకంబగు నక్షదామ మొలయ
ఆలములు లేమి డొక్క వెన్నంటికొనఁగ, డెలివిగల కన్నుఁదోయి గుంటలుపడంగ
బొంచికొని జెట్టిమాట లాలించుకొనుచు, నచ్చటికి వచ్చె వేలుపు గచ్చకాఁడు. 40

గీ. వచ్చి యచ్చరప్రోయాల నచ్చి వెనుక, మ్రొక్కుచువుగాని కొమ్మనీముద్దుగని
యొద్దనుండినదని వీణె యొరగులోని, చీటివడి నిచ్చి చనిన నచ్చెరువుదోఁప. 41

క. అది చదివి కొంతసేపా, మదవతి నివ్వెరఁగుకతన మ్రాన్పడి మఱియుం
జదివికొని యదిర తారా, మదిరేక్షణ కింతభోగమా కావలెనే. 42

సీ. మఱచెనో సంగీత మర్మకర్మములు నావలన నొక్కొకవేళఁ దెలిసికొనుట
యెఱుగదో తాను నాయింటికి వచ్చి నే నీదాన జుమ్మ మన్నించు మనుట
కానదో యూర్వసీ కాంతకుఁ దనకు వాదెచ్చిన నేను వహించుకొనుట
తలఁపదో సురరాజు కొలువులోఁ దన పాటవినిపించుమని నన్ను వేఁడికొనుట
యేటికీపని తనచెల్మి వీటివోవ, నిన్నఁగదవమ్మ వింతవన్ని యలవంచు
సురటు లంతలఁ బల్లటీ జోడులనిపె, నింతలోనన యీగర్వమేల వచ్చె. 43

సీ. దేవేంద్రుఁ గనఁ బోవుచో వాని చెంగటఁ జెలుల నమ్మక దాని నిలిపిపోవు
వాఁడు నేనును వింతవగలఁ గూడిన పొందికల దారి దానితోఁ బలికికొందు
దీని నేటికి నిందఁ దెచ్చితి వన వానిదిక్కు వీక్షించి గద్దించి నైతు
వాఁడు నామది మెచ్చవలసి తెచ్చినమంచికానుకల్ వెసదాఁచి దానికిత్తుఁ
గపట మింతేనిఁ దెలియదుకనుక మేక, వన్నెపులియయి యిందురమ్మనఁగనిల్లు
గైకొనుట గానలేక యాకాపురాలఁ, గారవింతునె నమ్మినే వీరిడైతి. 44

గీ. అప్పుడేవాని బావ బావనుచు మేర, మీరినడుపంగఁ గని [illegible]డెమేలమనుచు
నోర్చుకొని యుంటిఁ గాక యీయుత్పలాక్షి, గురువులకు బొమ్మ వెట్టుటయరయ నైతి.

గీ. ఇపుడు సైతము దానిపై నీసులేదు, నమ్మికయె గాని యాతంప నాల తపసి
కడుపు సాకంగవలసి యీకరణిఁ జీటి, నేనుగీనయంగ గల్పించె నేమొకాని. 46

మ. అకటా కాదిది తారవ్రాలవును జుమ్మా కన్నె యావన్నెకా
నికిఁ దానంపిన దేమొ చీటి మతివానిం జూడఁగాఁ బోయి మా
సికులాగ్రేసరుఁ డేమరించి వడిదీనిం గైకొనం బోలుఁ గా
నుకగాఁ దెచ్చెనె కానిచో నతఁడు నన్నుం జౌకగాఁ జూచునే. 47

శా. ఔనే తార శబాసు మెచ్చవలె నాహా నీగుణం బింకిటన్
వానిం జూచిన నీకు నిన్నుఁ గనుఁగొన్నట్టి వానికిన్ శోకసం
ధానం బొంపఁగఁ జేసినప్పుడుగదా, నా కూచి లేకున్నచో
నేనేరంభనె యచ్చరల్ వాగడఁగా, నీపేరునం బిల్వవే. 48

క. అని నిశ్చయించిరోషం, బినుమడిగాఁ జీటియిచ్చి యేమేమో మం
తనమాడి పొమ్మ పొమ్మని, తనబోటిం బనుపఁ ఘనపదస్ఫుటగతినై. 49

చ. అది చనుదెంచి నందన వనావనిఁ జప్పుడు కాకయుండఁ గెం
పొదవిన చూడ్కితోఁ బరిజనోత్కరముం జడ వ్రల్లి చూచుచున్
గుడిగొన నూటి గాగఁ గనుఁగొంచు మెఱుంగుల నంట వింట బె
ట్టిదముగ గువ్వతండము పడిం బడ వేయు జయంతు చెంతకున్. 50

గీ. చేరి మారంభ వనిచె నీచీటిఁ జూచి, కొమ్మ నీవంటివానికిఁ గొదవగాదె
యాట దానికి నింతమత్తా యిదేటి, మోహమయ్యె యటంచు నమ్మదితవలుక. 51

క. ఆచీటిఁ జూచి వేలుపు రాచూలి మెఱుంగు కలకరాఁ జేటి దెసన్
జూచి వినుమింతె విటులకు, నీచెలికిన్ జూడునేఁడు మెచ్చుసుటింతుల్. 52

గీ. అనిగిఱుక్కునఁ దిరిగి యయ్యమరనాథ, పుత్రుఁ డంపటి నిండ్లకుఁ బోవబనిచి
సురగ చురదూర నాయింటి కరుగుదెంచి, యేమిచెప్పదుఁ బొపరింటికేగుదెంచె. 53

మ. అపుడే గ్రొవ్విరులంది యీయ ధనరాజాపత్య మచ్చంపు ని
క్కపుఁ బ్రేమన్ జడయల్ల నేమడు పొసంగం బట్టి చేనొక్కి నే
రుపుతో నిచ్చినఁ గాని యొల్లనని మార్గోన్మైన నేనంతఁ బ
ల్కుపరాకింద మటంచు మర్లయుసగం గోపంబు దీపింపఁగన్. 54

క. ఔనన్నా నరకూబరా కానీమన్నా యటంచు గ్రక్కునఁ దిరిగెన్
దానుంజనె నర్థేంద్రజుఁ. డేనున్ భయమొదవ నింటికేగితినంతన్. 55

క. నూకెలను నిద్రజుఁడుకో, లాకికమందిన నతెండు లలితోద్యానం

బారంగఁ గొదవదైనా యీకీలియు మంచిదని ప్రియంబునఁ బలుకెన్.

సీ. ముడిపువ్వుటొత్తులు మూఁడువేళలఁ దెచ్చియిచ్చువారలయిష్టమెల్ల గలిగెఁ
జనువుతో దారికట్టును మొనకట్టును దెలుపు వారల మనువులు ఫలించె
నింత మాత్రమునకు నీవేల నేబూనికొనియెదనని వారి కోర్కులొదవె
కైసంట వింతగా గైసేయు సూడిగంబుల వారి యాప్తవిస్ఫురణమించె
జార దాతలరాయ బ్రహ్మయు ననెశా, వారికెల్లను ఘనములవ్వారియయ్యె
నొంటిపోల్గాట తత్తరంబునన మేని, వాంఛయంజక పర్తించు వారివలన. 56

సీ. బొక్కసంబుల బీగములు దెచ్చి సొమ్మెల్ల వెట్టి యొత్తినరీతి వెచ్చబెట్టి
గెలిచిన నొనెకా తలఁప వేఱొకటైన దయ యుంచుఁడనుచుఁ బెద్దలకఁ వెలిపి
పడిరోసమెత్తి పైఁ బడకెచ్చరించి చెంగట నిల్పుఁడని నేస్తకాండ్రఁబలికి
చెల్లుగా మనసువచ్చిన పదార్థములెల్ల సరత వ్రీతింగ ననుభవించి
యొప్పసద్దు తమలోన యెవనికొక్క, యీవెలి యటంచుమదిలోన హెచ్చరించె
పొగలపెట్టెలు నునుఘట్టిపారల వరల, తెల్లవారక మును బయల్ దేరుటయును. 57

వ. అప్పవత్యాశ్చర్య చర్యాధుర్యంబగు నక్కార్యంబు చారణు విని కిన్నరులాలించి విద్యాధరులు చెవినిడి కిన్నరులాకర్ణించి పెరగుపడం పదాప్త పరంపరానువాక్యంబుల నెక్కడెక్కడ యని తత్తరంబునఁ బరువెత్తువారును నే మేమి యని యడిగిన విస్తరింపక జయంతనల కూబరులంట యనుచుం బరుచు వారును తారనిమిత్తంబున నెంత పుట్టెంగంటిరే యెంత గయ్యాళి యనుచుం జనువారును నింద్రనందనునకు బందా కోరైన యీరాజనదన కుబేరకుమారునకు లోనైన యప్పుడే వివాహంబు సిద్ధంబను వారును వెలకొమ్మలమనంబులునమ్మనచ్చునే యనుచు నవుగువారును నిట్టి యెడంబుట్టిన రోసంబులు వారింప నెవ్వరితరంబనుచుఁ దమ యేలికలకు నెప్పటి సమాచారంబులప్పటికిఁ జీటులువ్రాయుచుఁ గ్రక్కునంజనవలెఁ జుమ్మీ యనుచు వేగులవారి నెచ్చరించుచుఁ బోవు నియోగులును ఘొల్లునఁ గేకలువైచి కేరుచుఁ జంగునఁ దాటుచు నేఁడుగదా వేఁడుక చూడఁ గలిగెఁ గదా యనుచు గమకించు కోడెకాండ్రును గాయంబులు గట్టుటకు మందు సంచులు బుజంబుల వ్రేలాఁడ బొజ్జలపరంజను నేలుపు వైజ్జులును చేటికావిదిత తదీయవృత్తాంతంబు విని యమ్మక్క యీచక్కని నారలకెక్కడ నుండి వచ్చెనే యనుచు మేడలెక్కి కనుంగొను నవరోధగిరి పమోనరులును గన్నుంగిని యెంతసిగ్గరివి తలయెత్తవే నంగనాచియనుచు మాటలు పొడుచువారును నింకవిూఁదమునిపెంబులు చెల్లునే యను మదలఁ బంకించు న

చ్చరమెఱుంగుబోఁడులును నైయమరావతీపురంబువారంపఱును సంపడింబడఁ బురం
దరుండు హెగ్గడికత్తియల వలనవిని డిగ్గన లేచి శచీమత్తకాశిని దుఃఖాయత్తం
చిత్తంబుతో నచ్చటికి నెత్తుననుచుఁ దత్తరింప బొమముడితో నతిరూక్షంబగు వీ
క్షణంబున నిలువరించి నగిరు వెలువడి తమకంబునఁ బైటికిం జనుచెంచెనంత నంత
యు విని యఖిలదిక్పాలకులును బ్రహ్మాదిదేవతలు నేతెంచిరట్టియెడ. 58

సీ. మనకేమి పని చూచికొని యుంప మీవేమి యనఁబోకుమీ యనియనుసరించి
నీపున్నె మిచ్చట నీపగ్గె నెరయించి బోరు దీర్పఁగ మంచుఁ బొందుపఱచి
మనచేతఁ గాదు వీరిని శాంతుల నొనర్ప నూరకుండెపమంచు నొద్దనిలచి
నానోటి కడికి విఘ్నముఁ జేసినపుడె శపింతుఁ జుమ్మీయని బెదరఁజేసి
వారి వైరంబుఁ బురికొల్పఁ జేరి నారదుండు వీణగవిశనను దొలఁగఁ జేసి
మెట్లుతపఁబడఁ దుడుకుగా మేళవించి, నిలుచవారిద్దరును రణోన్నిద్రులైన. 59

క. హరిహయుఁడుఁ గుబేరుఁడు ని, ద్దరునొగి నన్నలువ యపగుఁ దమ్ములప్రాలన్
గరుణించి సకలదేవో, త్కరములతో నతఁడు నిలచి తన్మస్యమునన్. 60

గీ వలపనిన వారిలోఁ దుస్సి నైచి నట్టి, కైదువులజూచి బలికె నే కన్మోరంగ
నొరల వైతురెయంచు నొందోడ్డికొనుచు, నవునెకద యంచునతఁడుండు నవసరమున

శా. అయ్యా కావరె యాడుదాన నబలన్ హా యెవ్వరింగాననా
థయ్యాలింపరె నన్ను నెత్తికొని దిక్కుల్ చూచుచుంబారెడిన్
దయ్యం బీతని నెవ్వరేని నిజఖడ్గ ప్రోద్యదుగ్రాగ్నికిం
ధాయ్యంజేయక యాడుదీవెనలఁ బొంపం లేరె నే మ్రొక్కెదన్ 62

క. అని యెడు నాడుమొరల్ విని, వనజుఁ డిది తాళకేతు వర్తన మరయున్
మునుదేవ గురుఁడుశపియిం, చినచందము నిట్టిదనుచుఁ జింతించునెపన్. 63

క. ధనరాజసుతుజయంతుం, గనుఁగొని యాచాయ వచ్చు కర్వ్యాదుని వ్రే
లునఁ జూపి వీని నిద్దరు, దునుముఁడు పొందనినఁ జంపదోర్దండునులై. 64

క. డేగవెరచూపు నిగుడెడు, వేగంబున నిగుడు దనుజ వీరుని బుజముల్
ప్రోగువడఁ బంచికొనుచువి, భాగించిరి తనువుతోడఁ బాసిచనంగన్. 65

వ. అంత

సీ. నిగనిగనిగని పెన్నెఱుగెంపు ముడిపీడి తనదీర్ఘ రీతి యందటికిఁ దెలుప
నదరుపాటునఁ జూచు చదురు చూపులవల్లఁ గలువ వసంతంబు గలయఁజల్ల
నుసుగక గుండెయుఁ దడఁబడమనుటఁ గెంపుల దంపె జనుఁదోయి పుటము లెత్త

గడ గడ వడఁకు మేను గలిగెఁ దోషగునంచు నసియాడు కౌను సంతసము జెంద
వీఁడు పయ్యెద వసివాళ్ళువాఁడు మోము, నడుగు దడఁబాటు నెమ్మనఁబొడము చెమట
మెఱుఁగు రక్కసుచే వీడి మీననయన, యచ్చరలగుంపుఁ జేరంగ ననుసరించె. 67
గీ. అంత దేవతలెల్ల జయంత ధనద, పుత్రకులనొక్కటిగఁ జేసి పొంకపఱచి
నెలవులకు నేగఁ జాలు నానిందతప్పె, ననుచు నేదానిఁ దోడ్కొని యరుగుదెంచి.
క. నాయింట నునిచి మఱి యీ, తోయజముఖి తేనకునాఁడుఁ దోడుగఁ జెలిమిం
జేయుచునుండఁగ నొకనాఁ, డాయమ ననుఁ జూచి వికసితాననయగుచున్. 69
సీ. వినవమ్మ కుండల యనుదాన నల విభావసుకుమారిక మదాలసయు నేను
గ్రీడింపఁ బాతాళకేతుండు గొనిపోయి మందరభూధరంబందు నిల్ప
నచటికిఁ గువలయాశ్వాధీశుఁ డేతెంచి దనుజేంద్రు ఘోరయుద్ధమునఁ ద్రుంచి
మముఁ దోడికొనిపోవ మతివానియనుజుండు తాళకేతుఁడు మహోగ్రాలలీల
మాయచే మమ్ముఁ దోకొనిపోయి మేరు, మందిరములందునునుప నమ్మందగమన
గాన నొకనాటిరాత్రి నకాంతఁదలఁచి తలఁచి పొగులుచునున్న నద్దనుజుఁ డెఱిఁగి.
గీ. వెనుక వచ్చెద నీవేగు మనుచు దాని, మున్ను గానంపఁబోలు నీవన్నెలాఁడి
మోసపోయిన నిదియును మొఱఁగిపోవు, ననుచు నొకయాగ్రహముఁ దెచ్చుకొని యతండు.
క. వేఱొకతావున నుండం, గోరికి మై నన్ను నెత్తికొని చనుదేఁబన్
వీరల్ చూడఁగ నైనది, మీ తెఱుఁగుదు రింక నేల మీఁదటి వార్తల్. 72
క. నాకథ యిట్లొఁగయ్యెన్, వ్యాకులముననింత కమ్మదాలస నెటకుం
దోకొనిపోయెనో దనుజా, నీకంబుల చేత నెంత నెగుల్పొందునొకో. 73
చ. తనువులె రెండుగాని వనితా మఱి ప్రాణములొక్కటమ్మ మా
కని పలుకంగ సిగ్గువలుక ద్యెడు నట్టి ప్రియాళిఁ బాసి యీ
యనువునఁ బ్రాణముల్ నిలిపినట్టి కతంబున దానిఁ జూడ కుం
డిన నిమిషంబు తాళఁగలనే! మఱియిచ్చటికేని నేఁడెదన్. 74
గీ. అనిన నూరార్చి యవ్వార్త నరసి వత్తు, నుండుమని దాని నాయింట నునిచి యేను
బుడమిపై డిగ్గి వచ్చుచో నడుమఁ గంటి, నారదుని చేత నీసు చందంబులెల్ల. 75
క. విని యిచ్చటి కరుదెంచితి, మనముచ్చట లెల్లఁ దీరె మనక్షంతలనుం
గొనివచ్చెద నని తారా, వనజేక్షణ చనియె నిజనివాసంబునకున్. 76
ఉ. ఆసమయంబునం దొక వయస్య చెలత్కబరీవినిర్గళ
త్కుసుమపుంజముల్ చరణకంజము జాఱెల బ్రాలి మారుఁడా

యాసముతో వశీకృతికినై రజమెత్తఁగఁ బూజవెంబడిం
జేసిన రీతి మించి యతిచిత్రజనంబున వచ్చిమచ్చికన్. 77
క. అక్కఁ బుతధ్వజుఁ డటఁ యతఁ, డిక్కడికే తెంచెనఁట ఫణీశ్వరుఁడతనిం
గ్రక్కున నెదుర్కొనఁజనె, ఢక్కాపటుపటహతమ్మటధ్వనులాలయన్. 78
క. నగరికిఁ జని కెంపులపని సొగసులుగల మేడయెక్కి చూతమె యనినన్
మగువసిగమిన్నయరిగెన్, మొగమలరం జేటికాసమూహము గొలువన్. 79
ఉ. అంత భుజంగపుంగవుఁ డుదారతురంగశతాంగకోటితో
దంతిఘటాఘటాగ్రబహుధావిగళన్మదధార మార్గసీ
మాంతరమందు జల్లు కలయంపులకుం బునరుక్తి నింప న
త్యంతముదంతరంగుల నిజాత్మజులం గనుఁగొంచు వచ్చినన్. 80
గీ. అచట మున్నె తరుచ్ఛాయ నాశ్రయించి
యున్న యానరలోకమాన్యుండు నవ్వు
డెమరుగాఁ జని తోడ్కొని యేఁగి యచట
నుచితకృత్యంబు నడుప నయ్యురగ విభుఁడు. 81
గీ. లేచి నిలుచున్న మంత్రులఁ జూచి రాజు, గారి గుణకథనంబు లవ్వారిగాఁగఁ
దెలుప విన్నందులకు మేము పిలువనంపి, నపుడె వచ్చినయందుల కనుగుణంబు. 82
క. అని సన్నుతించి విడిదికిఁ జనుఁడెంచని కుంభినీంద్రజంభారిం దో
డ్కొని చని యట సలుపా నిం, డినయొక గేహమున విడిది నియమించె వెసన్. 83
చ. అతనికి నమ్మదాలస యుదారకథాభ్యుదయంబుఁ దెల్పి యో
క్షితివర పెండ్లి యిచ్చుటనె చేయుతలంపున నిన్నుఁ బిల్వఁ బం
చితినని సంబరం బొదవఁ జేసి ఫణీంద్రుఁడు పట్టణం బలం
కృతముగఁ జేయఁబంచె బహుకీర్తి ముహూర్తము నిశ్చయించుచున్. 84
క. అంతఁ గుండలఁ దోడ్కొని యరుగుదెంచి, తార యంతయు వినిమోదవారిరాశి
మగ్నయై తద్వివాహసంభ్రమముఁ జూచు, తలఁపు బొడమిన నచ్చోటనిలిచెనంత.
క. ఎలమి నల చిలువరాతే, చెలిచెల్వఁడు పెండ్లికొడుకు సింగారింపన్
జెలులను బనిచిన ననిచిన, తలఁపుల వారరిగి వసుతతు లింపొసఁగన్. 86
చ. పనిహరువుం బెనంగొనిన బంగరునిద్దఁపుఁ బెండ్లిపీఁటపై
జనపతి నుంచి యొక్క యెలజవ్వని మేల్ బురుసా రుమాలు గుం
డనపు మెఱుంగుపైఁ గవఁగఁ దాయెతుచేరుల నింపఁ దావి ఘు

మ్మను విరిపువ్వుటెత్తుల నొయ్యారముగా సవరించె నంతటన్. 87

మ. తళుకుం బావటబొట్టు చంపమున నృత్యంబాడు నాసామణిం
బలె నర్తించు సరంబురీతి నటనప్రావీణ్యముం జూపు గు
బ్బల హాసధ్వయ కంకణధ్వనుల సెబాసంచు మెచ్చింపమిం
పలయం బెం దరళాక్షి యొక్కతె ధరానాథాన్వయస్వామికిన్. 88

క. ముందుగ నిగ్గులనీలము, లొందింపక చిక్కువడక యుండ న్నెఱులన్
గండపుటటక లిడియె నొక, యందపునెఱవన్నెలాఁడి యన్నరపతికిన్. 89

మ. జలముల్ తెచ్చినపైఁడిబిందియల మెచ్చంబోని ఘర్మాంబుకం
దళిపుం జన్నులమిన్నలీయ లతలానంపమ్మునం దేనెపో
పలునంచన్ పలువొంది తుమ్మెదలనన్ రాజిల్లఁగాఁ బెన్నెఱుల్
జలకం బార్చిరి కొందఱింగుముఖులాసర్వంసహానేతకున్. 90

చ. చలువలొసంగి వేడుక పొసంగ మెఱుంగుపరంగిపీఁట న
న్నెలఁతలు రాచ కేమగని నిల్పి కురుల్ తడియార్చి గోయలం
గలయఁగ దువ్వుచున్ హొయలుగా సిగవైచి మెఱుంగుముత్యమున్
గులికెడు బాసికంబు పగఁ గుట్టి రుమాలును గట్టిరంతటన్. 91

గీ. కలికియొక్కతె పెట్టె చొక్కట్లు పెట్టె, ముదిత యొక్కతె నీలంపుమురువు నిలిపె
రమణి యొక్కతె పచ్చతురాయమర్చెఁ, గాంత యొక్కతె తెలిపతకంబు లిడియె. 92

క. ఈరీతిఁ జెలులు నృపుసిం, గారించి యనంతభుజగకాంతుపనుపునం
దార మొదలైన వారొ, య్యారింగ సేయ నిర్భరానందమునన్. 93

వ. భుజంగపుంగవుండభంగురత్వరాయత్తచిత్తంబులో బడిబడిలబనుపఁ బుడిబుడిం
జనుదెంచి యమాత్యులు ముహూర్తకాలం బాసన్నం బయ్యెనంచుఁ విన్నవించినం బ్ర
సన్నవదనంబుతోఁ జిన్నివెన్నెలతో సరిమన్నెఱికంబు సల్పించు కప్పురంబులతోడి
విడియంబు లొసఁగి గద్దియ డిగ్గి ముద్దియలొసంగు కైదండఁ గొని విడిదివెలువడి
యుద్దండగండమదధారావిభ్రమభ్రమరీ మండలంబగు వేదండంబు నెక్కి వామ
హస్తంబునం బ్రశస్తమణిగణోత్కీర్ణంబగు నంకుశంబునం గుంభంబులూఁది వెనుకం
దగునూడిగంపుఁ జేడియ లందియిచ్చు పావడకుం దెలనాకుమడుపులకుం జాచు ద
క్షిణకరంబునం బొసంగు నుంగరంబులం జెలంగు మగతాల[illegible]డాలు పరిచారకులపై
వ్రాలిపావడలతో వీడఁజోడాడ నిజప్రకల్పితతరంగతురంగవోన్నిద్రుండగుటకు
మెచ్చి తరణియనిపినకిరణసహస్రంబులనం బెంపుఁగను కరదీపనికాయంబులు త

లతలనం బ్రతిఫలించి గజాంబుధిరాజపుత్రికారాత్రికంబు సవరింపంబరంపరలై బా
రు దీరు బ్రతాపాంకురంబులనం బరగుఁ బురుసలతోఁ గురుంజులపైఁ దిరుగు నుఱగ
కరిగమనల వలయాకారపరిభ్రమచ్ఛిరోమణీనికాయంబులకు సంగడీలై తురంగ
లింప రంగదుత్తుంగభర్మ్యహర్మ్యాగ్రంగనావికీర్ణలాజాసమాజంబులు భానుకల్పితం
బులగు ముత్తెంపుఁ దలఁబ్రాలునకు స్మారకంబులై రకంబుఁజూప వింతకోపుల
నాఁడు వెలచేడియల మైసిరియొడం దళుకుతళుక్కుమనం బిక్కటిల్లిన వెన్నెలల
క్షీణమణిగవాక్షంబుల వలనం జూచు నవరోధగిరి పయోధరల మొగంబుల ముస్తు
బట్టబయలు చేయ సర్వసన్నాహంబు మెఱసి యనుగుదెంచిన కువలయాశ్వనశ్వత
రోరగేశ్వరుం డెదుర్కొని నీరాజనాద్యుపచారంబులు నడిపించి తోడ్కొని చని
వివాహవేదికాంతరంబున సుఖసమాసీనుం జేసిన యనంతరమున. 94

చ. వరుస మెఱుంగు బాసికపు వజ్రపుఁ గుచ్చుల గచ్చుపైఁ బరా
బరి యొనరించు ముత్తియపు బావిలినిగ్గు పరాకుఁ దెల్ప ని
బ్బరముగఁ గొంకుఁజూపు దొరపాదనఖద్యుతి మీఁదిసేరమే
యరయ వివాహవేదికడ కల్లమదాలస వచ్చినిల్చెనన్. 95

సీ. తరుణులు వెలిపట్టు తెరవట్టఁగా నశ్వతరుఁడు దేవిపసిండి తళుకుగిండిఁ
బన్నీరు వంప భూపాలు పాదాబ్జముల్ కడిఁగి కన్నియమాట కరణిఁ దనరు
మొనగిక్రొంజిగి కట్టు ప్రాలపుట్టికలపైఁ బతియుసతియు
నిలిచిన ముద్దుగుమ్మలసోబనపుఁ బాట నిజపురోహితవేదనినదమఖిల
వాద్యఘోషంబు ఘనవైభవంబు మెఱయ, దారవోసెను పదపడివారుకొంకు
సిగ్గు తమకంబుఁ జిఱునవ్వుఁదొంగలింప, నొండొరులమాట వీక్షింప నుచితరీతి. 96

మ. కులుకుల్ సందిటఁ జెందు మైలతిక కొంగుల్ రంగులీనంగఁ గ
మ్మల డాల్ చెక్కుటఁ బల్లటీలుగొనఁ గొమ్మల్ చేరిపోయించఁగా
బలు ఠీవుల్ పచరించు చూపుజిగితో వాదించు ముత్తెంబులం
దలఁబ్రాల్వోసె వధూటి భూధవసుధాధామోత్తమాంగంబునన్. 97

క. అంగాంగసంగతిని దన, ముంగైచెమరింపఁ గంతమున సతికిన్ రా
జాంగజుఁడు కట్టె మణిమయ, మంగళసూత్రంబు జాయమానోత్సవుఁడై. 98

క. తాలిమిఁ బురోహితుఁడు మం, త్రాళుల్ చదువంగ నిర్భరానందమునం
గీలిఁదగ దంపతుల్ మతి, వేలిమి గావించి రుచితవిధమున నంతన్. 99

గీ. మంత్రశ్లోకములెసంగ సన్నికల్ మట్టఁ జేసి, రప్పుడు పురోహితచయంబులంతనురగ

కాంతు లందఱుఁ గట్టువర్గములగములు, వరుసఁ జదివించి రవ్వధూవరుల కెలమి. 100

ప. ఇవ్విధంబున వివాహమహోత్సవంబు ప్రవర్తిల్లినం దినచతుష్టయానంతరంబునం బ్ర
తిప్రయాణోన్ముఖుండైన కువలయాశ్వునకు నశ్వతరుం డనేకవస్తువులరణంబొసంగి
మదాలసావిలాసవతికిఁ బుద్ధులు గఱపి కుమారద్వయంబును దారాకుంభలాది వేదం
డగమనలను వెంటం గూర్చి యనిపిన రథారూఢులై వారు గోమతీనదీముఖంబునఁ
బాతాళలోకంబు నిర్గమించి శోభనాలంకారాకారంబగు నయోధ్యాపురంబుం బ్ర
వేశించి గృహప్రవేశంబు గావించి యున్నమఱునాఁడు దినాంతసమయంబున. 101

ఉ. ముంగల నుబ్బచప్పరము ముత్తెపు ముగ్గులుఁ బూలమేలుక
ట్లుంగొదలేని చిత్తరువులున్ బురుసాపనితోడిమంచముం
జెంగట బీరువాగముల చెల్వము గల్గిన కేళిగేహసీ
మంగమనీయవేషమున మానవనాయకుఁడుండు నయ్యెడన్. 102

గీ. తార కుండల మొదలైన తలిరుఁబోఁడు, లమ్మదాలసఁ జూచి రావమ్మ నీకు
వరశుభప్రాప్తి చేకూర వలయు ననుచు, ననుచు వేడుకఁ దమలోన నవ్వుకొనుచు.

చ. జలకముఁ దీర్చి పావడ కళల్ వడిమార్చ్మడివైచి జాలువా
వలిపెముఁ గట్టి గుబ్బల జవాదియలంది తురాయిరీతిగా
నలరులు గొప్పునందుఱిమి హారములుంచి పిసాలికస్తురిం
దిలకము ముద్దుగా నుదుట దిద్ది గుముల్గొని వారలత్తఱిన్. 104

సీ. అన్నియుఁ దెలిసిన వన్నెలాఁడికినీకు దెలిపెడిదేమమ్మ కలువకంటి
వినవమ్మ మగవాని మనసు చూడఁగఁ గందుఁబడను వంటిదిసుమీ పద్మగంధి
యిన్నాళ్లవలెఁ దోడి యింతులతోడి యాటలుగావుగద యిదితలిరుఁబోఁడి
యిదిపతి మనమెట్టు లెనయించెదో నేఁడు నీనేర్పుచూతము నీరజాక్షి
యిక్కడనె యింతసిగ్గైన హృదయనాథు, నెట్లు గరఁగింప నేర్చెదే యిందువదన
భావమెఱిఁగినజాణవుగా వెసమయ, మెఱిఁగి తత్తీర్పు సేయుమీ యిగురుబోణి. 105

గీ. అనుచుఁదోతేఱి నప్పుడవ్వనజవదన, సిగ్గు వెనుకకుఁ దిగువ నెచ్చెలులఁ జుఱుకు
మాటముందటికీడ్వంగ మందగమన, మినుమడింపఁగఁ జనికేళిగృహముఁ జేర 106

క. వనజాక్షులంద ఱొక్కొక్క, పని నెపమున జరుగ సరసఁ బగడపుఁ గంబం
బును జాఁటుగాఁ గొనుచు ని, ల్చినతరుణిం జూచి విభుఁడు చిఱునవ్వొలయన్. 107

గీ. లేచి నిలువున నే కౌఁగిలించుకొనుచు, విరులపాన్పుననుంచి పెన్నెఱులు దువ్వి
కప్పురపుఁదావి గుప్పు బాగాలొసంగి, పొదలి తమకంబు రెట్టింపఁ బుజ్జగించి.

సీ. అలరులానిన తుమ్మెదలొ నిక్కుపున్నంగొ తరుణిచూతమటంచుఁ గురులు దువ్వి

కమ్మబంగరు సిగ్గొ కలిగినపలుఁడాలొ చెలువచూతమటంచుఁ జెక్కునొక్కి
ముక్కున ముత్తియంపు మెఱుఁగొ లేనవ్వొ ముదితచూతమటంచు మోవిపుడికి
కుంకుమ జిగియొ నెక్కొను గుంపుదంపయో కొమ్మచూతమటంచు గుబ్బలంటి
తెలివిరియైమీరు నూగారు దీప్తియొక్కొ, మేలి మొలనూలి నీలమో మెఱుఁగుబోఁడి
చూతమని పోకముడివిప్పి సుదతిఁగరఁచి, యించుఫలుకాని సామ్రాజ్యమేలివిభుఁడు.

క. అంతట వేఁగిన ధరణీ, కాంతుఁడు సంధ్యాదికములు గావించి ప్రజన్
సంతసమునఁ బాలింపుచు, నింతింగవఁ గూడి సౌఖ్యమెనయుచు నుండెన్. 110

వ. మునీంద్రా! మార్తాండదత్తంబగు కువలయాశ్వంబు వలనం జయంబందుటంజేసి ఋ
తధ్వజుండు కువలయాశ్వుండనంబరఁగననిన సంతోషమధుర్యంబునై జైమినిముని యవ్వి
హంగములం బూజించి సుఖంబుండెనంత. 111

క. ఈకువలయాశ్వచరితముఁ, గైకొనిచదివినను వినినఁ గారుణ్యసుధా
శ్రీకరుఁడు కృష్ణుఁడొసఁగున్, శ్రీకరముగఁ బుత్రపౌత్రచిరవిభవంబుల్. 112

శా. పూర్వగ్రస్తవినిర్మలత్వ బహిరుద్బద్ధారకీర్త్యంకురా
ఖర్వచ్ఛాయ కరస్థఖడ్గ, సబలాకారేఖ మేఘోల్లస
త్సర్వాశౌఘతమిస్రఘస్మరమహాసౌదామినీసూతికా
గుర్వర్థార్పణ వ్యాప్తయాచకజనా కోదండలీలార్జునా. 113

క. ధాత్రీకరటి ఘటారథ, కోటిక్షితిహారికుంభికుంభతటమణీ
కోటీవైవాహికము, క్ష్మాత్రీకనవిజయమాశ్రితకరాంబురుహా. 114

మాలిని—పరిభృతభుజతేజా భానుమద్బింబభానూ
ద్భవహరిదబలాంగ స్థాయిఘర్మోదబిందూ
భవదనభిముఖాపి భ్రామ్యదైభాగ్రహస్తా
ప్రవివృతబలతేజా ప్రౌఢకీర్తిప్రకాశా. 115

గద్య.

ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ సవరమన్వయా
భరణ నారాయణభూపాలతనూభవ శఠగోపతాపసేంద్రచరణారవింద సంచలన్మా
నసమిళింద సంతతభారతభాగవతాదిశ్రవణానంద కామినీమనోహర రూపరేఖావిజి
తచైత్రకాశ్యపగోత్రపవిత్ర జాతివార్తాకవిజనామోదసంధాయక చిననారాయణ
నాయకప్రణీతంబైన కువలయాశ్వచరిత్రంబను మహాప్రబంధమునందు సర్వంబు
ను బంచమాశ్వాసము.

సమాప్తము.

